# చతుర

312వ సంచిక
జనవరి 2004 ★ రూ.7/-



## ప్రేమా! నీకు నమస్కారం

మీనాక్షి శ్రీనివాస్




# సచిత్ర విచిత్రం

## శారికల స్టాంప్

నెమలి తర్వాత అందమైన పక్షి చిలుక. ఎన్నెన్నో రంగులతో బహుసొగసుగా ఉండే ఈ శారికలు ఓ వర్ణచిత్రాన్ని స్ఫురణకు తెస్తాయి. ఇక్కడ మీరు అటువంటి రసరమ్య చిత్రాన్నే చూస్తున్నారు. ఆస్ట్రేలియాకు చెందిన 'బడ్‌గెరీగార్' అనే జాతి రామ చిలకలు ముద్దుముద్దుగా మాటలు చెప్తాయి. మన మాటలు అనుకరిస్తూ ఆనందం కలిగిస్తాయి. ఆమధ్య ముద్దులు మూటగట్టే వివిధ వర్ణాల సుందరమైన రామచిలుకలపై ఆస్ట్రేలియా ప్రభుత్వం కొన్ని స్టాంపులు ప్రచురించింది. వాటిని తిలకించండి!

# ఆరోగ్య ప్రదాయిని 'టీ'



తేనీరు మన నిత్య జీవితంలో ప్రముఖ పాత్ర వహిస్తోంది. ఉదయం ముందుగా ఓ కప్పు టీ తాగనిదే చాలామంది తమ పనిపాటలు ప్రారంభించలేరు. ఆ పానీయంలో ఎంతో ఉత్తేజం, ఉత్సాహం ఇమిడి ఉంది. మనదేశమంతటా టీపట్ల మోజు చూపేవారు కోట్ల సంఖ్యలో ఉన్నారు.

ఈ టీకి పోటీగా నిలబడే పానీయం మరొకటి ఉంది... అదే కాఫీ! అయితే కాఫీకి ఉత్తర భారతదేశంలో టీకి ఉన్నంత ప్రాముఖ్యతలేదు. తమ గృహాలకు ఏ అతిథి వచ్చినా ముందుగా ఇల్లాలు తాగడానికి నీరిచ్చి ఓ కప్పు టీ తప్పక అందిస్తుంది. కొందరు ఈ ద్రవాన్ని చాయ్ అంటే మరి కొందరు చాయ అంటారు. ఇంకొందరు చా అని పిలుస్తారు.

చైనా పదమైన 'చా' నుంచి ఈ చాయ అనే పదం ఉద్భవించింది అంటారు. దక్షిణాది రాష్ట్రంలో కాఫీ హెచ్చుగా తాగినా, టీకి కూడా ప్రాధాన్యం ఇస్తూనే ఉంటారు. టీ సేవిస్తూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, సాయంత్రం సమయంలో ఒకరితో ఒకరు ఆనందాన్ని పంచుకోవడం అందరూ చూసే మధురమైన దృశ్యం!

అమెరికాలోని బోస్టన్ టీ పార్టీ సృష్టించిన చరిత్ర అందరికీ తెలిసిందే.

టీని తయారుచెయ్యడం చైనా, జపాన్ లలో ఒక చక్కటి కళ. క్రీస్తుకు పూర్వం 2737లో చైనా చక్రవర్తి షెన్‌నుంగ్ తన సామ్రాజ్యంలో సంచరిస్తూ ఉండగా, ఒక వృక్షంకింద కూర్చుని సేదదీరుతూ తన సిబ్బందిని వేడినీటిని కాచమని ఆజ్ఞాపించాడు తాను తాగడంకోసం. అదే సమయంలో కొన్ని టీ ఆకులు గాలికి ఎగిరి కాగుతున్న నీళ్ళలో పడడం జరిగింది. ఆ నీటిని చక్రవర్తి తాగిన కొద్దిసేపటిలోనే ఆయనలో ఏదో నూతనోత్తేజం కలిగింది.

అంతేకాదు, ఆ సమయంలో ఆయన డీసెంట్రీతో బాధపడుతున్నాడు. తేనీరు సేవించాక ఆ సమస్య కూడా సర్దుకుంది. దాంతో తేయాకు ఔషధ గుణాలతో కూడిన గొప్ప ఆకు అని తెలుసుకున్నాడు.

వెంటనే చక్రవర్తి షెన్‌నుంగ్ ఒక చిన్న పొదవలే వున్న టీ మొక్కలవద్దకు వెళ్ళి వాటిని పరీక్షించాడు. ఆ చెట్లను కొన్నిటిని తన సిబ్బంది చేత తీయించి తనవెంట తీసుకువెళ్ళాడు. ఆ విధంగా ఆయన తేనీటికి ఆద్యుడయ్యాడు. చైనాలో టీ సేద్యాన్ని చక్రవర్తి విస్తరింపచేశాడు. టాంగ్ చక్రవర్తుల పరిపాలనాకాలంలో (618-907) టీ చైనావారి జాతీయ పానీయం అయింది. బౌద్ధగురువులు తేనీటిని ఆప్యాయతతో సేవించేవారు. వారు తూర్పుదేశాలలో టీ వ్యాప్తికి విశేషంగా కృషి సలిపారు. ఆ మత గురువులు తమ ఆరామాలలో సహితం

ముఖచిత్రం మోడల్: **అనూష** ☆ ఫొటోగ్రాఫర్: **మధు**

తేయాకు వ్యవసాయం చేసేవారు. చక్రవర్తుల భూములలో సహితం వారు టీ మొక్కలను నాటి, వాటి విస్తరణకు కృషిచేశారు. 8వ శతాబ్దంలో బౌద్ధపీఠాధిపతులు తమ పర్యటనలో జపాన్ దేశానికి టీని పరిచయం చేశారు. అచ్చట టీ అభివృద్ధికి సలహాలు ఇచ్చి, స్వయంగా వ్యవసాయం చేసే

పోర్చుగీస్‌వారి ఓడల్లో ప్రయాణించి 16వ శతాబ్దంలో తూర్పుదేశాల్లో టీని ప్రవేశపెట్టారు. 1657లో మొదటిసారిగా ఇంగ్లాండులో టీ అమ్మకాలు జరిగాయి. 'గారీవేస్' కాఫీ హౌస్‌లో మొదట తేనీరు అందించబడింది. తతిమా కాఫీహౌస్‌లు సహితం స్పందించి తమ హోటళ్ళలో కూడా టీని



టీ ఆకును సేకరించడం అనేక మంది స్త్రీల జీవనాధారం

వారు. పర్షియన్ వ్యాపారస్తుడు హాజీమహమ్మద్ తొలిసారిగా ఐరోపా ఖండంలో టీని ప్రవేశపెట్టాడు. అతను రచయిత అయిన జిమామ్ బటిస్టా రామోసియోకు టీ తయారుచేసే పద్ధతినీ, దాని ప్రాశస్త్యాన్నీ వర్ణించి చెప్పాడు. తన చైనా పర్యటన గురించీ, అచ్చటి ప్రజలు టీ తయారుచేసే పద్ధతినీ వివరించాడు. పర్షియాలో సహితం తేనీటిని ప్రజలు ఎంతగా ఇష్టపడేదీ, ఆ రచయితకు తెలియచేశాడు.

జెసూట్ మిషనరీలు బృందాలుగా ప్రవేశపెట్టారు.

1662లో పోర్చుగీస్‌కు చెందిన కేథరిన్ అనే సౌందర్యరాశి రెండవ ఛార్లెస్‌ను పెళ్లి చేసుకొని ఇంగ్లాండు రాజప్రాసాదానికి వస్తూ తన సామగ్రి, సారె వగైరాలతో పాటు అనేక టిన్నులలో టీ పొడిని కూడా తెచ్చింది. ఆమె రాజకుటుంబీకులకు అందరికీ తేనీరు రుచి చూపించింది. కేథరిన్



టీ మొక్కలకి చీడ పీడలు తగలకుండా ప్రత్యేక ఎరువులను పిచికారీ చేసే దృశ్యం

వలన ఇంగ్లాండులో అందరూ టీ తయారు చేసుకొనడం ఆరంభించారు.

17వ శతాబ్దంలో టీ ఖరీదు చాలా హెచ్చుగా ఉండేది. అది అరుదుగా లభించడంచేత, తతిమా పానీయాలు అన్నిటి కన్నా ఎక్కువగా పన్నులు విధించడం చేత దాని ఖరీదు హెచ్చుగా ఉండేది. 1773లో ఈస్ట్ ఇండియా కంపెనీవారు చైనాతో ఒప్పందం కుదుర్చుకొని ఇండియాలో టీని హెచ్చు ధరకు అమ్మేవారు. ఇంగ్లాండులో సహితం వారి వ్యాపారం బాగా సాగింది. 18వ శతాబ్దంవరకూ టీ ధర ఎక్కువగా ఉండడం వలన తేయాకు దొంగతనంగా రవాణా అయ్యేది. స్మగ్లింగ్ విస్తారం అయింది. కల్తీలు జరిగేవి.

1834లో టీపై పన్ను తగ్గించబడింది. అంతేకాక అప్పటికి ఈస్ట్ ఇండియా కంపెనీవారి గుత్తాధిపత్యం అంతరించడం వలన కూడా తేయాకు చౌకగా లభించసాగింది. నిజానికి మనదేశంలో టీ తోటలను వెయ్యడం, టీ ప్రాచుర్యానికి పాటుపడడం, ఆ పానీయంపై ప్రజలలో అభిమానాన్ని రేకెత్తించడం బ్రిటిష్‌వారి చలవే!

స్కాటిష్ సాహసవీరుడు రాబర్ట్‌బ్రైస్ 1820లో అస్సామ్‌లో తేయాకు మొక్కలు గమనించాడు. అంతవరకూ మనదేశంలో తేయాకు మొక్కలు వున్న విషయం ఎవ్వరూ గమనించలేదు. అరణ్యాలలో గిరిజన నాయకుల నేతృత్వంలో టీ మొక్కలు

పెంచుతూ ఉండడం బ్రూస్ చూశాడు. 1834లో బ్రిటిష్‌వారు ఒక కమిటీని మన దేశానికి పంపారు ఇక్కడ టీ వ్యవసాయా నికి అనుగుణమైన పరిస్థితి ఉన్నదీ లేనిదీ కనుగొనడానికి. ఆ బృందం వారు పలు ప్రదేశాలలో సంచరించి, విస్తృతమైన పరిశో ధనలు జరిపి, మనదేశంలో టీ వ్యవసా యానికి అనుగుణమైన వాతావరణం ఉన్న దని బ్రిటిష్‌వారికి తెలిపారు.

చివరికి 1839లో అస్సామ్‌లో తొలిసారిగా టీ ఉత్పత్తి అయింది. ఆ విధంగా అప్పట్లో ఒక్క చైనాలో మాత్రమే లభించే టీ మన దేశంలో కూడా లభించే పరిస్థితి ఏర్ప డింది. తర్వాత ఇంగ్లాండులోని వ్యాపార స్తులు మనదేశంలోని వెయ్యి టీ పెట్టెలకు తొలిసారిగా ఆర్డరు ఇచ్చారు. భారతదే శంలో పేరుపొందిన అతిపెద్ద టీ కంపె నీలు అస్సామ్, డార్జిలింగ్‌లలో ఉన్నాయి.

అస్సామ్‌లో పేరుప్రఖ్యాతులు పొందిన 'బ్లాక్ టీ' లభిస్తుంది. చైనా తర్వాత ప్రపం చంలో అత్యధికంగా బ్లాక్ టీ లభించే ప్రదేశం అస్సామ్ మాత్రమే! అస్సామ్ టీ స్ట్రాంగ్‌గా, నల్లటిరంగులో, రుచిగావుండి, స్ట్రాంగ్ టీ తాగేవారికి ప్రీతిపాత్రంగా ఉంటుంది.

తేయాకును మనదేశంలోని నీలగిరి టీ ఎస్టేట్స్‌లో ఊటీ, కొడైకెనాల్, తమిళనా డులోని ఎర్‌కార్‌లలో కూడా పండిస్తున్నా రు. ప్రపంచంలో నేడు తేయాకు హెచ్చుగా ఉత్పత్తయ్యే దేశం భారతదేశం. చైనా, శ్రీలంక, ఇండోనేషియా, మలావీ, కెన్యా, జింబాబ్వే, పపువా న్యూగినియా, బంగ్లాదేశ్, కాంగో, కామెరూన్, దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా, జపాన్, తూర్పు ఐరోపాలలో సహితం టీని పండిస్తు న్నారు. మనదేశం టీని ఉత్పత్తి చేసే దేశా లలో అతిపెద్దది. 4 లక్షల హెక్టార్లలో టీ పండించడం జరుగుతోంది.

ప్రపంచంలో టీని హెచ్చుగా ఎగుమతి చేసే దేశం శ్రీలంక. అక్కడ 2 లక్షల హెక్టార్లలో తేయాకు ఉత్పత్తి జరుగుతోంది. అచ్చట వున్న వాతావరణ పరిస్థితులవలన సంవత్సరం అంతటా పలు ప్రదేశాలలో తేయాకు రూపొందుతూనే ఉంటుంది.



ఎగుమతికి తయారౌతున్న తేయాకు పొడి



అందమైన కప్పుల్లో
తేనీటి సేవనం
మరింత ఆహ్లాదం

భారతదేశం, శ్రీలంక తర్వాత చైనా దేశం నుంచి హెచ్చుగా టీ ఎగుమతి అవుతుంది.

పానీయాలలో టీ అత్యుత్తమమైన పానీయమే కాక, ఎంతో రుచికరమైనది కూడా. తేనీరునుంచి వెలువడే సువాసనను అంతా ఇష్టపడతారు. దానిలోగల అనేక మంచి గుణాలను చైనావారు శతాబ్దాలక్రితమే గుర్తించారు. బౌద్ధారామాలలోని బౌద్ధగురువులు ధ్యానంచేసే సమయంలో నిద్రకు గురికాకుండా ఉండడంకోసం తేనీరు సేవించేవారు. ఆ పానీయంలో శరీరానికి అపకారం చేసే పదార్థం ఏదీలేదు. ఎ, బి, ఇ, కె విటమిన్లు ఇందులో ఇమిడి ఉన్నాయి. 25 శాతం కార్బోహైడ్రేట్లు, 15 శాతం ప్రొటీన్లు, 5 శాతం మినరల్స్ కూడా ఉన్నాయి.

ఒక కప్పు టీలో 50 మి.గ్రాముల కెఫైన్ ఉండగా, అదే కాఫీలో అయితే 125 మిల్లీగ్రాముల కెఫైన్ ఉంటుంది. తేయాకు వేడి నీటిలో కలవగానే దానిలోని కాంపౌండ్స్ నీటిలో కలిసినా, అందులో గల మేలిమి గుణాలు నిలిచే ఉంటాయి. ఎండిన టీ ఆకులలో 36 శాతం యాంటియోక్సిడెంట్స్ ఉన్నాయి. పండ్లలో కాయగూరలలో గల యాంటియోక్సిడెంట్స్ కన్నా టీలో గల యాంటియోక్సిడెంట్స్ శరీరానికి ఎంతో మేలు చేస్తాయి. అవి మరింత ఉత్తేజం కలిగిస్తాయి.

తేయాకు వ్యవసాయం, ప్రాసెసింగ్ వలన మనదేశంలో 10 మిలియన్ల మందికి ఉపాధి లభిస్తోంది. శరీరానికి ఎంతో మేలు చేసే టీ నేడు కూల్‌డ్రింక్స్ వలన పోటీ ఎదుర్కొంటోంది. కోలాలు, కార్బొనేటెడ్ డ్రింక్స్ ప్రభావం యువతపై హెచ్చుగా ఉంది. ప్రముఖ వ్యాపార సంస్థలు ఈ డ్రింక్‌ల వ్యాప్తికి విశేష కృషి చేస్తున్నాయి. పత్రికలలో, హోర్డింగ్‌లపై వాల్‌పోస్టర్ల ద్వారా భారీమొత్తాలను ఖర్చు పెడుతూ ఆ సంస్థలు ఆకర్షణీయమైన ప్రకటనలు గుప్పిస్తున్నాయి. టీవీలలో ఇందుకు సంబంధించి ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ ప్రేక్షకులను ఎంతగానో ఆకర్షించి ఆ డ్రింక్స్‌పై మరులుగొలుపుతున్నాయి. అనేకమంది చల్లటి సాఫ్ట్ డ్రింక్స్‌లను ఆహారంతోపాటు సేవిస్తూ ఉంటారు. ఇందువలన

ఎంజైమ్స్) ధ్వంసం అవుతాయి. అరుగుదల దెబ్బతింటుంది.

తేనీటిలో కొవ్వులేదు. క్యాలరీలులేవు. చక్కెరలేదు. అది సహజ సిద్ధమైన పానీయం. వేడినీటిలో మరగడం వలన పరిశుభ్రపడుతుంది. శరీరాన్ని సేదదీగుస్తుంది. మేధస్సుకు చురుకుదనాన్ని కలిగిస్తుంది. టీలలో ఎన్నో రకాల టీలు రూపొందుతున్నాయి. దేనికదే ఎంతో ప్రత్యేకత కలిగి ఉండి శరీరానికి మేలు చేస్తుంది.

వాటిలో హెర్బల్ టీలు ఎక్కువగా అందరినీ అలరిస్తున్నాయి. ఇవి నిమ్మగడ్డి, స్పియర్ మింట్, గులాబీమొగ్గలు, రాస్‌బెర్రీ ఆకులు, చామోమైల్ పుష్పాలతో మిళితమై ఉండి శరీరానికి బహువిధాలుగా మేలు చేస్తాయి. శతాబ్దాల తరబడి ఇవి వాడుకలో వున్నప్పటికీ వాటిలో విశేషాలను ఈమధ్యనే కనుగొనడం జరిగింది. పుట్టగొడుగులతో తయారు కాబడే టీ, ఈ హెర్బల్ టీలలో ఒకటి. రష్యాలో గల కర్గానోక్ అనే ప్రదేశంలో తొలిసారిగా ఈ మష్రూమ్‌లు అనే పుట్టగొడుగులు ఉత్పత్తి అయ్యాయి. వాటిని భుజించిన అచ్చటి ప్రజలకి చక్కటి ఆయుప్రమాణం వుందంటారు. అవి వారిని సదా ఆరోగ్యవంతులను చేసి వృద్ధాప్యాన్ని త్వరగా దరిచేరనివ్వలేదు.

తేనీటిలో బ్లడ్‌ప్రెషర్‌లను తగ్గించే విశేషం కూడా ఉంది. శరీరంపై అకాలంలో ఏర్పడే ముడతలను వారిస్తుంది. శరీరానికి ఉత్సాహాన్ని అందజేస్తుంది. వన మూలికలతో రూపొందే తేనీరు అనేక రుగ్మతలను తొలగిస్తుంది. దక్షిణ ఆఫ్రికాలో లభించే 'రుబాబాస్' అనే టీని, 'ఆస్‌పాలాథస్‌లినాంస్' అనే మొక్కయొక్క సుగంధభరితమైన ఆకులనుంచి తయారు చేస్తారు. తలనొప్పి, ఉదరంలో నొప్పులు, అజీర్తి, ఉబ్బస వ్యాధులను నివారిస్తుంది ఆ తేనీరు. ఆ ఆకుల పేస్ట్‌ను చర్మానికి పూసినప్పుడు దురదలు, గజ్జి తొలగిపోతాయి. కేఫేన్ రహితమైన ఈ తేనీరు వేడిగానూ, చల్లగానూ తాగవచ్చు. ఈ ఆకులను సూప్‌లలో సాస్‌లలో సహితం వినియోగిస్తున్నారు.

ఇటీవల జరిగిన అనేక పరిశోధనల వలన టీ కేవలం తాగడానికేకాక ఇంకా అనేక విధాలుగా ఉపయోగపడుతుందనీ, ప్రత్యేకించి గ్రీన్‌టీ మగువలకు సౌందర్యాన్ని అందించే బ్యూటీట్రీట్‌మెంట్‌లో కూడా బాగా వినియోగపడుతుందని వెల్లడైంది. ప్రపంచ వ్యాప్తంగా గల అన్ని బ్యూటీ క్లినిక్‌లలోని సౌందర్య సాధనాలలో గ్రీన్‌టీ ఆకులను, అనేక కంపెనీలు మిళితం చేస్తున్నాయి.

మోయిశ్చరైజింగ్ క్రీమ్‌లు, బాడీలోషన్స్‌లలో నల్ల తేయాకు కలుస్తుంది. టీలోని సారం నేడు క్యాప్సూల్స్ రూపంలో కూడా లభిస్తోంది. విటమిన్-ఇకి 200 రెట్లుకుమించిన యాంటియోక్సిడెంట్స్ టీలో లభిస్తున్నవని శాస్త్రజ్ఞులు ప్రకటించారు.

1991లో అంతర్జాతీయ టీ సదస్సు జరిగింది. ఆ సమావేశానికి ఎందరో శాస్త్రజ్ఞులు హాజరయ్యారు. ఆ సందర్భంలో, టీలో గల అనేక మేలైన గుణాలు వెలుగులోకి వచ్చాయి. తేనీరు కొలస్టరాల్‌ను తగ్గించి హృదయ సంబంధమైన వ్యాధులను నిరోధిస్తుంది. బోస్టన్ యూనివర్శిటీ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో జరిగిన పరిశోధన వలన కరోనరీ ఆర్టెరీ వ్యాధిగల రోగులు టీని సేవించడంవలన ఆ వ్యాధి నుంచి త్వరితంగా విముక్తులు కాగలరని తేటతెల్లమయింది.

వయసు మారడంలోగల వేగాన్ని తేనీరు నెమ్మదిస్తుంది. ఇటీవల తేనీటిపై ఢిల్లీలో జరిగిన సమావేశంలో రోజుకు 8 నుంచి 10 కప్పుల టీ తాగడం వలన వృద్ధాప్యం తగ్గుతుందని వెల్లడైంది. ధూమపానం వలన కలిగే క్యాన్సర్ వ్యాధిని అడ్డుకొనడానికి టీ ప్రయత్నిస్తుంది. నోరు, ఉదరం,



నీలగిరిలో విస్తరించిన టీ తోటలు

చర్మం, ఊపిరితిత్తులు, యూరినరీబ్లాడర్స్‌లలో ఏర్పడే కేన్సర్‌ను టీ నిరోధిస్తుంది. తేనీరులో గల విటమిన్-కె శరీరంలో ప్రవహించే రక్తంలో ఏర్పడే గడ్డలను తొలగించి రక్తప్రసారం సాఫీగా జరిగేలా చూస్తుంది.

ఇది శరీరంలోగల ఎముకల పటుత్వాన్ని పెంచుతుంది. చికాగోలో గల ఇలినాయిస్ యూనివర్శిటీలో జరిగిన పరిశోధనలవలన ప్రపంచంలోగల పానీయాలలో బ్లాక్ టీ ప్రథమ స్థానం వహిస్తోందని వెల్లడైంది. టీ దంత వ్యాధులను నిర్మూలించి చిగుళ్లకు మేలు చేస్తుందని శాస్త్రజ్ఞులు అన్నారు. ఫ్లోరిడాలో గల ఓర్లాండోలోని కొందరు శాస్త్రజ్ఞులు, అనేక మంది వాలంటీర్ల చేత రోజుకు ఒక నిమిషం చొప్పున 10 పర్యాయాలు బ్లాక్ టీని పుక్కిలించేలా చేశారు. ఇందువలన నోటిలోని బాక్టీరియా పూర్తిగా తొలగింది. పళ్ల వ్యాధులు దూరమయ్యాయి. దంతవ్యాధులు నిరోధించడానికి బ్లాక్ టీలో పాలుగానీ, పంచదార, తేనెగానీ ఉండకూడదు.

తేనీరు కార్బోహైడ్రేట్స్ విడుదల నెమ్మదిగా జరిగేలా చేస్తుంది. ఇందువలన శరీరంలోని బ్లడ్ ఇన్సులిన్ లెవల్స్ క్రమబద్ధీకరణ జరుగుతుంది. స్థూలకాయులకు టీ వలన ఒక శుభవార్త త్వరలో అందనుంది! ఎలుకలకు పెద్ద డోసులో నల్లటీ ఇచ్చి కొన్ని పరిశోధనలు శాస్త్రజ్ఞులు జరిపారు. ఇందువలన వాటిలోని కొవ్వు తగ్గింది. ఈ పరిశోధన స్థూలకాయులకు ఎంతోమేలు చేస్తుందని శాస్త్రజ్ఞులు ప్రకటించారు.

కళ్ల చుట్టూ ఏర్పడే నల్లటి మచ్చలు తొలగించడానికి టీలో దూదిని ముంచి దానిని కళ్లపై కొంతసేపు ఉంచాలి. ఇందువలన క్రమంగా ఆ మచ్చలు తగ్గుతాయి. ఎండలో ఎక్కువగా తిరిగే వారికి సూర్యకిరణాల వలన చర్మానికి తీవ్రమైన హాని కలుగుతుంది. తేనీటిని, ఆలివ్ ఆయిల్‌ను కలిపి ఆ ద్రవపదార్థాన్ని ఎండకు గురి అయ్యే భాగాలకు రాసి, ఓ గంటవరకూ ఉంచాలి. తర్వాత నీటిలో దానిని శుభ్రపరచాలి. అటుపై ఎండ తీవ్రత శరీరానికి అపకారం



# సచిత్ర విచిత్రం

## జానపద చిత్రం

జానపదచిత్రకళలు నాటినుంచీ నేటివరకూ, కళాభిమానులను అలరిస్తూనే ఉన్నాయి. నేత్రోత్సవం చేస్తున్న ఈ చిత్రం 'వార్లీ' అనే చిత్రకళకు చెందినది. ఇది మహారాష్ట్రకు చెందినది. దేశవ్యాప్తంగా ఈ చిత్రాలను తమ గృహాలలో అలంకరించుకొని ఎందరో ఆనందిస్తున్నారు!

మహారాష్ట్రలోని థానే జిల్లాలోని గిరిజన వ్యవసాయదారులు (వార్లీ) చిత్రకారులు. నృత్యభంగిమలు, వేటాడే దృశ్యాలు, పంటలు పండిస్తున్న వ్యవసాయ దారులను ఆ చిత్రకారులు మనోజ్ఞంగా చిత్రిస్తున్నారు. రంగుల కన్నా, బియ్యంతో చేసిన పేస్టును ఎక్కువగా ఈ చిత్రాల్లో వారు వినియోగిస్తారు.



తేయాకు సేకరణలో పెద్దలతో పాటు పిల్లలు కూడా...

చెయ్యలేదు. తీవ్రమైన ఎండ సమయంలో నిమ్మరసం కలిపిన టీ, ఎండనుంచి కలిగే అసౌకర్యాన్ని తొలగించి సేదదీరుస్తుంది.

నెహ్రూజీ వివిధ రకాల ఆహారాల పట్ల అంతగా ఆసక్తి కనపరిచేవారుకారు. అయితే ఆయనకు టీ పట్ల మోజు ఎక్కువ. మౌలానా అబుల్ కలామ్ అజాద్ తెల్లవారు ఝామున 4 గంటలకే నిద్రలేచి స్వయంగా టీ చేసుకొని సేవించేవారు. భగత్‌సింగ్, ఆచార్యకృపలానీ, డాక్టర్ రామ్‌మనోహర్ లోహియా, జయప్రకాశ్ నారాయణ్, సుభాష్‌చంద్రబోస్, రవీంద్రనాథ్ ఠాగూర్ మున్నగు వారంతా తేనీరు తాగేవారు. ఇందిరాగాంధీ సాయంత్రం అయ్యేసరికి టీ మీదకు దృష్టి మళ్లించే వారు. రాజీవ్‌గాంధీ విదేశాలలో పర్యటించినప్పుడు వెంట టీ ప్యాకెట్లు తీసుకువెళ్లి ప్రముఖులకు బహూకరించేవారు.

ప్రపంచ వ్యాప్తంగా రోజూ 185 మిలియన్ కప్పుల టీ తాగుతున్నారు ప్రజలు అని అంచనా. 10 సంవత్సరాలు దాటిన వారంతా రోజుకు 4 కప్పుల టీని ఎంతో ప్రీతిగా తీసుకొంటున్నారు. ప్రపంచంలోనే రోజూ అందరికన్నా ఎక్కువగా టీ తాగే వ్యక్తి మార్క్‌షైర్‌లోని షెఫీల్డ్‌లో ఉంటున్నాడు. ఆయన పేరు పాట్ క్రోధర్. ఆ తేనీటిరాయుడు రోజుకు 70 కప్పుల టీని ఔపోసనపడతాడు.

స్కాట్లాండ్‌కు చెందిన అంగస్ వార్‌వియమ్ ఏకంగా 382 రోజుల పాటు ఏ ఆహారం తీసుకోకుండా కేవలం టీ మాత్రమే తాగి బతికాడు.

టీ వల్ల ఇన్ని ప్రయోజనాలున్నప్పుడు, అది తాగడం అలవాటు లేనివారు కూడా అలవాటు చేసుకోవడం మంచిది.

– కొడిమెల శ్రీరామమూర్తి

# ఏరినముత్యాలు

- సంపదను పోగొట్టుకున్నవాడు ఎక్కువగానే పోగొట్టుకున్నవాడవుతాడు, కానీ ధైర్యాన్ని పోగొట్టుకున్నవాడు సర్వస్వాన్నీ కోల్పోయినట్టే.

  – సెర్వాంటిస్

- మిడి మిడి జ్ఞానం అపాయకరం. అలాగే కొంచెమైనా జ్ఞానం లేకపోవడం మరీ అపాయకరం.

  – శామ్యూల్ జాన్సన్

- విద్యార్థుల గుణశీలాలు ఉపాధ్యాయుని వ్యక్తిత్వంపై ఆధారపడే నిర్మితమవుతాయి.

  – డబ్ల్యు ఎమ్.వెల్స్

- మన కష్టాలకు కాస్త నవ్వుకుని ఎదుటివాళ్ల కష్టాలను ఎగతాళి చెయ్యకుండా ఉండటం నేర్చుకోవాలి.

  – సెనెకా

- దానం పుచ్చుకోవడం పేదరికాన్ని కొంతవరకూ తగ్గించగలదు కానీ పూర్తిగా రూపుమాపలేదు.

  – మహాత్మాగాంధీ

- ప్రశ్నించేవాడు ఆ క్షణం మాత్రం మూర్ఖుడు. కానీ ప్రశ్నించలేనివాడు కలకాలం మూర్ఖుడు.

  – చైనాసామెత

- మంచీ చెడూ పనులవైపు మనల్ని లాక్కువెళ్లేది మన మనస్సే.

  – రామాయణం

- మన తప్పులను గుర్తుకు తెచ్చుకున్నప్పుడు ఇతరుల తప్పులను మరచిపోగలుగుతాము.

  – రాబర్ట్ ఇంగర్‌సాల్

- వివేకం ఆత్మ స్వరాన్నీ, ఆవేశం శరీర స్వరాన్ని ఆలపిస్తాయి.

  – రూసో

- గొప్ప వక్తలు సాధారణంగా గొప్ప కర్తలు కాలేరు.

  – ఆంద్రేమారోయిస్

- విశ్వాసాన్ని పెంచి పోషించు. భయాలు శుష్కించిపోతాయి.

  – నిర్మలానంద

- డబ్బుగలవాడు దానిని భద్రపరుచుకోవడంలో దిగులుపడతాడు. లేనివాడు అది లేనందుకు దిగులుపడతాడు.

  – హబ్బర్డ్

- ఒక సమస్య గురించి ఇతరులతో చెప్పుకుంటే అది సగభాగం అవుతుంది. కానీ సంతోషాన్ని పంచుకుంటే అది పదింతలవుతుంది.

  – థామస్ గ్రే

సేకరణ: అండమ్మ

# చతుర

సంపుటి : 26 సంచిక : 12
జనవరి : 2004 312వ సంచిక


"ఇదిగో రేవతీ! ఈ వెయ్యి రూపాయలూ తీసుకుని నువ్వు మీ పుట్టింటికి వెళ్ళిపో పాపతో సహా. నేను మా ఇంటికి వెళ్ళిపోతున్నాను. పాపం! అమ్మా నాన్నా నా గురించి అలమటించి పోతున్నారట" అన్నాడా ప్రేమికుడు.

"కార్తీక్! నీకేమయినా పిచ్చా? మనిద్దరికీ పెళ్ళయింది. మన ప్రేమ గుర్తుగా ఈ పాప. ఇప్పుడు మనిద్దరం ఎవరికి వాళ్ళం వెళ్ళిపోవడమేమిటి...?" అని అరిచింది ఆవేశంగా ఆ అమ్మాయి.

పెద్దల ఇష్టాన్ని కాదని ప్రేమమైకంలో చదువులు కూడా పూర్తిగా కాని ఆ ప్రేమజంట ఆవేశపడి పెళ్ళి చేసుకున్నాక... వాళ్ళని ఆలోచింపచేసిన పరిస్థితులేమిటి?

చివరికి వారి వైవాహిక జీవితం ఏ మలుపు తిరిగింది?

ప్రేమగాథల సాఫల్య, వైఫల్యాలకి సాక్షరరూపం

## మీనాక్షీ శ్రీనివాస్ రచన

# 'ప్రేమా! నీకు నమస్కారం'

ఈనెల చతుర సమగ్ర నవల



"ఏమండోయ్... ఇది విన్నారా? "

"ఏదీ, ఇంకా నువ్వు టేపు ఆన్ చెయ్యందే! ఏమిటీవేళ విశేషాలు? లోకలా, నాన్‌లోకలా" వేళాకోళంగా అడిగాడు శంకరం.

"మీకంతా వేళాకోళమే... మీ ఫ్రెండ్ గిరీశం లేడూ" సాగదీస్తూ అడిగింది పార్వతి.

"ఎందుకు లేడూ, నిక్షేపరాయుడిలా ఉన్నాడు హాయిగా"

"అబ్బబ్బ ఉండండీ. ఏదీ సరిగా చెప్పనియ్యరుకదా! గిరీశం ఉన్నట్లుండి ఇల్లు తాళం పెట్టి పెళ్లాం పిల్లలతో ఊరొదిలి చక్కాపోయేడట" ఆశ్చర్యంగా అంది పార్వతి.

"అదేమిటేవ్! ఉరుము ఉరిమి మంగలం మీద పడిందని సడన్‌గా వాడిని ఊర్నించి పంపేస్తున్నావ్. పాపం వాడేం చేశాడుట పాపం"

"మీకన్నీ నవ్వులాటే. ఆ వేళాకోళం కాస్త పక్కనపెట్టి కాస్త నేచెప్పేది సరిగా వినండి" సీరియస్‌గా అంది పార్వతి.

"సరే సరే... చెప్పు తల్లీ. ఏం జరిగిందో. అయినా నాల్గు రోజుల క్రితం మార్కెట్‌లో కలిశాడు. ఏమీ చెప్పలేదే? "

"ఎలా చెబుతాడులెండి. ఇదేమైనా సంబరంగా చెప్పుకునే విషయమా టాం...టాం చేసుకోవడానికి. వాళ్ల పెద్దమ్మాయి అదే రేవతి లేదూ. అది వాళ్ల నాన్న కొలీగ్ కొడుకును ప్రేమించిందట. వాళ్లదీ వీళ్లదీ ఓ కులమూకాదు, వీళ్లకి తగిన సంబంధమూ కాదు" అలసట తీర్చుకుందుకు ఆగిందావిడ.

"ఏమిటీ... ఇంటరు చదువుతున్న రేవతా? " ఆశ్చర్యంగా అడిగాడు శంకరం.

"మరే ఆ రేవతే... ప్రేమా లేదు దోమా లేదని తల్లీతండ్రీ గట్టిగా కేకలేసి ఆ పిల్లాడి తండ్రికి కూడా చెప్పి ఇంత గడ్డి పెట్టారట. అంతే, మొన్న రాత్రి ఇంట్లో చెప్పాపెట్టకుండా ఆ పిల్లకున్న నగానట్రా, ఇంట్లో వున్న డబ్బు దస్కం తీసుకుని ఉడాయించేరట ఇద్దరూనూ"

"ఛ... ఛ ఏమైపోతుందీ యువత. నిండా పదిహేడేళ్లయినా లేవు ఆ పిల్లలకు. వీళ్లకు ప్రేమా పెళ్లీ కావాల్సి వచ్చాయా. పాడు రోజులు, పిదపకాలం, పిదపబుద్ధులూనూ. అయినా అడ్డమైన సినిమాలూ చూసి తగలడిపోతున్నారిలా" బాధగా అన్నాడు శంకరం.

"పాపం ముగ్గురూ ఆడపిల్లలే అయినా ప్రాణంలా పెంచుకున్నారా పిల్లలని ఉన్నంతలో. నలుగురిలో తలెత్తుకోనీకుండా చేసిందా వెధవ పీనుగ పిల్ల" కసిగా తిట్టింది పార్వతి.

"సర్లే, నలుగురిమాట అటుంచు, చేజేతులా బంగారంలాంటి భవిష్యత్తు పాడు చేసుకుందికదా! ఆ వెధవ ఎలాంటి వాడో ఏమిటో? మోజు తీరగానే విడిచిపెట్టి పోతే ఏమైపోతుంది దీని బతుకు. అయినా కొలీగ్ కొడుకే అంటున్నావుగా. వెళ్లి నిలదీయాల్సింది వాళ్లను. ఇలా తప్పు చేసినట్లు ఊరొదిలిపోకుండా..." అసహనంగా అన్నాడు శంకరం.

"ఆ అదీ అయిందట... 'మాకేం తెలీదు, అయినా ఆడపిల్లని కనగానేసరా! అదుపాజ్ఞలలో పెంచగలగాలి. మాకున్నది ఒక్కగానొక్కడు. వెధవ దాని మోజులోపడి తల్లితండ్రులనీ, ఇంటినీ వదిలేసి పోయాడు. పెద్ద పెద్ద చదువులున్న వాళ్లకే బతుకు తెరువు లేదీరోజుల్లో. ఏం తిందామని పోయారో ఇల్లు వదిలి. పోనీ మాకసలు పిల్లలే లేరనుకుంటాం. అయినా ఇదంతా మీ వలనే వచ్చింది' అంటూ నానా మాటలు అని అవమానం చేసి పంపారుట పాపం"

"అవమానం కాదూమరీ... గిరీశం అంటే ఆఫీసులో అందరికీ ఎంత గౌరవం. ఎంత భయభక్తులు... ఎంత పెద్ద ఆఫీసరయినా అతని పనితనం ముందు, సిన్సియారిటీ ముందు తల వంచవలసినదే. ఇన్నేళ్లూ

ఎవరి చేత పన్నెత్తి మాట పడలేదు మరి. అటువంటిది ఈ విషయంలో నలుగురి నోట్లో నానడం అంటే తల కొట్టేసినట్లే అత నికి. ప్చ్... పాపం"

"అదే మరి పూలమ్మిన చోటే కట్టెలమ్ము కోలేక, నలుగురు అనే నానామాటలూ పడ లేక పిల్లాపాపతో సహా ఇల్లు ఖాళీ చేసి వెళ్లి పోయారుట. మరి ఉద్యోగం ట్రాన్స్‌ఫర్ పెట్టుకుంటాడో వదిలేస్తాడో"

"సరే సరే.. నాకవతల ఆఫీసు టయిమవు తోంది. ఇవాళ వడ్డించేది ఉందా లేదా"

"ఆ... ఆ... అయిపోవచ్చె... రండి స్నానం అదీ కానిచ్చి" హడావుడిగా వంటింట్లో దూరింది పార్వతి.

అన్యమనస్కంగానే అన్నీ కానిచ్చి ఆఫీసు చేరాడు శంకరం.

ఆఫీసులోనూ ఇదే వార్త... అందరూ అయ్యో అనేవారే. ఆ ఊళ్లోనే ఉన్న ఇంకో బ్రాంచి ఆఫీసులో పనిచేస్తారు గిరీశం, వెంక టేశం. గిరీశం కూతురూ, వెంకటేశం కొడుకూ కోఎడ్యుకేషన్ కాలేజీలో ఒకే క్లాసు చదువుతున్నారు. ఇద్దరూ చదువులో ఫస్టే మరి.

అంతగా ఇష్టపడితే ఇంట్లో వాళ్లకు చెప్పి, చదువులు పూర్తిచేసి, జీవితాల్లో స్థిరపడి అప్పుడు ధైర్యంగా పెళ్లి చేసుకోవాల్సింది. ఏం పిల్లలో వాళ్లకు తెలీదు. చెబితే వినరు. బంగారం లాంటి జీవితాలు ప్రేమకాటుకు బలయిపోతున్నాయి.

అసలు ప్రేమంటే ఏమిటో? కంటికి నచ్చిన వాళ్లనూ, ఇష్టపడిన వాళ్లనూ వెంటే సుకుని సినిమాలూ, షికార్లూ, హోటల్సు, పార్కులకు తిరగడమా?

ఇంట్లో వాళ్లకు చెప్పకుండా ఇల్లూ వాకిలీ చదువూ సంధ్యా అన్నీ విడిచిపెట్టి కన్నవారి గుండెల్లో చిచ్చుపెట్టి లేచిపోవడమా? ఏది ప్రేమంటే...

అంతలోనే ఫక్కున నవ్వొచ్చింది శంకరా నికి. ఏభైపడిలో పడ్డ తనకు ఈ సందేహాలు కలగడమేమిటీ అని.

ఏదో ఆలోచనలో మునిలా కూర్చున్న శంకరం అంతలోకే ఫక్కున నవ్వడం చూసిన అతని పక్కసీటు పరమేశం వింతగా చూశాడు. అవునుమరి ఎప్పుడూ తన పనేదో తను చేసుకుపోతూ బిజీగా ఉండే శంకరం అలా ఆలోచనల్లో కూరుకు పోవడం ఒక వింతైతే అలా ఉన్నట్లుండి నవ్వడం మరో వింత.

"ఏమిటి శంకరం! నీలో నువ్వే నవ్వుకుం టున్నావు? కాస్త మాక్కూడా చెబితే ఆ నవ్వులేవో మేమూ పంచుకుంటాంగా" అడి గాడు పరమేశం.

'తనెందుకు నవ్వేడో, తన ఆలోచనలూ ధర్మసందేహాలు వాళ్లతో చెబితే వాళ్లు నవ్వడం మాట అటుంచి తను నవ్వులపా లయ్యే ప్రమాదం ఉంది' అలా అనుకోగానే ఇంకోసారి నవ్వొచ్చింది శంకరానికి.

"ఆ ఏం లేదు" అంటూ పనిలో తల దూర్చాడు శంకరం. రోజులు గడుస్తు న్నాయి. ప్రశాంతంగా ఉన్న శంకరం మన సులో అశాంతి, అలజడి రేపింది రేవతి, వాళ్ల కొలీగ్ గిరీశం కూతురు, ఆమె ప్రేమ గాధా, ఇంట్లోంచి వెళ్లిపోవడం.

అసలు ప్రేమంటే ఏమిటీ? అందరూ ఆరాధించి అపేక్షించేది ప్రేమా... లేకపోతే అది తాత్కాలికమైన మోహావేశమా? ఇంచుమించుగా అందరి ఇళ్లల్లోనూ ప్రేమ అనే వైరస్ సోకి ఏదో రకంగా బాధపడుతు న్నవాళ్లు, బాధింపబడిన వాళ్లూ ఉన్నారు.

'అసలు ప్రేమించడం, ప్రేమించబడడం పుస్తకాల్లో, కథల్లో, సినిమాల్లో చూపించేంత అందమైనది, అవసరమైనది కాదేమో! ఓ కథా వస్తువు, ఓ చిత్ర వస్తువూ, కవితా వస్తువు, కావ్య వస్తువు అన్నింటా అందరికీ ప్రేమ. అది కూడా ఓ వయసులో ఉన్న అమ్మాయి, అబ్బాయిల ప్రేమ. ఏం ప్రేమంటే తల్లీబిడ్డల మధ్యది కాదా? అన్నా చెల్లెళ్ల మధ్య, ఇద్దరు ఆత్మీయుల మధ్యది

# ఏరినముత్యాలు

★ అంతరాత్మకు విరుద్ధంగా వ్యవహరించనివారు ఒక్క నైతిక నిష్ఠ గలవారు మాత్రమే.

– శారదాదేవి

★ అధికప్రసంగము, క్రోధము, అధికమైన అభిమానము, త్యాగబుద్ధి లేకపోవుట, ఉదరపోషణక కొరకు చింత, మిత్రద్రోహము... ఈ ఆరు ఖడ్గములు మానవుని ఆయుర్దాయమును నరికివేయును.

– విదురుడు

★ సమయం దాటబెడితే కాలమే ఫలాన్ని మింగివేస్తుంది.

– చాణుక్యుడు

★ మనకు నచ్చేవిధంగా తినాలి. కానీ ఇతరులకు నచ్చేవిధంగా దుస్తులు ధరించాలి.

– ఫ్రాంక్లిన్

★ పాపఫలములను ఇచ్చు కార్యములను ఆచరించనివాడే గొప్పవాడు.

– విదురుడు

★ ప్రపంచమనేది బాధపడేవారికి దుఃఖదాయకం, ఆలోచనాపరులకు సుఖదాయకం.

– ఫ్రెడ్ అల్లెన్

★ అనవసరంగా కోపించువారిని, ఫలితములేకపోయిననూ సంతోషించువారినీ లక్ష్యపెట్టకూడదు.

– విదురుడు

★ మన గురించి మన పిల్లలకు తెలిసినంతగా మనకు కూడా తెలియదు. కొన్ని వాళ్లు గమనించ లేదనుకుంటే అది పొరపాటే.

– జాన్ హేమంత్ కుమార్

★ తమ విద్యుక్త ధర్మం నిర్వహించడానికి సిద్ధంగా ఉండేవారికి భగవంతుని సహాయం ఎల్లప్పుడూ ఉంటుంది.

– క్యూలర్

★ మనము పూర్తిగా సుఖపడలేకపోవడానికి కారణం ఒక్కటే, మనకున్నదానిపై నిర్లక్ష్యం, లేనిదానిపై ఆరాటం.

– రియో

★ మాటలకంటే హృదయం, ఆచరణ గొప్పవి వీటిద్వారా మనం ఇతరులతో ప్రసంగించాలి.

– అనుభవానంద స్వామి

★ నువ్వు కోపంగా ఉన్నప్పుడు ఏ ఉత్తరానికీ జవాబు రాయకు.

– జాన్. హేమంత్ కుమార్

సేకరణ: **శివప్రసాద్ పండా**

ప్రేమకాదా! అసలు కనిపించే చెట్టుమీదా పుట్టమీదా పిట్టమీదా పూలమీదా ప్రేమ చూపించలేమా! దానిని ప్రేమ అనకూడదా'. ఎడతెరిపి లేకుండా అలా ప్రవాహంలా సాగి పోతూనే ఉన్నాయి శంకరం ఆలోచనలు.

"ఏమిటోనండి మీరీ మధ్య చాలా పరధ్యా నంగా ఉంటున్నారు. వంట్లో సరిగా లేదా ఏమిటీ? " శ్రీమతి ఆరాటం.

"ఏమిటండీ శంకరంగారూ! ఈమధ్య డల్ గా ఉంటున్నారు. పనిలో కూడా చురుకు తగ్గింది. అనారోగ్యమా లేక ఏదైనా ప్రోబ్లమా" ఆప్యాయంగా అడిగే ఆఫీసు జనం.

'అవును తను పి.జి చేసి కొన్ని ఏళ్ల యింది. అప్పట్లో తనకు మెడిసిన్ చదివి డాక్టర్ అనిపించుకోవాలని ఎంతో ఆశగా ఉండేది. ఇంటి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా తను చదువు అర్ధాంతరంగా ఆపేసి జాబ్ లో చేరవలసి వచ్చింది. తరువాత ప్రయివేటుగా డిగ్రీ ఆ తరువాత పి.జి చేశాడు.

డాక్టర్ చదవలేకపోయినా పిహెచ్.డి చేసి కనీసం పేరుకి ముందు డాక్టర్ తగిలిం చుకోవాలని పడిన తపన, ఆశ అన్నీ పెళ్లీ, పిల్లలు బాధ్యతలతోనే పోయాయి. క్రమేపీ తనూ ఆ మాటే మరచిపోయాడు.

"ఏమిటీ మళ్లీ ఏదో దీర్ఘాలోచనలో పడి పోయారు. కొంపదీసి మన పిల్లల..."

"అటువంటిదేమీలేదు. నువ్వు అనవసరంగా అక్కరలేని విషయాల గురించి ఆలోచించకు" అనుకోకుండానే కఠినంగా వచ్చేశాయి ఆ మాటలు శంకరం నోటినుంచి.

కళ్లనీళ్లు తుడుచుకుంటూ అక్కడుండలేక గబగబా లోపలికి వెళ్లిపోయింది పార్వతి.

"చ... నేను మరీ కఠినాత్ముడనౌతున్నా. మరీ అంత పరుషంగా మాట్లాడకుండా వుండాల్సింది" తనలోతనే అనుకుంటున్న ట్లుగా నెమ్మదిగా అనుకున్నాడు శంకరం.

చెదిరిపోతున్న మనసుని కూడదీసుకునే ప్రయత్నంలో మళ్లీ తన ఆలోచనలు కంటిన్యూ చేశాడు.

'పోనీ అన్ని బాధ్యతలూ తీరి, కామ్ గా ఉన్న ఇప్పుడు ఆ సరదా తీర్చుకోవచ్చుగా. తనకు సైకాలజీ అంటే చాలా ఇష్టం, చక్కగా సైకాలజీ సబ్జక్టు బాగా స్టడీచేసి ప్రేమ అనే టాపిక్ మీద థీసిస్ సబ్ మిట్ చేస్తేనో! నలుగురూ నవ్విపోతారేమో. ఆ ఏం నవ్వరు... ఎవరికిష్టమైన, నచ్చిన సబ్జ క్టులో వాళ్లు పిహెచ్.డి. చేసుకోవచ్చుకదా. ఓ. ఫిజిక్స్, కెమిస్ట్రీ ఎలాగో అలాగే మనిషి మనుగడకు ముఖ్యమైనదీ, మనుగడలో భాగమైనదీ ప్రేమ మీద మాత్రం ఎందుకు పిహెచ్.డి చెయ్యకూడదూ..., అని.

అనుకున్నదే తడవుగా ప్రఖ్యాతి చెందిన సైకాలజిస్టుల మనస్తత్వ పుస్తకాలను సేక రించి చదవడం మొదలుపెట్టాడు శంకరం. చూస్తుండగానే ఏడాది గడచిపోయింది.

శంకరం భార్య పార్వతి ఏదో వానాకాలం చదువులు చదివింది. ఈమధ్యకాలంలో భర్తలో వచ్చిన మార్పు, అదే పనిగా ఆలో చనల్లో పడటం, ఇప్పుడిలా పుస్తకాలు ముందేసుకుని కూర్చోడం చూసి ఓ రోజు నిలదీసింది.

"ఏమిటీ! ఈమధ్య అదోలా ఉంటున్నారని ఎంత అడిగినా బదులివ్వరూ. అనా రోగ్యమా అంటే అదీకాదు. ఇప్పుడేమో రాత్ర నక, పగలనకా పుస్తకాలు ఏవో తిరగేస్తు న్నారు. ఏమిటి సంగతి? " ఆరాగా నిలదీ సింది పార్వతి.

చెప్పినా అర్థం కాదని తెలిసినా చెప్పక పోతే ఊరుకోదని తెలిశాక విషయం చెప్పాడు శంకరం.

"ఏమిటో మీరూ మీ విడ్డూరపు కబు ర్లూనూ. ఇంతకూ ప్రేమ మీద రిసెర్చ్ పిహెచ్.డి కేవలం థియరీయేనా. లేకపోతే ప్రాక్టికల్స్ కూడానా" అడిగింది అదోలా.

"ఈ వయసులో అదొహటే తక్కువ నా ముఖానికి" విసుక్కున్నాడు శంకరం.

"ఏం మీ వయసువాడేగా మీ స్నేహితుడు రావు. పెళ్లాం పిల్లలని విడిచిపెట్టి ప్రాక్టీస్ విడిచిపెట్టి ఎవతెంటో పడ్డాడుగా. అదీ పాతికేళ్ల పిల్ల వెంట. హవ్వ... ఈయనకు లేకపోతే సిగ్గు ఆ పిల్లకు బుద్ధెలా లేకపోయిందో తండ్రి వయసు వాడిని కట్టుకోడానికి"

పార్వతి వాక్ ప్రవాహం సాగుతూనే ఉంది. అదేమీ శంకరం చెవికెక్కలేదు.

'అమ్మ... ఎంతటి వాళ్లు ఈ ఆడవాళ్లు. ఎక్కడ లేని విషయాలూ విశేషాలూ రికార్డు అవడమేకాక ఠక్కున బయటకొస్తాయి సందర్భాన్ని బట్టి కంప్యూటర్ ఫ్లాపీలాగా.

నిజమే టీనేజ్ కుర్రాళ్లనెందుకు అనుకోవడం, ఆడిపోసుకోవడం. నలభయ్యోపడిలో పడి నలభై ఏమిటి యాభై పడిలో పడ్డవాళ్లు కూడా ప్రేమా, దోమా అంటూ సెకండ్ సెటప్ పెట్టడం లేదూ. ఇది ఆకర్షణా, అవసరమా, వ్యసనమా లేక ఫ్యాషనా? రావు తన చిననాటి మిత్రుడు. లాయర్‌గా బోలెడు పేరు, ప్రఖ్యాతులూ ప్రాక్టీసు ఉన్నవాడు. పిల్లల పెళ్లిళ్లు కూడా అయ్యాక తన దగ్గర అప్రెంటిస్ చెయ్యడానికొచ్చిన పిల్లతో ప్రేమాయణం తర్వాత పెళ్లి రామాయణం.

ఈ ఆడపిల్లలు కూడా అసలు ఎందుకు ఎలా ప్రేమిస్తారో తెలీదు. పోనీ డబ్బు కోసమా అంటే ఆ పిల్లా లాయర్. బోలెడు జీవితం ముందుంది సంపాదించడానికి, అనుభవించడానికీ. అదీకాక. అంతో ఇంతో ఆస్తిపరులే తల్లితండ్రులు. మరి ఏం ఆశించి తండ్రి వయసు వాడితో వ్యవహారం. ప్చ్... జనానికి బొత్తిగా నైతిక విలువలు ఉండటం లేదు.'

"ఏమిటీ నామటుకి నేను వాగుతూనే వున్నాను. మీ మటుకి మీరు మీ లోకంలోకి వెళ్లిపోయారు. ఇంతకూ ఎవరైనా..."

"చాల్లే వేళాకోళం. ఎవరైనా వింటే నవ్వి పోతారు. అన్నట్లు పార్వతీ రాజమండ్రి బ్రాంచ్ ఆఫీసులో అకౌంట్స్ అన్నీ అవకతవకలుగా ఉన్నాయిట. వాటిని సరిచూసి రమ్మని నన్ను రాజమండ్రీ డిప్యుటేషన్ మీద పంపుతున్నారు. అక్కడకూ చెప్పాను. నాకు కుదరదనీ నేవెడితే ఇంట్లో నువ్వొకదానివీ అయిపోతావనీ"

విషయం వింటూనే ఎగిరిపడింది పార్వతి.

"అసలే ఈమధ్య అఖ్ఖరలేని ఆలోచనలతో సతమతమైపోతున్నారు. అక్కడకు వెళ్లి ఏం వెలగబెడతారో ఏమో! నేనొక్కదాన్నే ఇక్కడ ఉండి చేసేదేముంది. నేనూ మీతో వస్తా" అంటూ తయారయింది.

"అదికాదు పార్వతీ. అక్కడ ఆఫీసులో అసలే అంతా అయోమయంగా ఉన్నాయట అకౌంట్స్. రాత్రీ పగలనక అన్నీ చూసుకోవాలి. నీకు ఆ హోటల్ గదిలో ఏం తోస్తుంది"

"మహా బాగా తోస్తుందిలెండి. ఇక్కడేం చేస్తున్నానో అక్కడా అదే పనిచేస్తా"

ఆవిడకు తన మీదున్నది అక్కరో, అపనమ్మకమో అని నవ్వొచ్చింది శంకరంకు. రాజమండ్రి చేరి ఆఫీసు దగ్గరలో ఓ హోటల్ గది తీసుకున్నారు. మరి అన్నాళ్లుగా ఏం చేస్తున్నారో ఆ బ్రాంచిలో అకౌంట్స్ అన్నీ తలా తోక లేకుండా లెఖ్ఖకు అందకుండా ఉన్నాయి. రాత్రింబవళ్లు అదే పని. మరో ఆలోచన చేసే అవకాశమే లేదు శంకరానికి.

"ఈవేళ మార్కండేయస్వామి గుళ్లో కెళ్లాచ్చాను. అబ్బ ఎంత బాగుందో... ఆ గుడి . ఆ దేముడు చాలా మహిమగల వాడండీ" రాత్రి భోజనాల దగ్గరంది పార్వతి.

"ఆహా అలాగా"

"అలాగా కాదుమరి. మీ ఆఫీసు పని అయి మనం వెళ్లేలోపు ఓ మారు వెళ్లివద్దామండి"

"హోం మినిస్టరు గారి ఆర్డరు తప్పుతుందా. అలాగే"

"ఏమండీ మీ ఆఫీసు వాళ్లతో చెప్పి పర్మిషన్ తెప్పించండి. రాజమండ్రి పేపర్‌మిల్

చాలా పెద్దగా, బాగుంటుందట. అసలు పేపరు ఎలా వస్తుందో ఏమిటో చూద్దాం" ఇంకో ఆర్డరు.

"తప్పుతుందా అలాగే"

"ఏమండీ ఈ రోజు సాయంత్రం కాస్త పెందరాళే వచ్చేయరూ. కాస్త అలా గోదావరి గట్టుకు వెడదాం చాలా బాగుంటుంది"

"అబ్బా అలాగే లేవే"

పదిహేను రోజులుగా ఆఫీసు ఫైళ్లూ లెఖ్ఖలతో మునిగిపోయిన శంకరానికీ ఆ తల దిమ్ము... వేడి తగ్గించుకోవడానికి గోదారి గట్టు షికారు బెటర్ అనిపించింది.

సాయంత్రం ఆఫీసు పని పెందరాళే కట్టేసి పార్వతితో కలిసి గోదారి గట్టుకు వచ్చిన శంకరానికి ఆ చల్లగాలి.... గోదావరి గలగలలూ... గట్టుమీద పిట్టల కిలకిలలూ... చాలా హాయనిపించింది. అలాగే ప్రశాంతంగా కూర్చున్నాడు.

"ఏమండోయ్" ఉన్నట్లుండి గట్టిగా అరిచింది పార్వతి.

ఆ అరుపుకు వెళుతున్న ఒకళ్లిద్దరు వింతగా చూశారు వీళ్లవంక. "అబ్బ ఏమిటే ఆ అరుపులు. కాస్త నెమ్మదిగా పిలవచ్చుగా. ఏం కొంపలంటుకుపోయాయ్" విసుక్కున్నాడు శంకరం.

"అటు చూడండి. అదిగో ఆ ఎర్ర చీర కట్టుకున్న అమ్మాయి, అదిగో చేతిలో చంటి పిల్లతో" అంటూనే గబగబా అటుకేసి నడిచింది పార్వతి, శంకరం విసుగునేం పట్టించుకోకుండా

చేసేది లేక తనూ అటువైపు నడిచాడు శంకరం.

అప్పటికే ఆ అమ్మాయి దగ్గరకు చేరిన పార్వతి ఆ పిల్ల చెయ్యిపట్టి ఠక్కున ఆపింది. "నువ్వు... నువ్వు రేవతికదూ!" అంటూ. ఆ అమ్మాయి కాదంటూ తప్పించుకోజూసింది మొదట. పార్వతి దగ్గర ఆ పప్పులేం ఉడకవ్.

"కాకపోవడం ఏమిటీ నాకేమయినా పిచ్చా లేకపోతే నాకేం కళ్లు లేవా... ఇలా రా" అంటూ దాదాపుగా చెయ్యి పట్టుకుని అక్కడున్న బెంచి దగ్గరకు లాక్కొచ్చి కూలేసింది ఆ అమ్మాయిని. శంకరం కూడా ఆ అమ్మాయిని తేరిపార చూశాడు. నిజమే ఆ అమ్మాయి రేవతే. గిరీశం కూతురు రేవతే. కాకపోతే గుర్తుపట్టలేనంతగా చిక్కి శల్యమయింది. ముఖంలో కళా కాంతీలేదు. నిండా పద్దెనిమిది, పంతొమ్మిదేళ్లయినా లేని ఆ పిల్ల చేతిలో ఏడాదిలోపు పసిపిల్ల, ముఖంలోని దైన్యం, ఆమె జీవితంలోని విషాదాన్ని చెప్పకనే చెబుతున్నాయి.

"ఏమ్మా... అదేమిటీ... అలా అయిపోయావ్. ఏడీ మీ హీరో. నిన్ను సరిగా చూడటం లేదా" ఆప్యాయంగా అడిగాడు శంకరం.

"అంకుల్" ఒక్కసారిగా గొల్లుమంది రేవతి.

కట్టలు తెంచుకున్న దుఃఖోద్వేగం, నిస్సహాయత, ఏం జరిగిందో ఊహించడానికి శంకరం... పార్వతిలకున్న జీవితానుభవం చాలు. తల్లి ఏడుపుతో బెదిరిపోయి ఏడుపు లంకించుకున్న పసిదాన్ని చేతిలోకి తీసుకుని సముదాయించసాగింది పార్వతి.

గుండెలవిసేలా ఏడుస్తున్న రేవతిని పొదవి పట్టుకుని తలపై నిమరసాగాడు శంకరం.

చుట్టుపక్కల జనం ఆసక్తిగా తమకేసి చూడటం గమనించిన శంకరం ఆటో పిలిచి, రేవతిని, బిడ్డనీ, పార్వతిని తీసుకుని తిన్నగా తమ హోటల్ గది చేరాడు.

రూంలోకి రాగానే గ్లాసుడు చల్లని మంచి నీళ్ళిచ్చి, బోయ్‌ని పిలిచి వేడివేడి కాఫీ చెప్పాడు.

కాఫీ తాగి సేదదీరాక... చాలావరకు తేరుకుంది రేవతి.

"ఇప్పుడు చెప్పు... ఏం జరిగింది? ఆ కుర్రాడు, అదే వెంకటేశం కొడుకు ఎక్కడున్నాడు?"

# ఏరినముత్యాలు

- మరణించడానికి సిద్దంగా వున్నవాడే స్వేచ్ఛగా జీవించ గలుగుతాడు.

– మహాత్మాగాంధీ

- ఆలోచనలే మనిషిని సరయిన దిశలోకి మళ్లించి కార్యోన్ముఖునిగా చేస్తాయి. అందుకే ప్రతివారికి ఆలోచన అతి ముఖ్యం.

– భగవద్గీత

- నీటిమీద గడ్డిపరకలు తేలినట్టే పొరపాట్లు కూడా పైకి వస్తాయి.

– డ్రైడెన్

- కృతజ్ఞత తెలుపుకోవడం తప్పనిసరి. అయితే దానిని ఆశించే హక్కుమాత్రం ఎవరికీలేదు.

– రూసో

- సౌందర్యం గొప్పదే. కానీ ఆ సౌందర్యాన్ని ఆరాధించగల సహృదయత ఇంకా గొప్పది.

– కాల్టన్

- చక్కగా మాట్లాడాలనుకునేవారు ముందు చక్కగా వినడం నేర్చుకోవాలి.

– ఆర్.ఫొకాల్ద్

- మానవ మాత్రునికి భగవంతుని గురించి పూర్తిగా వర్ణించటం సాధ్యపడితే నా నిర్ణయం ప్రకారం భగవంతుడనగా సత్యం. కానీ తరువాత మరొక అడుగు ముందుకు వేసి 'సత్యమే భగవంతుడు' అని చెప్పగలను.

– గాంధీజీ

- మహోన్నత వ్యక్తిత్వం ఎక్కడ ఉందో గ్రహించడం చాలా కష్టం. ఆ ఛాయలు మనలో కూడా ఎన్నో కొన్ని ఉంటేనే అది సుసాధ్యం.

– ఛానింగ్

- ఆదర్శాలు ఆచరణ యోగ్యమై ఉండాలి. లేకపోతే వాటికి శక్తి ఉండదు.

– యమ్.కె.గాంధీ

- మనిషికీ జంతువుకీ ఒక చిన్న అంశంలోనే భేదం వుంది. కానీ చాలామంది ఆ చిన్న అంశాన్ని విసిరి పారవేస్తున్నారు. అదే విచక్షణ.

– కన్ఫ్యూషియస్

- విజయం సాధించుటలో మన మనో నిశ్చయం తగినంత బలంగా లేనపుడు మాత్రమే ఓటమికి పునాదులు ప్రారంభమవుతాయి.

– సోక్రటీస్

- విజయం అన్నది సామర్థ్యం కంటే ఉత్సాహం కారణంగానే లభిస్తుంది. మనసా, వాచా, కర్మణా పనిలో నిమగ్నుడైన వాడే విజయుడవుతాడు.

– ఛార్లెస్ బక్స్టెటన్

సేకరణ: భూక్యా గోపీనాయక్

"మోసపోయానంకుల్... నన్ను నమ్మించి మోసం చేశాడు కార్తీక్" వెక్కిళ్ళ మధ్య అంది రేవతి.

"నమ్మిన చోటే మోసం ఉంటుంది. అయినా పట్టుమని పదహారేళ్ళయినా నిండకుండా, ఇంటరు చదువయినా పూర్తి చెయ్యకుండా ప్రేమా... దోమా అంటూ ఇల్లు విడచి వెళ్ళిపోవడం ఏమిటే. మీ అమ్మా నాన్నా గురించి కాస్తయినా ఆలోచించావా?" అంటూ ఏదో అనబోతున్న శంకరాన్ని ఆగమని సైగచేసింది పార్వతి.

"చాల్లెండి... పసిపిల్ల ఏదో తెలియక తప్పుచేసింది, ఏం జరిగిందో తెలుసుకుని ఏం చెయ్యాలో ఆలోచించక ఇప్పుడా పాత గొడవ, తప్పొప్పుల పట్టిక ఎందుకు" సుతిమెత్తగా మందలించింది పార్వతి.

"నిజమే... అయిపోయిన పెళ్ళికి బాజాలన్నట్లు, జరగాల్సిన ఘోరం జరిగిపోయాక... ఇంకా ఆ ఘోరం గురించి అఘోరించడం ఎందుకూ" చక్కగా చెప్పావన్నట్లు కళ్లతోనే అభినందించాడు పార్వతిని.

"సరే... అయిందేదో అయింది. ఏమంటాడిప్పుడు? ఎక్కడున్నారు మీరు? ఏం చేస్తున్నారు? ఎలా బతుకుతున్నారు?" అంటున్న శంకరాన్ని పట్టుకు మళ్ళీ భోరుమంది రేవతి.

కొంచెం సేపటికి తేరుకుని చెప్పింది. ఏముంది పాత కథే. ఇంట్లో వున్న నగానట్రా, డబ్బు దస్కం తీసుకుని ఇద్దరూ హైదరాబాద్ పారిపోయారు. అక్కడ బిర్లా మందిరంలో దండల పెళ్ళి చేసుకున్నారు. వలపు వాడి, వయసు వేడి కరిగేంతవరకూ 'ప్రేమ' బాగానే ఉంది. కూర్చుని తింటే కొండలే కరుగుతాయి ఇంక వెంట తెచ్చుకున్న నగలూ, డబ్బూ అనగా ఎంత?

'ప్రేమ'మైకంలో కరిగిపోయి బతకడానికి, కనీస అవసరాలు తీరడానికి కావలసినదేమిటో తెలిసేసరికి కట్టుబట్టలతో మిగిలారు. ఉద్యోగాల వేటలో పడ్డారు. ఇదేమైనా సినిమానా పారిపోయి ఇల్లు వదిలిన హీరోహీరోయిన్లు కష్టంచేసి, రిక్షాతొక్కి కోట్లు గడించడానికి. కోట్లు కాదు కనీసం పూట గడవడం గగనమయ్యేసరికి ప్రేమ మత్తు పూర్తిగా దిగింది.

ఒకరికోసం ఒకరుగా కనిపించడం పోయి ఇద్దరూ ఒకరికొకరు బద్ధశత్రువులుగా కనిపించడం మొదలయింది.

"హాయిగా చదువుకుంటున్న నన్ను నీ ప్రేమ పిచ్చిలో పడేసి నరకంలోకి లాగావు. అమ్మ, నాన్న ఎంతలా చెప్పారు పాపం. ఎంత బాధపడ్డారు. నాకిలా కావల్సినదే. నువ్వు నా పాలిట శనిదేవతవు. నాకు పట్టిన దరిద్రానివి" విరుచుకుపడటం మొదలెట్టాడు కార్తీక్.

నువ్వు నా 'దేవత', 'నువ్వు లేని నేను లేను', 'నువ్వే నేను', 'మనసంతా నువ్వే', 'నువ్వునాకు నచ్చావ్', 'నువ్వేకావాలి' అంటూ సినిమాటైటిల్స్ అన్నీ అప్పచెప్పి వెంటబడి వేధించి సాధించిన ప్రేయసి శని దేవత, మోహినీపిశాచి, తన దౌర్భాగ్యంకొద్దీ దాపురించిన 'దరిద్రదేవత'గా మారిపోవడానికి ఆట్టే కాలం పట్టలేదు.

నువ్వు నా ప్రేమ సామ్రాట్... చావైన బతుకైనా నీతోటే అనుకుంటూ అతని వెంట నిర్భయంగా వచ్చేసిన రోజు, కనిపెంచిన తల్లితండ్రులలో కనిపించని 'ప్రేమ' ప్రియుడిలో కనిపించి ఆకర్షణో, మోహమో, ఏది ఏదో తెలియని స్థితిలో తన సర్వస్వం అర్పించిన ఫలితం ఊరికే పోతుందా. కాలం తనపని తను చేసుకుపోయిన ఫలితం ఓ 'పాప'గా రూపొందింది.

'తా దూర సందులేదు మెడకో డోలు' అన్నట్లు వాళ్ల పొట్టే గడవక ఎలా బతకాలా, ఎలా గడపాలా అన్న దుఃఖంలో వున్న వాళ్లకు ఆ పసిప్రాణం ప్రాణాంతకమైంది.

పోస్టుగ్రాడ్యుయేట్స్, ప్రొఫెషనల్ కోర్సుల వాళ్లే ఉద్యోగం, సద్యోగం లేక దిక్కుతోచక

అల్లాడిపోతుంటే ఇంటరు కూడా పూర్తిచెయ్యకుండా ఏ క్వాలిఫికేషన్లూ, రికమెండేషన్లూ, లోకజ్ఞానం లేని వాళ్లకు ఉద్యోగం కాదు సరికదా కూలీనాలీ కూడా దొరకలేదు.

కార్తీక్ ఫ్రెండ్ అనుకోకుండా కలిసినపుడు వీళ్ల దురవస్థ చూసి జాలిపడి రాజమండ్రిలో వాళ్ళ మెడికల్ షాపులో పని యిప్పిస్తానంటే ఇద్దరూ పసిదానితోసహా రాజమండ్రి చేరారు.

ఆ స్నేహితుడు వీళ్ల స్నేహాన్ని చూసి కాదు ఆదరిస్త. అతనికి రేవతిలో స్నేహితుడి భార్యకన్నా ఆడతనమే కనిపించింది. ఫలితం ఆ ఉద్యోగం ఊడింది.

"రేవతీ... నా ప్రియసతీ" అంటూ చాలా రోజుల తర్వాత దరిచేరిన కార్తీక్‌ని చూసి ఆనందంతో పురివిప్పిన నెమలి అయింది రేవతి.

"అవునురా... రేవూ... మనకెటూ ఉద్యోగాలు లేవు. ఇకమీదట రావు. పోనీ 'వాడి' ప్రపోజల్ వప్పుకుంటే మనం పాపాయితో సహా హాయిగా బతకచ్చుకదరా" అన్న కార్తీక్‌లో మొదటిసారి మృగాన్ని చూసింది రేవతి.

విదిలింపులూ, అదిలింపులూ, పుల్లవిరుపులూ, ఎత్తిపొడుపులూ మరీ ఎక్కువయ్యాయి.

చేతగానితనం కార్తీక్‌లోని మనిషిని చంపేస్తుంటే రేవతి పాలిట రాక్షసుడౌతున్నాడు కార్తీక్.

పీడ ఎలా వదుల్చుకోవాలా అన్న స్థితిలో తలవని తలంపుగా ఆపద్బాంధవుడిలా మేనమామ కనబడ్డాడు కార్తీక్‌కు.

"ఒరే కార్తీ... ఎలా ఉండేవాడివి ఎలా అయిపోయావురా, ఒక్కగానొక్క కొడుకువి. మీ అమ్మా నాన్నా నీమీద బెంగతో జీవశ్చవాలుగా అయిపోయారురా" అంటూ కరిగిం చేశాడు కార్తీక్‌ను.

"ఇదిగో ఈ వెయ్యి రూపాయలూ దాని మొహాన కొట్టి... దాని చావు దాన్ని చావమను" అంటూ ఉదారత్వం చాటుకున్నాడు వాళ్లమామ. ఏ ఆధారం లేక నీళ్లలో మునిగిపోతున్నవాడికి ఏ చిన్న ఆధారం దొరికినా ప్రాణం లేచివస్తుంది. అలాంటి పరిస్థితిలో ఉన్న కార్తీక్‌కు 'ఇంటికి వెళ్ళడం' అన్న మాట ప్రాణవాయువు అయింది. 'పాపం రేవతి' అన్న ఆలోచనని బలవంతంగా పీక నొక్కేసి తను తిరిగి ఇంటికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు కార్తీక్.

"ఇదిగో రేవతీ... ఈ వెయ్యి రూపాయలూ తీసుకుని మీ నాన్న దగ్గరకు వెళ్ళిపో పాపతోసహా. నేను మా ఇంటికి వెళ్ళిపోతున్నాను. పాపం... మా అమ్మా నాన్నా నా గురించి అలమటించిపోతున్నారట" చాలా సింపుల్‌గా చెప్పేశాడు.

"కార్తీక్... నీకేమయినా పిచ్చా... మనిద్దరికీ పెళ్ళయింది, మన ప్రేమ గుర్తుగా ఈ పాప... యిప్పుడు నువ్వు మీ ఇంటికీ, నేను మా ఇంటికీ వెళ్ళిపోవడం ఏమిటీ. మనం ఏమైనా పిక్నిక్‌కో, ఎక్స్‌కర్షన్‌కో వచ్చామా ఎవరిదారిన వాళ్లు వెళ్ళిపోవడానికి" అంటున్న రేవతినో పిచ్చిదానిలా చూశాడు కార్తీక్.

"మరి వెళ్ళక... ఏదో చిన్నతనం, ఆవేశంలో తెలియక తప్పుచేశాం. దానికి తగిన శిక్ష ఏడాదిపైగా భరించాం. ఇంక నావల్ల కాదు. పిచ్చిపిచ్చి ఆలోచనలు చెయ్యక, నువ్వూ కూడా మీ ఇంటికి వెళ్లిపో... పాపాయితో ఇంటికెళ్ళలేకపోతే, పాపని... పాపని అనాథశరణాలయంలో వదిలేయ్, పీడాపోతుంది" అని.

"నువ్వంటే నాకు 'కన్‌సర్న్' వుంది కనుకే ఇదంతా చెబుతున్నా... ఆ తర్వాత నీ యిష్టం, నన్ను మాత్రం బ్లేమ్ చెయ్యకు, ఒక్క విషయం గుర్తుంచుకో నేను ఉన్నప్పుడే నిన్ను లొంగదీసుకోవాలని చూసిన ఆ రాజేష్, అలాంటివాళ్లూ ఒంటరిగా ఉంటే నిన్ను వదిలిపెట్టరు. నీ మానాన్న నిన్ను బతకనివ్వరు, అందుకే మీ ఇంటికెళ్ళిపో"

అంటూ వెయ్యి రూపాయలు రేవతి చేతిలో కుక్కి, భారం దించుకుని బాధ్యత దులుపు కుని వాళ్ల మేనమామతో వెళ్ళిపోయాడు కార్తీక్."

ఇంటికి వెళ్లే ధైర్యం చెయ్యలేక ఫోనుచేస్తే తల్లీతండ్రీ ఊరువదిలి వెళ్ళిపోయినట్లు చెప్పారు తమ ఫోను తీసుకున్నవాళ్లు. ఎటు పోవాలో, ఏం చెయ్యాలో తెలియని అయో మయస్థితిలో ఆఖరి రూపాయి కూడా ఖర్చయి పోగా, చీకటి పడ్డాక పాపతోసహా 'గోదావరితల్లి' ఒడి చేరాలని నిశ్చయించు కుని అక్కడకు చేరినట్లు చెప్పింది రేవతి.

రేవతి నోటివెంట ఆఖరి మాటలు వినగానే గుండె గుభేల్మంది శంకరం దంపతులకు. దేవుడు దయామయుడు కనకే అంతటి ఘోరం జరగకుండా తమను అక్కడకు పంపాడు. ఆ మాటే అన్నారు రేవతితో.

"అన్నివిధాలా అన్యాయమయి ఎలా బత కాలి అంకుల్. అసలు ఎందుకు బతకాలి? ఎవరికోసం బతకాలి" అంటూ భోరుమంది రేవతి.

"తెలిసోతెలియకో జీవితంలో ఓ తప్పు చేశావ్. దాన్ని సరిదిద్దుకుని బతుకు నిలబె ట్టుకోవాలి కానీ ఇలాంటి తెలివితక్కువ ఆలోచన చేస్తావా? అన్నెం పున్నెం ఎరగని పసిదాన్ని చంపే హక్కు నీకెవరిచ్చారు" అంటూ కోప్పడ్డారు రేవతిని.

"ఏం చెయ్యాలో ఆలోచిద్దాం. నీ సమ స్యకు పరిష్కారం వెదుకుదాం. అంతేకానీ 'చావడం' నీ సమస్యకు పరిష్కారం కాదు. అసలు ముందు మీ అమ్మా... నాన్నా ఏ ఊళ్లో ఉన్నారో కనుక్కుందాం. కార్తీక్ పెద్ద వాళ్లతో మాట్లాడదాం. అంతవరకు నీకు అండగా మేం ఉంటాం. నువ్వు నిశ్చింతగా మా దగ్గరే ఉండు" అంటూ శతవిధాల రేవ తికి ధైర్యం చెప్పారు.

పక్కవాడి సమస్యలను, దుఃఖాన్ని సిని మాలా చూసే జనం ఉన్న ఈ సమాజంలో శంకరం, పార్వతి లాంటి వాళ్లు అరుదే కానీ అసంభవం కాదుగా.

"బానే ఉంది. మీ డెప్యుటేషన్ పుణ్యమా అని ఓ నిండు జీవితం నిలబడింది" అంటూ ఆనందించింది పార్వతి.

రేవతిని, చంటిదానినీ తీసుకుని ఇంటికి చేరారు శంకరం దంపతులు. ఎలాంటి పరి స్థితి ఎదుర్కోవాలో అనుకుంటూ రేవతినీ, బిడ్డనీ ఇంట్లో ఉంచి వెతుక్కుంటూ వెంక టేశం ఇల్లు చేరారు. పెద్దగా పరిచయం లేక పోయినా, ఒకేగూటి పక్షులుగా గుర్తించి ఇంట్లోకి ఆహ్వానించారు వాళ్లను వెంకటేశం దంపతులు.

ఆట్టే ఉపోద్ఘాతం లేకుండానే తాము వచ్చిన పని చెప్పారు శంకరం, పార్వతీ. విషయం వింటూనే మండిపడ్డారు వెంక టేశం దంపతులు.

"చూడండి... మీరు 'ఆ విషయం' మాట్లా డటానికే వచ్చిఉంటే తక్షణం వెళ్ళిపొండి ఇన్నాళ్లకి నెత్తిన ఉన్న పెద్దమ్మ దిగి, బుద్ధి మరలి మావాడు మళ్ళీ యింటికొచ్చాడు. ఆ పిల్లకీ మావాడికీ ఏ సంబంధంలేదు. వాడిని తిరిగి కాలేజీలో చేర్చి చదివించి ప్రయోజకు డిని చేస్తాం. దయచేసి వాడి భవిష్యత్తుకి గొడ్డలిపెట్టు పెట్టకండి" ఇక మీరు వెళ్లచ్చు అన్నట్లుగా మాట్లాడారు.

"తప్పుచేసిన మీ అబ్బాయిని మీరు స్వీక రించారు. చాలా సంతోషం కానీ, అదే తప్పు చేసిన ఆ పిల్లను గాలికొదిలేసి శిక్షించడం అన్యాయం. పైగా వీళ్ల కడుపున పుట్టిన పాపానికి ఆ పసిదాన్ని కాదనడం ఘోరమే కాదు, నేరం కూడా" ఆవేశంగా అన్నాడు శంకరం.

"ఏమిటండీ ఘోరం, నేరం. అంత వాళ్ల మీద జాలే ఉంటే మీరే ఉద్ధరించండి వాళ్లని. అయినా పెళ్ళికాకుండా తల్లి అవ డంలోనే తెలుస్తోంది అదెంత నీతిమంతు రాలో. ఎవడి పాపాన్ని మా కంటగట్టాలని చూస్తున్నారు, మా వాడిని అమాయకుడిని చేసి. వెళ్లండి... దాన్ని దాని కూతురిని

మీరు ఉంచుకుంటారో, పెంచుకుంటారో మీ యిష్టం" దాదాపు గెంటినంత పని చేశారు వాళ్లని.

అంత అవమానాన్ని సహిస్తూ... ఓరిమితో అడిగారు శంకరంగారు "ఓసారి కార్తీక్‌తో మాట్లాడనివ్వండి. అతగాడు ప్రేమా, దోమా అంటూ వెంటబడి లేవదీసుకుపోయినందుకేగా ఆ పిల్ల బతుకిలా బండలయింది"

"వాడితో మీరు మాట్లాడేదేమిటి? వాడు మాట్లాడడు. మా మాటే వాడి మాట. ఇంక ఆ రేవతి నీడకూడా మా వాడిమీద పడటానికి వీల్లేదు. అసలు ఆ పిల్ల మావాడితోటే లేచిపోయిందనడానికీ, ఊరేగిందనడానికీ సాక్ష్యాలేమిటి. మీరు యింక మర్యాదగా వెళ్లకపోతే మెడబట్టి గెంటాల్సివస్తుంది" అరిచి రంకెలేశాడు వెంకటేశం.

"అన్యాయంగా ఓ ఆడపిల్ల బతుకు కాలరాసి పారేస్తున్నారు మీరు. మీ కూతురే కనక ఇలాంటి స్థితిలో వుంటే'

"దాన్ని చంపి... మేం చస్తాం... సిగ్గు...

కథా నిలయం



శరం ఉంటే ఆ రేవతినీ ఆ పనే చెయ్యమనండి. మళ్ళీ మా ఇంటివైపు చూసినా మీ మర్యాద నిలబడదు" కొట్టినంత పని చేశాడు వెంకటేశం.

అటువంటి పాషాణాల్ని ప్రాధేయపడటం అనవసరం అని తోచి మారు మాట్లాడకుండా ఇల్లు చేరారు శంకరం దంపతులు.

పరాయి పిల్లను, పసిపిల్లతోసహా ఎన్నాళ్లని చూడగలరు వాళ్ళైనా. గిరీశం కోసం హెడ్డాఫీసులో ఎంక్వయిరీ చేశాడు శంకరం. విజయనగరం బ్రాంచి ఆఫీసులో చేస్తున్నట్లుగా తెలుసుకుని అక్కడకు వెళ్లారు.

పెద్ద ఇబ్బంది లేకుండానే గిరీశాన్ని కలిశాడు శంకరం. కలవడానికొచ్చిన శంకరాన్ని యిబ్బందిగా చూశాడు గిరీశం. అర్థం చేసుకుని, ఆఫీసు అయ్యాకా గిరీశం వెంట అతని ఇంటికి చేరాడు శంకరం.

ఏ బాధయినా, దుఃఖమయినా కాలంతో బాటే కరగిపోతుంది అనడానికి నిదర్శనంగా ఇప్పుడిప్పుడే గాయం మాని మనుషుల్లో పడుతున్నారు గిరీశం దంపతులు.

"అన్నయ్యగారూ... ఏమిటిలా వచ్చారు? వదినగారు కులాసానా" అంటూ ఆప్యాయంగానే పలకరించింది గిరీశం భార్య వనజ.

"రేవతికి కూతురు తెలుసా" విషయంలోకి వస్తూ అడిగాడు శంకరం.

"అసలు రేవతే మాకు లేదనుకుంటుంటే యింక దాని కూతురు, సంసారం ఎలా ఉంటే మాకెందుకండీ" బాధని అణచుకుంటూ అన్నాడు గిరీశం.

"పోనీ కానిపని చేసినా, అదైనా పిల్లాపాపతో సుఖంగా ఉంటే" కంట నీరు పెట్టింది తల్లి మనసు.

విషయం చెప్పడం వాళ్లను బాధపెట్టడమే అయినా రేవతి తమ కంటపడినది మొదలు, కార్తీక్, అతని తల్లితండ్రులు ఆమెను కాలదన్నిన విషయం వరకూ వాళ్లకు చెప్పక తప్పలేదు శంకరానికి.

"బాగా జరిగింది, ఒళ్లు కొవ్వెక్కి అది చేసిన వెధవపని ఎంత తప్పో ఇప్పటికయినా దానికి తెలిసొచ్చి ఉండాలి. అయినా మా పరువు ప్రతిష్టలనూ, కన్నప్రేమనూ నట్టేట్లో కలిపి వెళ్ళిపోయిన ఆ నష్టజాతకురాలిని మరచిపోయి, అది చేసిన ఘాతుకం మరచిపోయి, అసలు అది మాకు పుట్టలేదనే అనుకుని బతికేస్తున్నాం. దాని ఖర్మం దానిది, మాకు సంబంధం లేదు" విసురుగా అన్నాడు గిరీశం.

"ఇప్పుడు దాన్ని తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే, మిగిలిన ఈ ఇద్దరి బతుకులూ బండలవుతాయి. మాకిద్దరే పిల్లలు" కళ్లనీళ్లు తుడుచుకుంటూ అంది వనజ.

"చూడండి... రేవతి చేసింది తప్పే. కాదనను కానీ తప్పుచేసింది కదాని నూరేళ్ల ఆమె జీవితాన్ని మనచేతులతో మనమే అంతం చెయ్యలేంకదా. తప్పుచేసినా క్షమించి రక్షించి కడుపులో పెట్టి కాపాడాల్సినది తల్లితండ్రులే. మీరే అలా అంటే ఇంక ఆ అమ్మాయికి దిక్కెవరు. ముందు ఆమెను ఆదరించి కాస్త ఓదార్పుని, చేయూతనియిస్తే తరువాత ఏం చెయ్యాలి, ఎలా చెయ్యాలి అన్నది ఆలోచిద్దాం. కార్తీక్, వాళ్ల వాళ్లు కాదన్నంత మాత్రాన మనం రేవతి బతుకు అన్యాయం అయిపోతుంటే చూస్తూ ఊరుకుంటే అందులో అర్థంలేదు. ముందు అమ్మాయిని ఆదరించి, ఆశ్రయంఇచ్చి తనకాళ్లమీద తను నిలబడేలా చేద్దాం. ఆ తరువాత ఆమె కాపురం చక్కపడేలా చేద్దాం.

ఈరోజు అర్థంలేని కోపంతో, ద్వేషంతో రేవతిని పోగొట్టుకుంటే రేపు కావాలన్నా తిరిగి పొందలేం" అంటూ ఎంతో నచ్చచెప్పిన మీదట గిరీశం దంపతులు రేవతిని, ఆమె బిడ్డనీ తమతో ఉండడానికి అంగీకరించారు.

ఎంతైనా కన్నప్రేమ... ఆవేశం తగ్గి ఆలోచన మొదలయ్యాక ఏం చెయ్యాలి అనే మీమాంస... ఎలా చెయ్యాలి అనే యోచనా మొదలయ్యాయి ఇద్దరికీ.

శంకరంతోబాటు అతని ఇంటికి వచ్చిన

కూతురినీ, మనవరాల్నీ చూసిన ఆ దంపతు లకు దుఃఖం ఆగలేదు. అణచిపెట్టిన కన్న ప్రేమ పొంగిపొర్లింది. జరిగిందేదో జరిగిపో యింది, దాని గురించి బాధపడేకన్నా జరగా ల్సినది ఆలోచించడం వివేకవంతుల లక్షణం అనుకుని ఆలోచించడం మొదలుపెట్టారు.

శంకరం, గిరీశం ఇంకా తెలిసిన నలుగురు పెద్ద మనుషులతో బాటుగా వెంకటేశం ఇంటికి వెళ్ళారు.

"ఎన్నిమార్లు చెప్పినా అదేమాట, అమాయకుడైన మా అబ్బాయిని వల్లో వేసుకుని మాక్కాకుండా చేసింది ఆ మాయలాడి. ఏదో మా అదృష్టం బాగుంది. తప్పు తెలుసుకుని మళ్ళీ వాడు మా దగ్గరికి వచ్చాడు. దయ చేసి వాడినీ, మమ్మల్నీ ఇకనైనా వదిలేస్తే సుఖంగా . బతుకుతాం" అంటూ ముఖంమీదే నిష్టూరాలాడి, అవమానకరంగా మాట్లాడారు వెంకటేశం దంపతులు.

"జరిగినదేదో జరిగిపోయింది. జరిగిన దాంట్లో అమ్మాయిదెంత తప్పుందో అబ్బాయిదీ అంతకంటే ఎక్కువే వుంది. ప్రేమా, దోమా అంటూ వెంటపడి వేధించి, ఇప్పుడు అవసరం తీరాక వదిలించుకోవాలనుకోవడం అమానుషం" కోపంగా అన్నారు శంకరంగారు.

"నిజంగా ఆ అబ్బాయినీ, అతని ప్రేమనీ నమ్మి... కన్న తల్లితండ్రులను వదిలి మమ్మల్ని దుఃఖంలోనూ, అవమానంలోనూ ముంచి అతనివెంట కసాయివాడిని నమ్మిన గొర్రెలా వెళ్ళిపోయిన నా కూతురు మాయలాడికాదు, ఉత్త వెర్రిబాగుల్ది, ఇంకా ఇప్పటికీ అతని ప్రేమ నిజమనీ, ఎప్పటికైనా తనని ఆదరిస్తాడనీ నమ్ముతోంది అది. అలాటి దాన్ని మోసంచేస్తే పుట్టగతులుండవ్... అంతవరకూ వస్తే ఏంచెయ్యాలో నాకు బాగా తెలుసు" కడుపు రగిలిపోయిన గిరీశం ఆవేశం కట్టలు తెంచుకుంది.

"నాది నమ్మకద్రోహం ఏంకాదు, నేను నిజంగానే రేవతిని ప్రేమించాను, కానీ తొందరపడి ఇద్దరం ఇల్లు వదిలేసి చదువులు మానేసి వెళ్ళిపోవడమే మేం చేసిన తప్పు పని" ఉక్రోషంగా అన్నాడు కార్తీక్.

"నువ్వుండు కార్తీక్, పెద్దవాళ్ళం మేం మాట్లాడుతున్నాంగా... నువ్వు పో అవతలికి" కంగారుగా అన్నాడు వాళ్ళ మేనమామ కార్తీక్ మళ్ళీ ఎక్కడ ఆ దరిద్రాన్ని తగిలించుకుంటాడో అని గాభరాగా.



"ఆ అబ్బాయిని చెప్పనివ్వండి, మీరు అతని నోరు నొక్కేసి మా అమ్మాయిని వదిలించుకుందామని చూస్తున్నట్లున్నారు. ఏదో తెలియక చిన్నతనం కొద్దీ తప్పుచేశారు. మనం పెద్దవాళ్ళంగా, విజ్ఞత తెలిసినవాళ్లంగా వాళ్ళకో దారి చూపించాలే కానీ... అలా ఆ అమ్మాయిని నట్టేట్లో ముంచి తనదారి తను చూసుకోమని చెప్పడం అన్యాయం. జరిగినది తెలిసినవాడిగా, ఇరువైపులా శ్రేయోభిలాషిలా చెబుతున్నాను, నామాట వినండి" అంటున్న శంకరాన్ని మింగేసేలా చూశారు వెంకటేశం తదితరులు.

"ఏమిటో మీరు చెప్పేది? ఆ దరిద్రాన్ని ఇంటికి తెచ్చుకోమని, ఏలుకోమని చెబు

తారు అంతేనా" తీవ్రంగా అడిగాడు కార్తీక్ మేనమామ.

"ముందు మీరు మాట్లాడకండి, ఈ విషయంలో మీకు ఏసంబంధం లేదు, ఏలుకోమని చెప్పక, ఓ ఆడకూతురికి అన్యాయం చేసి గాలికి వదిలేయమని చెప్పాలా? ఇదే మీ కూతురయితే మీరు ఇలాగే మాట్లాడతారా? " ఆవేశంగా అడిగాడు శంకరం.

"నేను చెబుతున్నాను అందరూ వినండి, తెలిసి చేసినా, తెలియకచేసినా నేను చేసింది తప్పే... నిజానికి ఈ సంవత్సర కాలంలో ఎన్నో కష్టాలు, అవమానాలు ఎక్కువగా ఎదుర్కొంది కూడా రేవతే. అయినా తను ఏనాడూ నన్ను పన్నెత్తు మాట అనలేదు. నేనే ఆ అమాయకురాలిని అన్ని రకాలుగా బాధపెట్టాను. ఏదో తప్పని సరి పరిస్థితులలో వేరే దారిలేక తననలా వదిలేసి వచ్చేశానే కానీ తనంటే నాకు ప్రేమ లేక కాదు...

... ... ...

"ఒరే" అడ్డుకోబోయాడు వెంకటేశ్వర్లు.

"నన్నాపకండి నాన్నా... చేసిన తప్పు సరిదిద్దుకునే అదృష్టం, అవకాశం ఎంతమందికుంటుంది, నిజంగా నా అదృష్టం కాకపోతే శంకరం అంకుల్ వాళ్ళకి కనబడకపోతే రేవతి, పాప గోదావరి పాలయ్యేవారు. ఆ పాపం నన్ను జీవితాంతం వెంటాడేది, నా అదృష్టమే వాళ్ళ రూపంలో నా రేవతిని రక్షించింది.

"అంకుల్ నేను మీకు మాట ఇస్తున్నా. ఒక ఐదు సంవత్సరాలు రేవతిని, పాపని వాళ్ళ ఇంట్లో ఉంచుకోమనండి. నేను మా ఇంట్లో ఉంటాను. ఇద్దరం మళ్ళీ చదువుకుంటాం. ఎలాగైనా డిగ్రీ పూర్తిచేసి ఏదో ఒక ఉద్యోగం సంపాదించి, నా కాళ్లమీద నేను నిలబడిన తరువాత రేవతితో కొత్త జీవితం ప్రారంభిస్తాను. నన్ను నమ్మండి"

కార్తీక్ చెప్పినదానిలో పాయింట్ కనబడింది శంకరానికి.

"పోనీ పెళ్లాం, పిల్లనీ ఇంటికి తెచ్చుకుని, ఇంట్లోనే చదవచ్చుగా ఆ చదువేదో" గునిగాడు గిరీశం.

"కాదు గిరీశం, కార్తీక్ చెప్పింది సబబే. రేవతి ఇక్కడే ఉంటే వీళ్ళకు డిగ్రీ రావటం మాటేమోగానీ మీకింకో మనవడో, మనమరాలో వస్తారు. వాళ్ళకు చదువుమీద ఆసక్తి ఉండదు ఒకచోట వుంటే. ఎంత నాలుగయిదేళ్ళు ఇట్టే గడచిపోతాయి. నా మాట విని నువ్వు కూడా రేవతిని మళ్ళీ కాలేజీలో చేర్పించు. చదువు ఆత్మస్థైర్యాన్ని, విశ్వాసాన్ని ఇస్తుంది" నచ్చచెప్పాడు శంకరం.

చేసేదేం లేక సరే అన్నాడు గిరీశం, అయిష్టంగానే ఒప్పుకున్నాడు వెంకటేశం. రేవతినీ, పసిదాన్నీ తీసుకుని విజయనగరం వెళ్ళిపోయారు గిరీశం దంపతులు కార్తీక్, అతని తల్లిదండ్రులూ రేవతికి ఏ అన్యాయం తలపెట్టకుండా చూసే బాధ్యత శంకరం తలకెత్తి.

వెళ్లేముందు అన్నాడు గిరీశం. "శంకరం... వీళ్ళ చదువులు పూర్తయ్యాక నిజంగా కార్తీక్ రేవతిని ఏలుకుంటాడంటావా. ఇందులో ఏం మోసం లేదుకదా, ప్రస్తుతం వదిలించుకుంటే ఐదేళ్ళ తర్వాత మాటకదా అని ఎత్తు వేయలేదుకదా"

"లేదు గిరీశం, కార్తీక్ చాలా తెలివైన పిల్లాడు. అంతేకాదు మంచివాడు కూడా. నిన్న నా దగ్గరికి వచ్చాడు. ఇదంతా నాకు ముందే చెప్పాడు. అంతేకాదు రేవతిని రాజమండ్రిలో తను అడిగిన అతిహేయమైన విషయాన్ని కూడా తనే చెప్పాడు. జరిగిన దానికి తను చాలా బాధపడుతున్నాననీ, రేవతి ముఖం చూడటానికి కూడా తనకు ధైర్యం లేదనీ, రేవతి తననెంత అసహ్యించుకుంటోందో, తనని అసలు క్షమిస్తుందో లేదో అని చాలా మథనపడ్డాడు. ఆ అబ్బాయి మాటల్లో నిజాయితీ ఉంది. అతనికి రేవతిపట్ల నిజమైన ప్రేమ ఉంది, నిస్సహాయస్థితిలో చెప్పుడు మాటలకు లొంగి

పోయి రేవతినలా వదిలేసి వచ్చేశాడు. జరిగి నదానికి పశ్చాత్తాప పడుతున్నాడు. అతన్ని క్షమించడం మినహా మనకీ దారిలేదు. నువ్వు నిశ్చింతగా ఉండు, రేవతి జీవితం తప్పకుండా ఓ గాడిలో పడుతుంది"

ఏరోజు ఎలా ఉన్నా... చదువు అవసరం, ఆసరా గుర్తించి ఇకనైనా శ్రద్ధగా చదవమని శంకరం రేవతితో మరీ మరీ చెప్పాడు.

ఒకసారి దెబ్బతిన్న అనుభవంతో కార్తీక్, రేవతి అలక్ష్యం చెయ్యకుండా రెండో ఆలోచన లేకుండా శ్రద్ధగా చదువులో పడ్డారు.

వెంకటేశం దంపతులు రేవతికి అన్యాయం చెయ్యకుండా అడపాదడపా కార్తీక్‌ను కలుస్తూ, అతని కోసం అన్నిటినీ వదులుకుని రేవతి ఎన్ని అవమానాలు, అగచాట్లు పడిందో అతనికి గుర్తు చేస్తూ కల్మషం లేని ఆమె ప్రేమను అతనిలో బతికించారు శంకరం దంపతులు.

కాలేజీలో అతనికి సీనియర్‌గా ఉన్న రాజమండ్రి ఫ్రెండ్ కక్షగట్టి కాలేజీలో అతనిని అల్లరి పెట్టడం మొదలుపెట్టాడు.

"ఒరే దినేష్... కార్తీక్ మనకు జూనియర్ ఎలా అయ్యాడో తెలుసా, మిగతా అన్నిటిలో మనకంటే సీనియర్ అవడం వలన" అంటూ కార్తీక్, రేవతిల పేర్లు కలిపి అల్లరి పెట్టసాగారు.

"ఒరే వాడికో కూతురు కూడానూరే" అంటూ కార్తీక్‌కు వినబడేటట్లుగా...

"పాప ఏడ్చింది"

"ఉడ్‌వర్డ్స్ పట్టమని వాళ్ళమ్మకు చెప్పు"

"ఏదీ పాపం... వాళ్ళమ్మ వీడిని విరహంలో పడేసి ఎటో వెళ్ళిపోయిందిగా" అంటూ నోటికొచ్చినట్లు మాట్లాడటం.

ఎవరేమన్నా తన చదువుమీద దృష్టి నిలిపి, చేసిన తప్పును సరిదిద్దుకుని తిరిగి, తనూ రేవతీ కలిసి బతికే శుభఘడియ కోసం అహోరాత్రులు కష్టపడసాగాడు కార్తీక్.

"ఒరే కార్తీక్... రాజేష్, రమ్యను చంపిన నేరానికిగానూ అరెస్టు అయ్యాడు" అంటూ క్లాస్‌మేట్ అరుణ్ చెప్పిన వార్త వింటూనే స్థాణువయ్యాడు కార్తీక్.

రాజేష్ అరెస్టు అవడంకాదు అతనిని ఆశ్చర్యపరచినది, రమ్య... బంగారపు బొమ్మలాంటి రమ్య, సిరిసంపదలలో పుట్టి ఆడింది ఆటగా, పాడింది పాటగా గడిపే రమ్య, అరవిరిసిన గులాబీలావుండే రమ్య ఇకలేదు అనే ఆలోచనే అతడిని వివశుడిని చేసింది.

ఆరోజు ఇంకా గుర్తుంది కార్తీక్‌కు.

తను మళ్ళీ కాలేజీలో చేరిన కొత్తలో...

"ఇదిగో... రమ్యా... ఇది ఏసిడ్ బాటిల్. నువ్వు నన్నూ... నాప్రేమనూ ఒప్పుకోకపోతే ఇది నీమీద పోసేస్తాను. ఇదిగో కత్తి... ఆ వెంటనే నన్ను నేను పొడుచుకు చచ్చిపోతాను. నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను. నన్ను ప్రేమించని నువ్వూ, నీ అందం ఉండటానికి వీల్లేదు. అలాగే నువ్వు లేకుండా నేనూ బతకలేను" అంటూ క్లాసురూంలో అందరి ముందూ నానా బీభత్సం చేశాడు రాజేష్.

పిచ్చిపిల్ల రమ్య అదంతా నిజమని నమ్మింది, వాడు తిరుగుబోతు జులాయి అని ఎవరెంత చెప్పినా వినకుండా వాడిని ప్రాణంగా ప్రేమించింది.

తెలివిలో, అందంలో, డబ్బులో రాజేష్ కంటే రెండింతలు పైనే వున్న రమ్య ఏంచూసి రాజేష్ ఆకర్షణలో పడిందో... వాళ్ళిద్దరి ప్రేమ, పరిచయం, తిరుగుడు కాలేజీలో అందరికీ తెలుసు.

రాజేష్ ఇంట్లో అందరికీ సమ్మతమే, తమ కంటే అంతస్థులో పైనవున్న రమ్యతో వివాహం... వాళ్ళ కుటుంబంతో వియ్యమందడం అందరికీ ఆమోదయోగ్యమే.

రాజేష్ తిరుగుళ్ళు, విచ్చలవిడితనం విని వున్న రమ్య తల్లిదండ్రులు వద్దని వారించినా, హెచ్చరించినా, రాజేష్‌నే కోరుకున్న ఆమె పంతం ముందు వాళ్ళు వీగిపో

యారు.

"రేయ్... రమ్యతో నీపెళ్ళి అయితే నీ లెవెలే మారిపోతుందిరా" అన్న ఫ్రెండ్ మాటలకు...

"పెళ్ళా, నాకా, రమ్యతోనా" అంటూ రాజేష్ నవ్వడం కార్తీక్ చెవినబడింది.

ఊరుకోలేక ఆ విషయం రమ్యతో అన్నా తెలుసుకోలేని, పట్టించుకోలేని పిచ్చిపిల్ల అయింది రమ్య.

ప్రేమమైకంలో వున్న రమ్యకు రాజేష్ ఏంచేసినా గొప్పే...

కాలేజీలోని మిగతా ఆడపిల్లలను ఏడిపించడం, కామెంట్ చెయ్యడంలాంటివి మగతనం... హీరోయిజం.

అతని అందం... మాటకారితనం రమ్యను నిలువునా మత్తులో ముంచేశాయి.

ఎలాగూ పెళ్లిచేసుకుంటాంగా అంటూ అతను ఆడించినట్టల్లా ఆడింది... అభం శుభం తెలియని ఆ పిల్లను డ్రగ్స్‌కు ఎడిక్ట్ చేశారు, కట్టు బానిస చేసుకొన్నాడు. ఫ్రెండ్స్‌తో కలిసి ఆమెను ఎంజాయ్‌చేశాడు. ఆఖరుకు ఆ మత్తులోనే ఆమెను హతమార్చేశాడు... ఒళ్ళు తెలియని పైశాచికానందంతో ఆమెను మృత్యువు ఒడిలోకి నెట్టేశాడు.

కాలేజ్ అంతా నిర్ఘాంతపోయింది. రాజేష్ మంచివాడు కాదని తెలుసుకానీ మరీ అంత కసాయివాడనీ... అంత కిరాతకంగా ఓ అమాయకురాలిని అంతమొందిస్తాడనీ ఊహించలేదు.

"ఏమయిందిరా... ఆ పిల్ల అంటే ఇష్టమన్నావ్, ఆమె నిన్ను ప్రేమించకపోతే చంపడానికీ, చావడానికీ సిద్ధపడ్డావ్. సరేఅని అంతా ఒప్పుకుని, ఇరుపక్షాల అంగీకారం అయ్యాకా ఎందుకిలా జరిగింది? ఎవరయినా నేరంచేసి నిన్నందులో ఇరికించారా... చెప్పరా బాబూ" గోలగోలగా అడిగాడు రాజేష్ తండ్రి.

"నేను రమ్యను పెళ్ళిచేసుకుంటానని ఎప్పుడైనా చెప్పానా... తను అలా అనుకుంది. మీరూ అలా అనుకుంటే అది నా తప్పా... తను నేనంటే ఇష్టపడింది, నేను తను అంటే మోజు పడ్డాను. ఇద్దరం కలిసి తిరిగాం... అనుకోకుండా యాక్సిడెంటల్ గా నా చేతిలో చచ్చిపోయింది పూర్ ఫెలో. ఐయాం నాటెటాల్ రెస్పాన్సిబుల్" నిర్లక్షంగా భుజాలెగరేస్తూ జవాబిచ్చిన రాజేష్‌ను చూస్తుంటే అక్కడున్నవాళ్ళకు ఒక రకమైన జలదరింపు కలిగింది.

ఎక్కడకు వెడుతున్నాం మనం. నాగరికత భ్రమలో, ముసుగులో అనాగరికత, ఆటవికత విచ్చలవిడిగా పైన బడుతుంటే అగ్నికి ఆహుతయ్యే శలభాల్లా ఎందరో రమ్యలు మాడి మసి అయిపోతుంటే సాటి మానవులుగా తలెత్తుకోలేని అసమర్థత, అభద్రత.

డబ్బు లేదనో, అందం సరిపోలేదనో, ప్రేమకు పనికివచ్చిన అంతస్థులు పెళ్ళికి సరిపోవనో ప్రేమించి వదిలేసిన కథలు కోకొల్లలు. అన్నీ వుండి, అందరి అంగీకారం అయ్యాక కూడా మూర్ఖత్వం, మితిమీరిని క్రూరత్వంతో అమానుషంగా బలిగొంటున్న నరరూప రాక్షసులను ఏంచెయ్యాలి? ఏశిక్ష విధిస్తే బలయిన బతుకులు బతికిబట్టకడతాయి? ఒకరకమైన ఉన్మాదం... పైశాచికానందం, వీటిని సమూలంగా అంతం చేయకపోతే ఈ తెగులు అంతటా పాకే ప్రమాదం లేదా? ఈ జనారణ్యంలో ఆడపిల్లలు సుఖంగా క్షేమంగా నెగ్గుకు రాగలరా? తమ తమ చిన్నారుల జీవితాలు ఏప్రేమ కాటుకు బలయిపోతాయో అనే ఆలోచనలో ఆడపిల్ల తల్లిదండ్రులు అనునిత్యం భయంతో తల్లడిల్లవలసినదేనా?

కష్టానికి జడిసి మానవత్వం మరచిపోయి రేవతిని విడిచిపెట్టి పారిపోయినా ఇలాంటి అమానుషత్వం భరించలేకపోయాడు కార్తీక్.

నడుంకట్టి రాజేష్‌కు వ్యతిరేకంగా సాక్ష్యా

# రచయితలకు మనవి

- 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.
- ★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియ పరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

శ్రీచంద్ర




# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసే వారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి చతుర నవల ప్రేమా! నీకు నమస్కారం

...........................................................

చిరునామా: ...........................................................

...........................................................

...........................................................

...........................................................

ధారాలు సంపాదించి అతని దుష్ప్రవర్త నన్నూ, పైశాచిక మనస్తత్వాన్నీ బట్టబయలు చేసి అతనికి శిక్షపడేలా చేసి అమాయకంగా ప్రేమించి బలయిపోయిన రమ్య ఆత్మకు శాంతి కలిగించాడు.

ఒక తప్పటడుగు వేసినా సరిదిద్దుకుని నిలదొక్కుకునేవాళ్ళు ఎందరుంటారు. అలాంటి అవకాశాన్నిచ్చి వాళ్ళకు చేయూత నిచ్చే శంకరం లాంటివాళ్లు ఎందరుంటారు?

శంకరం ఇచ్చిన మోరల్ సపోర్టుతో కష్ట పడి డిగ్రీ సాధించాడు కార్తీక్.

"కార్తీక్ నువ్వు డిగ్రీ పూర్తిచేశావ్. సంతోషం. కానీ ఈ రోజుల్లో డిగ్రీ ఒక్కటే ఎందుకూ కొరగాదయ్యా. నీకు నచ్చిన సబ్జ క్టులో పి.జి. చెయ్యి. అలానే పార్ట్‌టైం బి.ఎల్. చెయ్యవయ్యా. నీలో అన్యాయాన్ని ఎదిరించాలనే ఆలోచన, ఎదిరించగలిగే ధైర్యం ఉన్నాయి. వాటికి వన్నె రావాలన్నా నువ్వు చట్టబద్ధంగా నలుగురికి సాయపడి కాపాడలన్నా చేతిలో పట్టావుంటే మంచిది" అంటూ శంకరం చెప్పిన మాటలు కార్తీక్‌లో నవోద్వేగాన్ని, సంతోషాన్ని నింపాయి.

సైకాలజీలో పోస్టుగ్రాడ్యుయేషన్, బి.ఎల్. పట్టా సాధించాడు.

"నాన్నా... తెలిసో తెలియకో నేను రేవతి జీవితంలో అడుగుపెట్టాను. ప్రేమకూ, వ్యామోహానికి తేడా తెలియని రోజుల్లో తొందరపడి ఇద్దరి జీవితాలు చిందర వందర చేసుకున్నా దేముడిలాంటి శంకరం అంకుల్ సారథ్యంలో మళ్ళీ మా జీవితాలు చిగురించాయి. ఈ రోజు నాకు సంఘంలో ఓ పొజిషన్... స్టేటస్ వచ్చాయని నేను రేవతిని కాదనలేను. అలా అనడం న్యాయం కూడా కాదు. మీరు పెద్దవాళ్లు. పెద్ద మనసుతో అర్థం చేసుకుని ఆశీర్వదిం చండి. నేను రేపే వెళ్ళి ఈ ఇంటి కోడలిగా నా భార్యగా రేవతిని మన ఇంటికి తీసుకొ స్తాను. దీనికి మీకు అభ్యంతరం ఉండదనే అనుకుంటాను"

"అదికాదు కార్తీ. పెద్ద లాయర్, బాగా పేరుప్రఖ్యాతులున్న క్రిమినల్ లాయర్ పరాంకుశంగారి అమ్మాయి మాలతిని నీకు ఇవ్వాలని అనుకుంటున్నట్లు వాళ్ళు కబురు చేశారు"

"జరిగిందేదో జరిగింది. అదంతా మరచి పోయి నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళి చేసు కుంటే నీకు కూడా మంచి భవిష్యత్ ఉంటుందని నేనూ అమ్మా అనుకుం టున్నాం"

"మంచి చెడూ... తెలియని వయసులో తప్పు చేశావని ఇంకా అదే పట్టుకు వేలాడ క్కరలేదురా" అంటూ ఇంకా చెప్పబోయిన వెంకటేశాన్ని మధ్యలోనే ఆపేశాడు కార్తీక్.

"నాన్నా... ప్లీజ్. ఇంక మీరు మరో మాట మాట్లాడద్దు. రేవతి నా భార్య. భార్య ఉండగా మరో పెళ్ళి చట్టరీత్యా నేరం. లాయర్‌గా నా నోట కానీ...బాధ్యత గల తల్లితండ్రులుగా మీ నోట కానీ రాకూడని మాట.

ఇకపోతే మీరన్నారే 'మంచీ-చెడూ తెలి యని వయసులో చేసిన తప్పు' అని నిజమే తెలియని వయసులో చేసిన తప్పు తెలిసిన వయసులో సరిదిద్దుకోవాలి కానీ మళ్ళీ తప్పు చెయ్యకూడదు. అంతేకాదు... అన్నీ వదులుకుని కన్నవారిని కాదనుకుని అమా యకంగా నాతో వచ్చేసిన రేవతి నా ప్రాణం. ఇంతవరకూ మేం పడ్డ శిక్షలూ కష్టాలూ చాలు. నే రేపే వెళ్ళి రేవతిని తెస్తాను. ఇందుకు మీరు అభ్యంతరపెడితే మేం వేరే ఉండటం తప్ప గత్యంతరం లేదు" చెట్టంత ఎదిగిన కొడుకునూ సంపాదనా పరుడిని వదులుకోలేక అసంతృప్తిగానే ఒప్పుకోక తప్పలేదు వెంకటేశానికి.

"నా కూతురి బతుకు నిలబెట్టావ్... ఇదంతా నీ చలవే శంకరం" అంటూ కన్నీ ళ్ళతో రెండు చేతులూ పట్టుకున్న గిరీశాన్ని భుజం తట్టి ఓదార్చాడు శంకరం.

"నిజమే అంకుల్ ఏం చెయ్యాలో, ఎటు

పోవాలో తెలియని ఒక అయోమయదశలో గోదావరి తల్లిలో కలిసిపోదామనుకున్న నాకు సాక్షాత్కరించి పునర్జన్మనిచ్చిన ఆదిదంపతులు మీరు" కన్నీళ్ళతో ఆ దంపతులకు పాదాభివందనం చేసింది రేవతి.

తప్పు చేసిన పిల్లలను శిక్షించి, వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలి వెయ్యడమో లేక వాళ్ళను మానసికంగా హింసించడమో గాక వాళ్ళ తప్పు తెలియచెప్పి వాళ్ళను మంచి వైపు మళ్ళించడం వాళ్ళకు బతకడానికో అవకాశం చూపించడం నిజంగా ఎంతమంచి పని. ఎంతైనా అభినందనీయం.

అలాంటివారు ఒక్కరున్నా కొంతమందికైనా మేలు జరుగుతుంది.

ముద్దులు మూటకట్టే ఐదేళ్ళ కూతురుతో చక్కటి రూపం, పరిపక్వం చెందిన మనసుతో అత్తింట అడుగుపెట్టింది రేవతి.



★ ★ ★

"అవునూ... మీ పిహెచ్.డి. ఎంతవరకూ వచ్చింది" వేళాకోళం చేసింది పార్వతి.

"ఇదిగో ప్రేమ సబ్జెక్టులో డాక్టరేట్ పట్టా వచ్చేసినట్లే రేవతి, కార్తీక్‌ల సెటిల్‌మెంట్‌తో" చిరునవ్వుతో అన్నాడు శంకరం.

ఆఫీస్ రూ[illegible] కూర్చొని లా జర్నల్ చదువుతున్నా[illegible] కార్తీక్. "లాయర్‌గారూ... లాయర్‌[illegible]రూ..." ఇంటూ ఆదుర్దాగా వచ్చి[illegible] యువతి.

"[illegible]ర్చోండి... ఎవరు మీరు. ఏం కావాలి [illegible]కూ. చూడబోతే మీరు చాలా ఆదుర్దాగా ఉన్నట్లున్నారు. ముందు కాస్త ఈ మంచి నీళ్లు తాగి స్థిమితపడండి" టేబుల్ మీద ఉన్న నీళ్లగ్లాసు మూతతీసి గ్లాసు ఆమెకు అందిస్తూ అన్నాడు కార్తీక్.

ఎత్తిన గ్లాసు దించకుండా గటగటా ఆమె నీళ్లు తాగడం చూస్తేనే అర్థం అయింది కార్తీక్‌కు ఆమె ఎంత వర్రీడ్‌గా, టెన్షన్‌గా ఉన్నదీను.

"ఇప్పుడు చెప్పండి. ఎవరు మీరు. మీ ప్రాబ్లమ్ ఏమిటీ?" చేతిలో ఉన్న పేపర్ వెయిట్ గుండ్రంగా తిప్పుతూ రిలాక్స్‌డ్‌గా అడిగాడు.

"నేను... నా పేరు మాలతి. మాది ఈ వీధిలోనే ఉన్న పాలబూత్ దగ్గర యిల్లే. నాకు ఈమధ్యే రెండు నెలల కిందటే పెద్దలు కుదిర్చిన అతనితోటే వివాహం అయింది. నేను డిగ్రీ ఫైనలియర్ రాసిన తరువాత నా పెళ్ళి జరిగింది. నా భర్త చాలా మంచివాడు. నేనంటే చాలా యిష్టం. నాకూ ఆయనంటే యిష్టమే కానీ" సందేహంగా ఆగిన ఆమె ముఖంలో విషాదపు నీలి నీడలు.

"సందేహించకమ్మా... నీ ప్రాబ్లమ్ ఏమిటీ? నీ భర్త మంచివాడే అంటున్నావు. మరి ప్రాబ్లమ్ అతనితో కాకపోతే అతని తల్లితండ్రులతోనా. కట్నం సరిపోలేదనో, లేక ఆస్తిపాస్థులు చాలలేదనో వాళ్లు నిన్ను హింసిస్తున్నారా. సరిగా చూడటం లేదా"

"లేదు సార్... వాళ్లంతా చాలా మంచి వాళ్లు. నన్ను చాలా బాగా చూసుకుంటారు"

"మరి... చూడమ్మా. లాయర్ దగ్గరా, డాక్టర్ దగ్గరా సంకోచం, సందేహం పనికి

రావు. నువ్వు చెప్పాలనుకున్నది నిర్భయంగా, నిస్సంకోచంగా చెప్పు. లేకపోతే నేను నీకు ఏవిధంగా సాయపడగలను. ఏవిధంగా న్యాయం చెయ్యగలను చెప్పు"

"గోపాల్ అనీ నా క్లాస్‌మేట్ సర్. రెండేళ్లు కాలేజీలో నన్ను ప్రేమిస్తున్నానంటూ వెంటబడి వేధించేవాడు. ఫైనలియర్ ఎగ్జామ్స్ ముందు 'నేను నిన్ను ప్రేమిస్తున్నా...మనం పెళ్ళి చేసుకుందాం నువ్వు ఇప్పుడే ఏ మాటా చెప్పాలి' అంటూ బాగా హఠం చేశాడు.

"ఊ... తర్వాత" పేపర్‌వెయిట్ తిప్పుతూ అడిగాడు కార్తీక్.

"ఈ ప్రేమలూ గీమలూ మా ఇంట్లో కుదరవు. అయినా నాకు నీమీద అలాంటి అభిప్రాయం లేదు. దయచేసి నన్ను ఇబ్బందిపెట్టకు. నిన్ను నేను ఓ ఫ్రెండ్‌లా భావించాను కానీ వేరే ఏ ఆలోచనా నాకు నీమీద లేదు. ప్లీజ్... అర్థంచేసుకో ఆ విషయం మర్చిపో" అని చెప్పాను.

అప్పటికి ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. మళ్ళీ సాయంత్రం నేను నా ఫ్రెండ్స్‌కు ఫేర్‌వెల్ చెబుతుంటే.

"సరే మాలతి... నేను బాగా ఆలోచించాను. నేను నిన్ను ప్రేమించాను. కానీ... నువ్వు నన్ను ప్రేమించలేదు. అలా అని రూలూ లేదు. అందుకే నా మనసులోంచి ఆ ఆలోచన తుడిచేశాను. మనం ఎప్పటికీ మంచి ఫ్రెండ్స్‌లా ఉందాం. ఓ చిన్న రిక్వెస్ట్. మనం కలిసి చదువుకున్న జ్ఞాపకంగా సరదాగా మన ఫ్రెండ్స్ అందరం కలసి ఓ గ్రూప్ ఫోటో తీసుకుందాం. దానికి అభ్యంతరం చెప్పకు దయచేసి" అన్నాడు. బతిమాలుతున్నట్లు ఉన్న ఆ అభ్యర్థన కాదనలేకపోయాను.

ఫ్రెండ్స్... క్లాస్‌మేట్స్ అంతా కలసి గ్రూప్ ఫోటో తీయించుకున్నాం. కాపీ పోస్టులో పంపిస్తానని నా అడ్రస్ తీసుకున్నాడు. అలా విడిపోయిన వాళ్లం యిదిగో నా పెళ్లయిన రెండు నెలలకు మొన్న ఓ రోజు మా అమ్మగారింటికి ఫోనుచేసి నా ఎడ్రస్ కనుక్కున్నాడట. ఈ ఎడ్రస్‌కు రిజిస్టర్ పోస్టు పంపాడు. లక్కీగా ఆ సమయంలో నేనొక్కదానినే ఇంట్లో ఉన్నా. లేకపోతే" చేతుల్లో ముఖం దాచుకు ఏడవసాగింది.

"చూడండి మాలతీ! మీ సమస్య నాకర్థం అయింది, ఇది నిజంగా బాధ కలిగించేదే. కానీ సమస్యలకు పరిష్కారం ఆలోచించాలి కానీ యిలా బేలగా ఏడుస్తూ కూర్చుంటే, ఆ సమస్య తీరిపోతుందాని" అని.

"ఆ ఫొటో" అని అడిగాడు.

"తెచ్చాను సర్. ఇదిగో" హేండ్‌బ్యాగ్ లోంచి ఫొటోతీసి యిచ్చింది. ఫొటోలో ఓ అబ్బాయి, అమ్మాయి మాత్రమే ఉన్నారు చాలా క్లోజ్‌గా. మాలతి ముఖం చేతుల్లో దాచుకుని ఏడుస్తోంది. కార్తీక్ ఆమెను బాగా ఏడవనిచ్చాడు. ఏడిస్తే ఆమె మనసులోని బాధ తీరుతుంది. మనసు తేలికపడుతుంది.

కాసేపయ్యాక అడిగాడు.

"దీని మీద స్టూడియో పేరు కానీ... ఎడ్రస్ కానీ లేదు. ఆ రోజు మీ కాలేజీలో ఫోటో తీసిన స్టూడియో పేరేమైనా గుర్తుందా మీకు? "

"ఆ... దాని పేరు 'మెస్మరైజ్'. పేరు గుర్తుండిపోయేలా వింతగా కొత్తగా ఉంది. ఆ ఫొటో తీసిన అబ్బాయి కూడా చాలా జోవియల్‌గా జోక్స్ వేస్తూ మా ఫ్రెండ్స్‌ని టీజ్ చేస్తూ తీసాడు. తరువాత చాలాసేపు తిట్టుకున్నాం కూడా" అని.

"ఇంకొక విషయం" మెల్లిగా అంది మాలతి.

"చెప్పండి"

"దానితోబాటుగా ఆ కవరులో ఓ ఉత్తరం కూడా ఉంది చూడండి" కవరులోంచి ఓ కాగితం తీశాడు కార్తీక్. కాగితం చాలా కాస్ట్లీగా, అందంగా ఉన్న లెటర్‌ప్యాడ్‌ది. కానీ ఆ చేతిరాత మాత్రం వంకరటింకరగా ఉంది

వాడి బుద్ధిలాగే.

"డార్లింగ్ మాలతీ,

నువ్వింకా పోగొడుతున్నావు నామతి, అయ్యావు యింకొకరి శ్రీమతి, కానీ నువ్వి వ్వాల్సిందే నీ అందం నాకు బహుమతి"

'వీడి ముఖానికీ చేసే వెధవ పనికీ ప్రాసలు కూడాను' తిట్టుకున్నాడు కార్తీక్. మళ్లీ చదవడం మొదలుపెట్టాడు.

"ఇలాటి ఫొటోలు నా దగ్గర యింకా చాలా ఉన్నాయి. ప్రేమగా, మర్యాదగా నన్ను పెళ్లాడమంటే ఛీ అన్నావు. ఇప్పుడు నువ్వు నా ప్రపోజల్ కనుక ఒప్పుకుంటే సరే సరి లేకపోతే ఈసారి రిజిస్టర్‌పోస్టు నీపేర రాదు మీ ఆయన పేర వస్తుంది, ఫొటోల తోసహా, ఆలోచించుకో. వారం రోజులు లోగా నువ్వు నన్ను ఎప్పుడు ఎక్కడ కల వాలి అనేది నేను నీకు ఫోనుచేసి చెప్తా, నీ ఎడ్రస్, ఫోను నెంబరు నాకెలా తెలుసా అని ఆశ్చర్యపోతున్నావా. మనసుంటే మార్గం అదే ఉంటుంది. "నువ్వంటే నాకు మనసు. అందుకే నీ చిరునామా నాకు తెలుసు" యింకా ఏదో చాలా చెత్తచెత్తగా రాశాడు. విషయం అర్థమయింది కనుక మిగతా చెత్త చదవడం అనవసరం. ఉత్తరం మడిచేశాడు కార్తీక్.

"నా భర్త మంచివాడే. నన్ను అమితంగా ప్రేమిస్తున్నవాడే. కానీ ఇలాంటి ఫొటోతో, నా గురించి చెడుగా రాస్తే నమ్మి నన్ను అనుమానిస్తే" భోరుమంది మాలతి మళ్లీ.

"అంటే ఆరోజు గ్రూప్ ఫొటో లోంచి మీ ఇద్దరి ఫొటోలు తీసి ఇలా వచ్చేలా తీశాడన్నమాట" అంటున్న కార్తీక్‌ను అయో మయంగా చూసింది.

"ట్రిక్ ఫొటోగ్రఫీ అని ఇలా ఫొటోలతో అల్లరిపెట్టచ్చనీ సినిమాల్లో చూశాంకానీ నిజంగా బయటా ఇలాంటి ఫొటోలు తియ్యచ్చా" ఆశ్చర్యంగా అడిగింది.

అంతలోనే తనకొచ్చిన ఆపద మాట మర చిపోయి, ఫొటోగ్రఫీలోని లేటెస్ట్ డెవలప్ మెంట్స్ చూసి ఆశ్చర్యపోతున్న ఆపిల్ల అమాయకత్వానికి జాలేసింది. అంతలోనే ముచ్చటేసింది కూడా.

"సినిమాలూ, కథలూ, నవలలూ అన్నీ కూడా జీవితాల్లోంచేనమ్మా పుట్టేది. కాక పోతే కాస్తంత ఫినిషింగ్ టచ్‌లు, పోలిష్‌లు ఉంటాయి. ఇవన్నీ మంచీ, చెడూ రెండూ చెబుతాయి, చూపెడతాయి కానీ చెడు ఎక్కి నంత త్వరగా మంచి ఎక్కదు ఎవరికీ. అదే పిటీ" నవ్వాడు కార్తీక్.

"సర్... మరి నేనిప్పుడేం చెయ్యాలి. ఆ రాస్కెల్... వాడు ఆ గోపాల్‌గాడు అన్నం తపనీ చేసి ఈ ఫొటో నా భర్తకు పంపితే' కళ్లనీళ్లతో జాలిగా అడిగింది.

"శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపా యాలు, నువ్వు మాటకు ముందు ఆ ఏడుపు మానెయ్. మనం ఏ తప్పు చెయ్య నన్నాళ్లూ, దేనికీ భయపడటం, బాధపడటం అవివేకం. అనవసరం. ఆ ఫొటోస్టూడియో పేరు చెప్పావు కదా చాలు. వాడిని నాలుగు తంతే నిజం దానంతట అదే బయట పడు తుంది.

నువ్వు నిశ్చింతగా ఉండు. అన్నట్లు వాడు మళ్ళీ ఫోనుచేస్తే, 'బయట ఎవరికయినా తెలిస్తే అల్లరి అయిపోతుంది కనుక నువ్వే మా ఇంటికి రా. నీ సెల్ నెంబర్ ఇస్తే, ఎప్పుడు రావాలో వీలు చూసుకు చెబు తాను' అని వాడి సెల్ నెంబర్ తీసుకో. నువ్వు నిశ్చింతగా ఉండు. ఆ తర్వాత కథ నేనడిపిస్తా" అభయం ఇచ్చాడు కార్తీక్.

మాలతి ఫోను నెంబరు తీసుకుని ఆమెను పంపించేశాడు.

ఆ స్టూడియోకు వెళ్ళి, ఆ ఫొటో వెనక నున్న కథ తెలుసుకున్నాడు. గ్రూఫ్ ఫొటో లోంచి 'ఆ యిద్దరినీ' మాత్రం బయటకు లాగిన 'ఆ పనితనాన్ని' బోలెడు మెచ్చుకు న్నాడు.

"ఈ పనితనం అంతా సినిమా ఫీల్డ్‌లో చూపించావంటే నీకు పేరుకు పేరు,

సొమ్ములుకు సొమ్ములు, అంతే కానీ యిలా అయినింటి ఆడపిల్లలని ఏడిపించే పోకిరీ వెధవలకు ఉపయోగిస్తే ఊచలు లెక్కబెట్టా ల్సొస్తుంది. నీ తప్పు నువ్వు సరిచేసుకుంటే నీకు ఏ ప్రాబ్లమ్ ఉండకుండా చూసుకునే బాధ్యత నాది. లేదంటే ఎలా డీల్ చెయ్యాలో నాకు బాగా తెలుసు. లేదంటే నీకు నా గురించి, ఈ లాయర్ కార్తీక్ గురించి నీకేం తెలియదని అర్థం. తెలియ జేస్తే, నువ్వు చాలా నష్టపోతావ్" హెచ్చ రించి వాడికి బ్రైన్‌వాష్ చేసి మాలతి ఇంటికి ఎప్పుడు ఎలా ఎంటరవ్వాలో... చెప్పి వుంచాడు.

మాలతికి ఫోన్ చేశాడు కార్తీక్.

"అమ్మా మాలతీ... కార్తీక్‌ని మాట్లాడు తున్నాను"

"నమస్తే... చెప్పండి"

"మీ ఇంట్లో ఎల్లుండి ఆదివారం ఫంక్షన్. ఏకారణంతో ఎలా అరేంజ్ చేస్తావో అంతా నీ యిష్టం. ఆ అన్నట్లు నా గెస్టులు కూడా ఇద్దరు ముగ్గురు ఉంటారు సుమా. ఏమిటీ ఏం మాట్లాడవ్. వీడేమిటీ, మా ఇంట్లో ఫంక్షన్ అనడం ఏమిటీ? అది కూడా వాళ్ల గెస్టులను పిలవడం ఏమిటీ అనుకుంటు న్నావా? "

"అహ... అదేం లేదు. కానీ ఇప్పుడు మా ఇంట్లో ఏం ఫంక్షన్ చెయ్యడం లేదే" అయో మయంగా అంది మాలతి.

"సందేహాలొద్దు, నామీద నమ్మకం ఉంచి, నే చెప్పినట్లు చెయ్యి అంతా నీ మంచికే. ఆ అన్నట్లు నన్ను లాయర్‌గారూ అని పిలవ క్కరలేదు. చక్కగా అన్నయ్యా అని పిలు. నాకెటూ అక్కచెల్లెళ్లు లేరు. నేను మీ బంధు వుల అబ్బాయిననీ, వరసకు అన్నయ్య అనీ మీ ఇంట్లో చెప్పు"

"అలాగే... కానీ ఫంక్షన్"

"ఏదో అకేషన్. మీ ఇద్దరిలో ఎవరిద యినా బర్త్‌డే, లేక మరేదైనా"

"మా పుట్టిన రోజులు ఈ నెలలో లేవు గానీ మా ఆయనకు ఆఫీసర్ ప్రమోషన్ వచ్చింది. ఆ సందర్భంగా మరి ఆయనేమంటారో"

"ఏమీ అనడు కానీ, ఎలాగైనా మీ ఆయ నను ఒప్పించు. ప్రమోషన్ రావడం మంచి అకేషన్, పైగా పెద్ద అకేషనే. అంతా నీ మంచికే మరి అలా చేద్దాం. ఉంటాను. మళ్ళీ ఫంక్షన్‌లో కలుద్దాం" అంటూ ఫోను పెట్టేశాడు కార్తీక్.

ఫంక్షన్ ఏమిటో ఎందుకో తన ఇంట్లో ఎందుకు ఎరేంజ్ చెయ్యమంటున్నాడో అంతా అయోమయం. అసలు తన ప్రాబ్లమ్ విషయం వదిలేసి ఈ ఫంక్షన్ గోలేమిటి? అయినా అంతా నా మంచికే అంటున్నాడుగా, చూద్దాం" నిట్టూర్చింది మాలతి.

"ఏమండీ" గోముగా పిలిచింది మాలతి.

"ఊ" ఫైల్స్ చూసుకుంటూ పలికాడు రఘు, మాలతిభర్త.

"మరి మీకు ప్రమోషన్ వచ్చిందిగా. అది కూడా మన పెళ్ళి అయిన వెంటనే వచ్చిం దిగా. మరి నాకేం బహుమతి ఇస్తారు? "

"బహుమతీ... ఊ... నీకేం కావాలి? "

ఫైల్లోంచి తలెత్తకుండానే అడిగాడు రఘు.

"అడిగాకా కాదనకూడదు" ముందరికాళ్లకు బంధం వేసింది మాలతి.

"కొంపదీసి, జాలీగా ఫారెన్ ట్రిప్పో లేక పోతే ఏ బంగారం షాపో కావాలనవు కదా" వెక్కిరింతగా అన్నాడు రఘు.

"ఛ... నేనేమంత ఆశపోతునేం కాదు. మీరు తీర్చగలిగిందే అడుగుతా" హామీ ఇచ్చింది.

"సరే అయితే అడుగు మరి యింక ఆల స్యమెందుకు? "

"మరి...మరి మీకు ప్రమోషన్ వచ్చిన సందర్భంగా మనం మన ఇంట్లో మంచి పార్టీ ఇద్దామండీ"

"ఓస్... యింతేనా. అయినా బహుమతి అంటే నీకేం కావాలో అడగాలికానీ ఇలా

పార్టీలు, పిక్నిక్‌లూ ఎందుకోయ్. ఆఫీసులో ఎటూ తప్పదు మళ్ళీ ఇంట్లో ఈ పార్టీ గోలెందుకు చెప్పు"

"ఉహు... ఇవ్వాల్సిందే. అదే నాకిష్టం" కినుకగా అంది మాలతి.

"నాకర్థం అయిందిలే. ఊళ్లోనే కదా పెళ్ళి, మళ్ళీ రిసెప్షన్ ఎందుకూ అంటూ నాన్నా వాళ్లూ మన మారేజ్ రిసెప్షన్ ఇవ్వనివ్వ లేదు. ఇప్పుడు ఈ వంకతో ఆ ముచ్చట తీర్చుకోవాలనుంది దేవిగారికి" ఫైలు మూసేస్తూ అన్నాడు.

"అవునండీ... ఎలాగైనా మీరు చాలా తెలివైనవాళ్లు. విషయం ఇట్టే గ్రహించారు" మెచ్చుకోలుగా అంది ఎలాగో అలా ఫంక్షన్ ఓ.కే చేస్తే చాలని.

"సరే మరీ... కానీ ఇంత హడావుడి గానా. సండే అంటే మరీ ఎల్లుండే. ఎరేంజ్‌మెంట్స్ అవీ..." సందేహంగా అన్నాడు.

"ఓస్... అవన్నీ నాకొదిలెయ్యండి. నేను ఫంక్షన్స్ ఎరేంజ్ చెయ్యడంలో నెంబర్‌వన్. మీరు రేపు మధ్యాహ్నం సెలవుపెడితే మనం ఫంక్షన్‌కు పిలిచే వాళ్లను పిలిచేద్దాం. పిలుపులు అయిపోతే మిగతా అరేంజ్‌మెంట్స్ అన్నీ నా కొదిలెయ్యండి. ఎంత బాగా చేస్తానో" ఆనందంగా అంది మాలతి.

"ఓకే డియర్. నీ ఆనందమే నా ఆనందం" అంటూ ఆమెను అల్లుకుపోయాడు రఘు.

రాసుకున్న లిస్టుప్రకారం ఎవరెవరిని పిలవాలో అందరినీ పిలిచాకా దారిలో అడిగింది మాలతి.

"ఏమండీ... కార్తీక్ అని లాయర్ ఉన్నారట కదా ఈ ఊళ్లో... అతను మా కాంతం పిన్ని కొడుకు. చిన్నప్పుడెప్పుడో చూశాను. మొన్న మా ఇంటికెళ్ళినప్పుడు మాటల సందర్భంలో తెలిసింది అతను ఇక్కడే వున్నాడని, మరి పిలుద్దామా" సందిగ్ధంగా అంది మాలతి.

"ఓ... లాయర్ కార్తీక్ మీకు బంధువా, నైస్‌మాన్. ఒకటి రెండుసార్లు రోటరీ క్లబ్‌లో చూశా కానీ పరిచయం లేదు మరి చెప్పవేం పద... పద పిలుద్దాం"

"అమ్మయ్య" అనుకున్న మాలతి "మరి అతని ఇల్లు"

"నాకు తెల్సులే. గాంధీబొమ్మ ఏరియాలోనే, అక్కడకు వెళ్లి వాకబు చేద్దాం" అన్నాడు ఆమె ఇల్లు ఎక్కడో తెలియదని వర్రీ అవుతోందనుకుని.

'అమ్మయ్య థాంక్‌గాడ్' అనుకుంది రిలీఫ్‌గా.

వెళ్ళి, పరిచయాలు చేసుకోగానే, అలాగా బావగారూ అంటూ వరస కలిపేసి సరదాగా మాట్లాడుతున్న కార్తీక్ రఘుకెంతో నచ్చాడు.

"తప్పకుండా రండి" అన్నాడు రఘు వెళ్ళడానికి లేస్తూ.

"బంధుమిత్ర సపరివారంగా అండోయ్" సరదాగా అన్నట్లుగా అన్నాడు.

ఆదివారం రానే వచ్చింది.

'ఇప్పుడెందుకురా డబ్బుదండగా' అని తండ్రి గొణుగుతున్నా మాలతి అందనీ, ఆమె కోసం ఆమె ఆనందంకోసం బాగానే ఖర్చుపెట్టాడు రఘు.

అసలే అందంగా చూడముచ్చటగా ఉండే ఆ జంట. ఆ వేళ స్పెషల్‌గా తయారవడంతో మరీ ముచ్చటగా ఉన్నారు, నిజంగా ఆరోజే వాళ్ల మారేజ్ రిసెప్షనా అన్నంతగా.

సాయంత్రం ఆరు అవుతోంది. అతిథులు ఒక్కొక్కరే రాసాగారు. మాలతీ, రఘూ ఎంట్రన్స్‌దగ్గరే నిలబడి అందరినీ ఆప్యాయంగా రిసీవ్ చేసుకుంటున్నారు.

కారు దిగి కార్తీక్ ఎవరో నలుగురుతో కబుర్లు చెబుతూ లోపలికి వస్తున్నాడు. వస్తున్న కార్తీక్‌ను, అతని వెంటనున్న వాళ్లనీ చూసింది మాలతి, అందులో ఒకతనిని ఎక్కడో చూసినట్లు అనిపించిందామెకు.

'ఆ... అతను ఆరోజు ఫొటోగ్రాఫర్. అదే మిటీ ఏకంగా అతనిని ఇక్కడికే తీసుకొచ్చే

శాడు' మనసులోనే అనుకుంది. మాలతిలో గాభరా మొదలయింది.

"హలో బావాజీ... లేట్ అయ్యానా" అంటూ రఘుతో కరచాలనం చేశాడు కార్తీక్. "అదిగోనండోయ్ బంధుమిత్ర సపరివారంగా వస్తా అన్నా, వచ్చేశాను" అన్నాడు నెమ్మదిగా రఘుకి మాత్రమే వినబడేలా.

"ఈయన రామదాసుగారనీ, పెద్ద కాంట్రాక్టర్, ఈయన టూటౌన్ ఎస్.ఐ మోహన్. ఈయన గణేశ్ అనీ 'మెస్మరైజ్' ఫొటో స్టూడియో ఓనర్ నాకు మంచి ఫ్రెండ్, అంతే కాదు మన ఫామిలీ శ్రేయోభిలాషి కూడా" అంటూ హడావుడి చేస్తున్న కార్తీక్‌ను చూస్తే చాలా ముచ్చటేసింది అక్కడున్న వాళ్లకు.

నిజానికి రామదాసుకు ఎంతమాత్రం పరిచయం లేని తనను పరిచయం చేసుకుని పార్టీకి ఎందుకు పిలిచాడో కార్తీక్ అర్థంకావడంలేదు. కానీ పేరున్న లాయర్ స్వయంగా తన ఇంటికి వచ్చి పరిచయం చేసుకుని పార్టీకి పిలిస్తే కాదనడం బాగుండదని వచ్చాడు.

నిజానికి ఎస్.ఐ. మోహన్ పరిస్థితీ అలాగే వుంది, అవడానికి మిత్రుడే అయినా ఎప్పుడూ కార్తీక్ ఇంటికే వెళ్లలేదు ఇంతవరకూ. అలాంటిది వాళ్ల సిస్టర్ ఇంట్లో ఫంక్షన్ అయితే తననెందుకు పిలాచాడో అర్థంకాలేదు. డ్యూటీ అయి ఇంటికి వెళుతూంటే స్టేషన్ ముందే ఎదురయ్యాడు.

"అమ్మయ్య... ఉన్నావా? ఉన్నావో లేవో అని కంగారు పడుతున్నా" అంటూ.

"ఏమిటి కార్తీక్ సంగతి. ఏదైనా కేసు విషయం మాట్లాడాలా"

"నో...నో... నువ్వు ఇప్పుడు నాతో ఓ చోటికి రావాలి, ఓ గంట స్పేర్ చెయ్యగలవా"

"వైనాట్... ష్యూర్. కానీ ఇంటికి వెళ్ళి కాస్త డ్రస్ ఛేంజ్ చేసుకు వెళ్లచ్చుకదా"

"ఊ... వద్దు మోహన్... యిలాగే వెడదాం. ఎంత జస్ట్ ఒన్ అవర్ ప్లీజ్"

"ఓ...కె... ఓ...కె... రా..." బైక్ స్టార్ట్ చెయ్యబోతూ అన్నాడు.

"నో...నో... నీ బైక్ ఇక్కడే ఉంచు నా కారులో వెడదాం. మళ్ళీ నిన్ను ఇక్కడే డ్రాప్ చేస్తా. కమ్... కమ్"

"ఓ.కె. బాబా. చల్" బైక్ ఓ పక్కకి పెట్టి లాక్‌చేసి వచ్చాడు.

"మోహన్... కమాన్ హేవిట్" కూల్ డ్రింక్ అందిస్తూ అన్నాడు కార్తీక్.

"ఏమిటీ ఏదో ఆలోచనలోపడ్డావు"

"ఏం లేదు" ఆలోచనల్లోంచి ఇవతలకు వస్తూ అన్నాడు మోహన్ "నాకు తెలుసు, నేను నిన్ను హడావుడిగా యిక్కడకు తీసుకొచ్చిన కారణం గురించి ఆలోచిస్తున్నావు నువ్వు. దాని గురించి వదిలేసి పార్టీ ఎంజాయ్ చెయ్యి. అసలు ఎప్పుడూ కేసులూ, గొడవలేగా మీ డిపార్ట్‌మెంటుకు" అంటూనే అందరికీ అన్నీ అందాయో లేదో చూస్తున్న మాలతి దగ్గరకు వచ్చాడు.

"అన్నయ్యా..." ఏదో అడగబోయిన మాలతిని వారించాడు అటూ ఇటూ చూసి.

"తర్వాత మాట్లాడదాం. ముందు నువ్వు లోపలికి వెళ్ళి, ఆ గోపాల్ సెల్‌కు ఫోను చెయ్యి. వెంటనే రమ్మని చెప్పు. ఒక్కదాన్నే ఉండే అవకాశం అనుకోకుండా వచ్చింది. ఆలస్యం చెయ్యకుండా వెంటనే రమ్మను"

"ఇప్పుడా" అంటూ బెదురుగా చూస్తున్న మాలతికి అదే విషయం మళ్ళీ చెప్పి అక్కడ నుండి తన ఫ్రెండ్స్ దగ్గరకు వెళ్ళిపోయాడు కార్తీక్. ఎందుకో ఏమిటో అర్థంకాకపోయినా తన మంచి చెడులు అతని చేతిలో పెట్టిన మాలతి వెంటనే గోపాల్ సెల్‌కు ఫోనుచేసింది. "వెంఠనే రమ్మంటూ" మాలతి పిలుపు అందుకున్న గోపాల్ ఆనందంతో ఆఘమేఘాలమీద వచ్చేశాడు.

'ఏమిటీ... ఇక్కడ ఏదో హడావుడిగా ఉంది. మరి మాలతి నన్ను ఇప్పుడు రమ్మనడమేమిటీ... ఆ, లోపలికి వెళితే అదే

తెలుస్తుంది' అనుకుంటూ లోపలికి వెళ్లాడు గోపాల్.

అక్కడ చాలామంది ఉన్నారు. గేటు దాటి లోపలికి వెళ్లిన గోపాల్‌కి ఎందుకో తను వెంటనే వెనక్కి వెళ్లిపోతేనే బెటర్ అనిపించింది. మరుక్షణం వెనక్కి తిరిగాడు. అదే క్షణంలో అతనిని చూసిన మాలతికి అతను వెళ్లిపోతున్నాడని అర్థం అయి వెంటనే పిలిచింది గట్టిగా "గోపాల్" అంటూ.

ఆమె పిలిచిన పిలుపుకు కొంతమంది గేటువైపు చూశారు. గోపాల్‌కు ఆగక తప్ప లేదు.

మాలతి గబగబా గోపాల్ దగ్గరికి వచ్చింది "అదేమిటీ వెళ్లిపోతున్నావ్" అంటూ.

గోపాల్‌కంతా అయోమయంగా ఉంది. ఇదేమిటి ఇక్కడేదో ఫంక్షన్ జరుగుతుంటే మరి మాలతి తనను ఎందుకు వెంటనే రమ్మన్నట్లు.

"గోపాల్, ఈయన మా శ్రీవారు రఘు. ఏమండీ ఇతను గోపాల్ అని మా క్లాస్ మేట్" ఎటువంటి జంకు లేకుండా కాజువల్‌గా తనని పరిచయం చేస్తున్న మాలతిని చూస్తే ఆశ్చర్యమనిపించింది గోపాల్‌కు.

"నమస్తే రండి" అంటూ రిసీవ్ చేసుకున్న రఘుని చూస్తే బెదురుగా అనిపించింది.

"గోపాల్ మా అన్నయ్యను కూడా పరిచయం చేస్తా రా" అంటూ కార్తీక్ వాళ్లవైపు తీసుకెళ్లింది మాలతి.

"అన్నయ్యా... ఇతను గోపాల్ అని నా క్లాస్‌మేట్. గోపాల్ ఈయన మా అన్నయ్య కార్తీక్ లాయర్" అంటూ పరిచయం చేసింది.

అయోమయంగానే చేయి చాచాడు గోపాల్ "నైస్‌టు మీట్‌యూ" అంటూ. అంతలోనే కార్తీక్ పక్కన ఉన్న తన తండ్రిని చూసి ఖంగుతిన్నాడు.

"అరె గోపాల్... నువ్విక్కడ" అంటూ ఆగారు రామదాసుగారు.

"అతను మా క్లాస్‌మేట్ గోపాల్ అంకుల్. మీకు ముందే తెలుసా! అయితే పరిచయాల శ్రమ తప్పింది"

"గోపాల్ మా అబ్బాయేనమ్మా" అని.

"ఏరా గోపాల్ నీకింత మంచి ఫ్రెండ్స్ ఉన్నట్లు ఎప్పుడూ చెప్పలేదే. నేనింకా నీకంతా ఆవారాగాళ్లే ఫ్రెండ్స్ అనుకుంటున్నా" అన్నాడు నవ్వేస్తూ.

"అంకుల్ ఐ అబ్జక్ట్ యువరానర్. గోపాల్ తరపున నేను అబ్జక్టు చేస్తున్నా. ఎవరి ఫ్రెండ్స్ వారికి గొప్ప. మీరలా అవమానించకూడదు" సీరియస్‌గా చెప్పాడు కార్తీక్.

"బాబూ ఇక్కడ కూడా నీ లాయర్ బుద్ధి పోనిచ్చుకోలేదు. నీకు ఫీజివ్వరు ఇక్కడెవరూ" అంతా నవ్వేశారు.

"బైదవే.. ఇతను మోహన్. టూ టౌన్ ఎస్.ఐ. నా ఫ్రెండ్, ఈయన శంకర్రావుగారని మా బాబాయ్. ఇకపోతే ఈయన" అంటూ గణేశ్‌వైపు చూశాడు కార్తీక్.

సరిగా అప్పుడే కాస్త తేరుకుని అటు తిరిగిన గోపాల్‌కు మరో షాకు. అది గమనించినా గమనించనట్లే పరిచయం చేశాడు కార్తీక్.

"గణేశ్ అనీ, మెస్మరైజ్ ఫోటోస్టూడియో ఓనర్. మంచి పేరుంది ఫొటోల్ని బాగా తీస్తారని. ట్రిక్ ఫొటోగ్రఫీ కూడా డెవలప్ చేశారు మన ఊళ్లో ఉంటూనే"

గోపాల్ ముఖంలో రంగులు మారాయి గబగబా.

"నమస్తే" చాలా నీరసంగా పేలవంగా వచ్చిందామాట. ఫంక్షన్ బాగా జరిగిందంటూ అంతా మెచ్చుకుని సెలవు తీసుకున్నారు.

"నేను మా వాడితో బైక్ మీద వెడతా మిస్టర్ కార్తీక్. మళ్లీ మీకెందుకు శ్రమ" అన్న రామదాసుగారితో.

"నో నో మీరు నా గెస్టులు, మిమ్మల్ని డ్రాప్ చెయ్యడం నా విధి" అంటూ తన గెస్టులతో కారులో వెళ్లిపోయాడు కార్తీక్ రఘు, మాలతిల వద్ద సెలవు తీసుకుని.

గెస్టులందరినీ దగ్గరుండి కృతజ్ఞతలు తెలిపి మరీ పంపిస్తున్న రఘు, మాలతిల వద్దకు వచ్చాడు గోపాల్.

చక్కటి రూపం, దానికి తగ్గ ప్రవర్తన, మంచి పొజిషన్‌లో ఉన్న రఘుని చూస్తే గోపాల్‌కు ఏదోలా అనిపించింది. చాలా అసూయగా కూడా అనిపించింది.

"మిస్టర్ రఘూ. ఇక నే బయలుదేరతా" అన్నాడు కనీసం మాలతిని పలకరించడానికి కూడా ధైర్యం చాలక.

"వెరీనైస్‌టు మీట్‌యు గోపాల్. మాలతే కాదు ఇక నుంచి నేను కూడా మీ ఫ్రెండ్‌నే. తప్పకుండా అప్పుడప్పుడు వస్తుండండి" అన్న ఆ ఆప్యాయత గోపాల్‌లోని గిల్టీనెస్‌ను మరింత పెంచింది. దానికి తోడు ఆ పిలుపుకు నువ్వు అర్హుడివా అన్నట్లు తన రాక అసలు ఇష్టం లేనట్లు భరించలేనట్లు మాలతి చూసిన చూపు గోపాల్‌ను మరింత క్షోభకు గురిచేసింది.

"మాలతీ... జరిగినదంతా క్షమించి మర్చిపో. ఇక నుంచి నా వలన నీకు ఏ ఇబ్బందీ, బాధ ఉండదు ప్రామిస్. మనం మంచి స్నేహితులం ఇక నుంచి" అన్న గోపాల్ ఫోన్‌కాల్ మాలతి మతి పోగొట్టింది. ఆనందంతో నోట మాట రాలేదు, అప్పటికప్పుడు కార్తీక్ ఇంటికి పరిగెత్తింది.

ఇంకా కోర్టుకెళ్లలేదు కార్తీక్, ఏదో కేసు ఫైల్ స్టడీ చేస్తున్నాడు. కార్తీక్ మాలతిని ఆహ్వానించి కంగ్రాట్స్ చెప్పాడు.

" ఇదెలా సాధ్యమయింది? ఆ గోపాల్ ఇప్పుడే ఫోను చేసి సారీ చెప్పాడు. ఇక నుంచి నన్ను వేధించననీ, మనం మంచి స్నేహితులం, జరిగినదంతా క్షమించి మర్చిపొమ్మని. నువ్వు... సారీ మీరేమైనా గోపాల్‌కు వార్నింగిచ్చారా? లేకపోతే వాళ్లవాళ్లతో... అవునూ ఇంతకూ వాళ్ల నాన్నగారు మీకు ఎలా తెలుసు, తెలుసునని నాకెందుకు చెప్పలేదూ"

"ఇదిగో ముందు నీ ఎగ్జైట్‌మెంట్ తగ్గించుకో తల్లీ... నువ్వు నన్ను మీరు, గీరు, అండీ, మండీ లాయర్‌గారూ అనేం పిలవనక్ఖరలేదు. నువ్వు చక్కగా అన్నయ్యా అని పిలిస్తేనే నాకు అక్కచెల్లెళ్లులేని లోటు తీరి హాయిగా ఉంటుంది. ఇకపోతే గోపాల్ వాళ్ల నాన్నగారు నాకు పరిచయస్థులు కారు"

"మరి గోపాల్ సంగతి చెప్పి నువ్వే ఆయనను పిలిచావా" విషయం వాళ్లకు తెలిసిపోయిందేమో అన్న అనుమానం అవమానాన్ని కలిగించగా గాభరాగా అంది.

"నో నో నో... నిన్ను ఎగ్జైట్ అవద్దన్నానా. ఇటువంటి చెత్త విషయాలు అందరికీ చెప్పి నిన్ను నలుగురి నోట్లో పడేలా చేస్తానా. ఎవరికీ ఏమీ చెప్పలేదు"

"మరి గోపాల్ ఎలా మారాడు. ఆ ఫోనెందుకు చేశాడు" అర్థం కాని అయోమయంలో అడిగింది మాలతి.

"తల్లీ... అదే నే ప్లేచేసిన ట్రిక్... మనిషి మానసిక స్థితిమీద నేప్లేచేసిన ట్రిక్. నేను అనకూడదు ఎందుకంటే అసలు ఆ సలహా ఇచ్చినది మా శంకరం బాబాయ్"

"ఆయనా... ఆయనకు చెప్పేశావా? "

"నీ సమస్యా పరిష్కారం కోసం నే తీవ్రంగా ఆలోచిస్తుంటే కారణం అడిగారు చెప్పాను. అంతేకాదు అంటూ ఈ సలహా ఇచ్చారు. ఆయన చాలా మంచి వ్యక్తి, తెలివైన వ్యక్తి ఎలాంటి సమస్యలకైనా క్షణాల మీద చక్కని పరిష్కారం సూచించగలడు. దాని ఫలితమే ఇది. ఏమైనా కథ సుఖాంతం అయింది. బీ హేపీ"

"అవును... నా కథని సుఖాంతం చేసిన ఘనత నీది. ఆ బాబాయ్‌గారిదే. మీకు నేను చాలా ఋణపడిపోయి ఉన్నానన్నయ్యా. కానీ అసలు ఏం జరిగింది? ఊరికే తెలుసుకోవాలని" అభ్యర్థనగా అంది

మాలతి.

"రైట్... ఆమాత్రం జిజ్ఞాస ఉండటంలో తప్పు, ఆశ్చర్యం ఎంతమాత్రం లేవు. జస్ట్... సింపుల్. ఏ వ్యక్తి అయినా బెదిరి, భయపడినవాళ్లనే లొంగదీసుకోవాలనుకుంటాడు. అలాకాక అసలు దానికి విలువే ఇవ్వనట్లు ఉంటే సగం జారిపోతాడు అవతలివాడు. దానికి తోడు ఎలాంటి వారయినా తల్లితండ్రులకు తెలుస్తుందంటేనో తెలిసిందంటేనో తప్పు చెయ్యడానికి భయపడతారు. పైగా ఇలాంటి తప్పు. అందుకే ఈ పాయింటు మీదే రామదాసుగారిని పరిచయం చేసుకుని నా ఐడెంటిటీ చెప్పి 'ఊరికే సరదాగా మీతో స్నేహం చెయ్యాలని ఉంది. నాకు మీలో మంచి బిజినెస్ మాగ్నెట్‌తోబాటు మంచి స్నేహితుడు కూడా కనిపిస్తున్నాడు. నా వరకు నాకు స్నేహానికి పెద్ద చిన్న అన్న తారతమ్యం లేదు' అంటూ బాగా గాలి కొట్టాను. పడిపోయాడు. నాలాంటి కాస్త పేరున్న లాయర్ చెయ్యి జాపి స్నేహం అడిగితే కాదనడానికి కారణం కనబడలేదు. అందుకే వచ్చాడు. ఇకపోతే నీ సర్కిల్, స్టేటస్ తెలియడానికే నా ఫ్రెండ్ మోహన్‌ని పిలిచా. అదే ఆ ఎస్.ఐ. అన్నింటికంటే ముఖ్యమైనది ఆ ఫొటోస్టూడియో గణేశ్‌ను రఘు వాళ్ల బాబాయి కొడుకుగా పరిచయం చేసా. అంతే గురుడు సైలెంట్‌గా దారిలో కొచ్చేశాడు రాముడు మంచి బాలుడు టైపులో"

నోరు తెరిచి ఇదీ విషయం అంటూ ఏ ఒక్కరికీ చెప్పకుండా విషయం వీధికెక్కి నలుగురికి తెలిసి అల్లరిపాలవకుండా చక్కదిద్దిన కార్తీక్ తెలివి తేటలూ వ్యవహార దక్షత మాలతికి ఆశ్చర్యంతోబాటు ఎంతో ఆనందం కలిగించాయి. జీవన్మరణ సమస్య ఇంత త్వరగా, సులభంగా పరిష్కారమయినందుకు ఎంతో ఆనందపడింది. శంకరం బాబాయ్‌గారిని కూడా కలిసి కృతజ్ఞతలు తెలిపింది మాలతి.

మాలతి, రేవతి కూడా తక్కువ కాలంలోనే మంచి స్నేహితులయిపోయారు. మాలతి ఆడపడుచు అథారిటీ అంతా రేవతి నవ్వుతూ ఎంజాయ్ చేస్తుంది.

తమాషా ఏమిటంటే వీళ్లు గోపాల్‌ను కూడా తమ మిత్ర బృందంలో ఒకడిగా చేర్చేసుకున్నారు. పూల తావి దారానికి కూడా అబ్బినట్లు వీళ్ల మంచితనం, స్నేహం అనే సుగంధం గోపాల్‌ను కూడా అంటి మంచివాడుగా, వీళ్లల్లో ఒకడిగా చేసేసింది.

"తప్పు చెయ్యడం తప్పుకాదు, ఆ తప్పు తెలుసుకుని సరిదిద్దుకోవడం, ఆ తప్పు మళ్లీ చెయ్యకపోవడం గొప్ప నాలాగా అంటాడు మా శంకరం బాబాయ్" అంటూ చెప్పే కార్తీక్‌ను.

"మరే చెప్పక చెప్పక మిమ్మల్నే కోట్ చేసి చెప్పాలి" అంటూ ఉడికిస్తుంది రేవతి.

కార్తీక్, రేవతిల కథ, అది సుఖాంతం కావడంలో శంకరం బాబాయ్ పాత్ర మాలతినెంతో కదిలించాయి. వాళ్ల ముగ్గురూ అంటే ఇప్పుడామ్మాయికి చెప్పలేని ఆత్మీయత, ఆరాధన.

అల్లరి అయి రోడ్డునపడ్డ రెండు జీవితాలను, అయినవాళ్లూ కడుపులో పెట్టుకు కాపాడవలసినవాళ్లు ఖర్మ అనుకుని గాలికొదిలేసి చేతులు దులుపుకున్నా ఏ బంధం, అనుబంధం లేకున్నా మానవతా బంధంతో ఆదరించి మంచీచెడూ చెప్పి వారిని ఓ దరి చేర్చిన గొప్పతనం శంకరం దంపతులదయితే ఆ గొప్పతనాన్ని గుర్తించి తమ తప్పు తెలుసుకుని తొందరపాటుతో చేజార్చుకున్న జీవితభాండం బద్దలు కాకుండా కాపాడుకున్న ఘనత కార్తీక్, రేవతులది.

★ ★ ★

రోజులు హాయిగా గడిచిపోతే ఎలా? మధ్యమధ్యలో మనస్తాపాలు, దుఃఖాలు లేని జీవితాలే ఉండవేమో... ఓ రోజు ఉన్నట్లుండి మాలతి విరుచుకుపడిపోయిందన్న ఫోను రఘునించి, హడావుడిగా వెళ్లారు

కార్తీక్, రేవతి. అప్పటికే ఆమెను హాస్పిటల్‌లో చేర్చారు రఘూ వాళ్లు. మాలతి నిండు గర్భవతి. నేడో రేపో ప్రసవం అనుకుంటుండగా ఈ ఘోరం.

"ఏమయింది రఘూ" అన్న కార్తీక్ ప్రశ్నకు రఘు రోదనే జవాబయింది.

"మాలతి వాళ్ల ఇంటి నుంచి ఫోను వచ్చింధోయ్ కార్తీక్. ఫోను రిసీవ్ చేసుకుంటూనే మాలతి వెర్రిగా కేకపెట్టి విరుచుకుపడిపోయింది. ఏమైయిందా... అని నేను ఫోనుతీశా" కన్నీళ్ల మధ్య చెప్పారు రఘూ వాళ్ల నాన్నగారు.

"అబ్బబ్బ... అసలేమయిందో చెప్పరేం" కాస్త అసహనంగా అడిగాడు కార్తీక్ గాభరాగా.

"మాలతి వాళ్ల చెల్లెలు ఆత్మహత్య చేసుకుందట. ఆ సంగతి వాళ్ల బంధువులెవరో ఫోనులో చెప్పారు. అసలే నెలలు నిండిన మనిషి. తట్టుకోలేకపోయింది" బాధగా అన్నారాయన.

మాలతి చెల్లెలి విషయం బాధ కలిగించినా ప్రస్తుతం మాలతి పరిస్థితి కార్తీక్‌లో కోపాన్ని తెప్పించింది.

"ఎవరు? ఎవరు అంత బుద్ధి లేకుండా షాకింగ్ న్యూస్ నిండు గర్భిణికి ఉన్నపాటుగా చెప్పిన ఫూల్స్. ఇంట్లో మీకెవరికయినా చెప్పచ్చుగా" కోపంగా అడిగాడు.

"ఎవరో వాళ్లింటికొచ్చిన బంధువులు పాపం అలా చెప్పకూడదని తెలియకే చెప్పారు. ఏదయితేనేం మన అదృష్టం ఇలా వుంది" బాధగా అన్నారాయన.

"మామయ్యగారూ మామయ్యగారూ" అంటూ అరమరికలు లేకుండా కన్నతండ్రికి చేసినట్లు అన్నీ చేసి పెట్టే మాలతి నాస్థితిలో చూసి తట్టుకోవడం ఈ వయసులో ఆయనకు చాలా కష్టంగా ఉంది. ఇక రఘు సంగతి చెప్పఖ్ఖరలేదు. పిచ్చివాడిలా చేష్టలుడిగి కూర్చుండిపోయాడు.

"రఘూ... కొంచెం కంట్రోల్ చేసుకో. మన మాలతికేం కాదు నేను డాక్టరుతో మాట్లాడతాను" అంటూనే గబగబా డాక్టర్ దగ్గరికి వెళ్లిపోయాడు కార్తీక్.

"తల్లీ బిడ్డా యిద్దరి కండిషన్ సీరియస్ మా ప్రయత్నాలు మేం చేస్తాం తర్వాత మీ అదృష్టం" అంటూ హడావుడిగా లోపలికి వెళ్లిపోయాడు డాక్టర్. మాలతిని లేబర్ రూంలోకి తీసి కెళ్లిపోయారు. డాక్టర్ అన్నట్లు వీళ్ల అదృష్టమో... ఆ దేముడి కరుణోగానీ మాలతికి చక్కటి ఆడపిల్ల. ఇద్దరూ బతికి బట్టకట్టారు. కానీ మాలతికి మెంటల్ షాక్ తగిలి తనూ తన చెల్లితో గడిపిన రోజులూ ఆ విషయాలు తప్ప మిగిలినదంతా, మిగిలిన అందరినీ మరచిపోయింది. ఓ రకంగా పిచ్చిదయిందనే చెప్పాలి. అయితే మాలతి చెల్లెలు మల్లికకు జరిగిన ఘోరం ద్రోహం ఆమెకేకాదు ఎవరికయినా షాక్ కలిగించేదే. మల్లిక నిజంగా పేరుకు తగ్గట్టు మల్లెపూవే. అంత అందంగా, సున్నితంగా స్నేహ సౌరభాలు, మంచి గంధాలు విరజిమ్మే ఆమె అలా పిరికిగా ఆత్మహత్య చేసుకోవడం అందరికీ చాలా బాధకలిగించింది.

మరో ఆడ తోడు లేని మాలతికి నెల తప్పి అవస్థ పడుతూంటే కొన్నాళ్లు ఆమె అమ్మగారూ, తర్వాత కాలేజీ సెలవులప్పుడు మల్లిక వచ్చి తోడుగా ఉండటంతో కార్తీక్ కుటుంబానికి కూడా వాళ్లు చాలా బాగా దగ్గరయ్యారు.

తెల్లారి లేస్తే రోజూ లోకంలో ఎన్నో నేరాలు మరెన్నో ఘోరాలు వింటున్నాం. చూస్తున్నాం. అయినా మనకు కావలసిన వాళ్లకు మన కళ్ల ఎదుట ఏదైనా ఘోరం ద్రోహం జరిగితే తట్టుకోవడం ఎంత కష్టం.

ఓవిధంగా మాలతి పనే బెస్ట్, మల్లిక పోయిన షాక్‌లోంచి తేరుకోక ఓ విధంగా ప్రస్తుత పరిస్థితినీ, జ్ఞాపకాలనూ మరిచిపోయి పాత జ్ఞాపకాలతో గడిపేస్తోంది. ప్రస్తుతం ఉన్న స్థితి ఆమెను ఏవిధంగానూ

బాధించడంలేదు, కాకపోతే కట్టుకున్న వాడినీ
కన్న పసిదాన్ని కూడా గుర్తించకపోవడం,
దూరంగా ఉంచెయ్యడం అందరిమనసులనూ
బాధిస్తోంది. ఆమెకు పెళ్లి అయిందనీ, ఇప్పుడు
తనొకరికి ఇల్లాలిననీ గుర్తు లేకపోవడం అత్యంత
దురదృష్టకరంగా మారింది.

తల్లి ఉండీ పసిదానికి ఆ ప్రేమానురాగాలు కరువ
య్యాయి. ఆఫీసుకు సెలవు పెట్టి రఘు అన్నీ తనే అయి
ఆ పసిదాన్నీ మాలతినీ చూస్తున్నా తల్లిప్రేమ, తల్లిపాలు
లేక ఆ పసిదాన్ని పోతపాలతో పెంచుతుంటే అందరికీ
గుండెలు కోస్తున్నంత బాధ, వేదనా. కాలమే కొన్ని సమస్య
లకు పరిష్కారం చూపాలి.

నెల్లాళ్లు అతికష్టం మీద గడిచాయి. అటు
మాలతినీ, ఇటు పసిపాపనీ చూసుకో-
వడంలో జరిగిన దానికి కృంగిపోయి
వృద్ధాప్యంలో తట్టుకోలేకపోతున్న
తండ్రిని చూసుకోవడంలో రఘు
నలిగిపోతున్నాడు. సెలవు కూడా
అయిపోవచ్చింది.



వీలయినప్పుడల్లా కార్తీక్, రేవతి వచ్చి చూసి చేతనయిన సాయం చేసి పోతున్నారు. శంకరం దంపతులయితే చాలా సహాయపడుతున్నారు. ఎవరయినా ఎంతవరకూ చెయ్యగలరు.

"రఘూ! అసలు మల్లిక ఎందుకు ఆత్మహత్య చేసుకుంది. అంత పిరికితనం ఆత్మవంచనా ఆమెలో ఎలా కలిగాయి" ఆవేదనగా అన్నాడు కార్తీక్.

"మా ప్రారబ్ధం కాలి. చచ్చి ఆ పిల్ల బతికిపోయింది బతికున్న మమ్మల్ని చంపుతూ" విసురుగా అని లేచిపోయాడు అక్కడే కూర్చుని పేపరు చదువుతున్న రఘు నాన్నగారు.

"నాన్నా తప్పు, ఎందుకలా మాట్లాడతారు. జరిగినదానిలో మల్లిక బాధ్యత ఎంతవరకూ? పాపం ఆమె నూరేళ్ల బతుకు బుగ్గిపాలయిందని బాధపడాలికానీ మన ఖర్మానికి ఆమెను నిందించకూడదు" పాపను సముదాయిస్తున్న రఘు బాధగా అన్నాడు.

"అనునులేరా, ఎవరినీ ఏమీ అనను" లోపలికి వెళ్లిపోయారు ఆయన.

"పాపం ఈ వయసులో ఆయన కొచ్చిన కష్టం, వేదనా సామాన్యమైనవా. నిస్సారంగా బతుకుతున్న కొడుకునీ కోడల్నీ చూస్తూ ఆయనలా బాధపడటంలో అర్థం ఉంది రఘూ. ఆయననేం తప్పుపట్టకు. అయినా మనకే ఇలా వుంటే పాపం మల్లిక తల్లితండ్రులెలా ఉన్నారో. అదే భరింపరాని వేదన అనుకుంటే ఇప్పుడు మాలతి పరిస్థితికి ఇంకెంత కుమిలిపోతున్నారో"

"అవును, అందుకే నేను వాళ్లని రమ్మనలేదు. అసలే దుఃఖంలో వున్న వాళ్లకు మాలతి అయోమయ పరిస్థితి మరింత బాధాకరం" ఆవేదనగా అన్నాడు రఘు.

"అవును... వాళ్ళ బాధ ఎటూ ఎవరూ తీర్చలేనిది. కనీసం ఇంకాస్త బాధపెట్టకుండా ఉంటే అదే పదివేలు, ఇంతకూ మల్లిక ఆత్మహత్య ఎందుకు చేసుకుందంటావ్. ఆ వివరాలేమయినా తెలిశాయా" అడిగాడు కార్తీక్.

"ఏముంది... మామూలు కథే. నీకు తెలుసుగా! మాలతీ, మల్లిక వీళ్లిద్దరే వాళ్ల తల్లితండ్రులకు సంతానం. ఆడపిల్లలని కట్టడిలో పెట్టక వీళ్ళ నాన్నగారు వీళ్ళని ఎంతో ఫ్రీగా లిబరల్‌గా పెంచారు. వీళ్ళూ దాన్ని నిలబెట్టుకున్నారు. మల్లిక మాలతికంటే కూడా చాలా అందంగా సోషల్‌గా ఉంటుంది. అదే కొంప ముంచింది.

"మల్లిక డిగ్రీ ఫైనలియర్ చదువుతోంది. మామూలుగా సంసారపక్షంగా ఉండి, తామేదో తమ పనేదో అన్నట్లు ఉండే ఆడపిల్లలనే బతకనీయరు. అలాంటిది కాలేజీ బ్యూటీ, చాలా డేరింగ్ అండ్ డాషింగ్ గర్ల్ అయిన మల్లికని ఊరికే వదుల్తారా? ".

అంతటి మగవాడూ కదలి ఏడ్చాడు రఘు.

అతను కాస్త ఊరడిల్లాకా అడిగాడు కార్తీక్, "మరి ఇంట్లోవాళ్ళు కానీ, వాళ్ళవాళ్ళు కానీ అభ్యంతరం పెట్టలేదా"

"ఏముంది పాత కథే. నిన్ను ప్రేమించా, నువ్వు లేకపోతే నేనులేను. నువ్వు నన్నూ నా ప్రేమనూ అంగీకరించకపోతే ఇదిగో ఛస్తున్నా అంటూ వెంటబడి వేధించి, ఆమెనూ, ఆమె ప్రేమనూ సాధించాడు ఆ రాస్కెల్ భార్గవగాడు. వాడు మల్లిక్ క్లాస్ మేట్. వాడుత్త రోగ్ అనీ, రోజూ బట్టలు మార్చినంత సులువుగా అమ్మాయిలని మారుస్తాడనీ మల్లిక ఫ్రెండ్స్ ఎంత చెబుతున్నా వినక వాడి గాలంలో పడిపోయింది. ఇంకేముందీ, నమ్మినచోటేగా మోసానికీ, ద్రోహానికీ చోటుండేది. వాడు సరదా తీరేదాకా మల్లికతో తిరిగి మోసంచేసి పోయుంటాడు. మల్లిక అసలే సెన్సిటివ్. ఆ అవమానాన్ని భరించలేక ఆత్మహత్యే గతనుకుని వుంటుంది. ఆ అమ్మాయి ఖర్మానికి ఆమె పోయిందికానీ వాడికేం

మహా జల్సాగా తిరుగుతుంటాడు రాస్కెల్" కోపంగా చెప్పాడు రఘు.

"ఛ, ఏదయినా... ఆ అమ్మాయి అలా పిరికిగా ఆత్మహత్య చేసుకునుండకూడదు రఘూ... ఇంట్లోవాళ్ళకి చెప్పి, వాళ్ళ సలహా, సహాయం తీసుకునుండాల్సింది. లేకపోతే ఆ రోగ్‌ను మరచిపోయి హాయిగా బతకాల్సింది. ఛ...ఏం పిల్లలో, ప్రేమ మైకంలో పడి అన్నేళ్లు కని, పెంచిన తల్లిదండ్రులను వాళ్ళ ఖర్మానికి వాళ్లను వదిలి తమ దారి తాము ఎలా చూసుకుంటారో" కార్తీక్‌కు అంతలోనే తమ నిర్వాకం గుర్తు వచ్చింది. 'శంకరం బాబాయ్ కనుక రేవతిని ఆదుకుని, తనకు బుద్ధిచెప్పి తమ కాపురం నిలబెట్టి ఉండకపోతే తన రేవతి కూడా అలా మల్లికలా, ఇక ఆపై ఆలోచించలేకపోయాడు కార్తీక్.

సుమారు నెలరోజుల తర్వాత... ఓ...రోజు... 'కార్తీక్‌గారికి పార్శిల్' అంటూ పోస్టుమేన్ ఒక పార్శిల్ ఇచ్చాడు. దాని మీద 'స్ట్రిక్ట్‌లీ కాన్ఫిడెన్షియల్' అని వుండటంతో అది ఓపెన్ చేసే ధైర్యం చెయ్యలేకపోయింది రేవతి.

అయినా అదేమిటో, ఎక్కడనుంచి వచ్చిందో అన్న ఏంగ్జయిటీతో కార్తీక్ సెల్‌కు ఫోనుచేసి ఆ విషయం చెప్పేసింది రేవతి.

వెంటనే ఇంటికి వచ్చేశాడు కార్తీక్. ఆ పార్శిల్ విప్పి, అందులోవున్న డైరీ తీసి చదువుతున్న కార్తీక్ ముఖంలో మారుతున్న రంగులూ... ఆగ్రహం రేవతికి అంతా కంగారుగా... అయోమయంగా అనిపించింది.

"రేవతీ... నే అర్జంటుగా ఊరెళుతున్నా... నాల్గురోజులు రాను. అర్జంటుకేసులుంటే రాహుల్‌ని ఎటెండ్ అవమన్నానని చెప్పు. జాగ్రత్త... పాప జాగ్రత్త" అంటూ హడావుడిగా నాల్గు జతలు బ్రీఫ్‌కేసులో పడేసుకుని... మరో ప్రశ్నకు తావివ్వకుండా వెళ్ళిపోయాడు కార్తీక్.

ఆ పార్శిల్ ఎక్కడినుంచో, ఎవరు పంపారో, అందులో వున్న డైరీ చూస్తూనే అంత కోపంగా కార్తీక్ ఎక్కడకు వెళ్లాడో తెలియక కంగారు పడసాగింది రేవతి.

శంకరంగారికీ, రఘుకీ ఫోనుచేసింది రేవతి. విషయం వింటూనే వాళ్ళిద్దరూ వెంటనే వచ్చారు.

"కంగారుపడకమ్మా... కార్తీకేం చిన్నపిల్లాడుకాదు, తెలివితక్కువవాడూ కాదు. ఏదో కేసు విషయంలో అర్జంటుగా వెళ్ళాల్సి ఉంటుంది. నువ్వు పిల్లతో ఒక్కదానివీ ఏం ఉంటావుగానీ రా... మా ఇంటికి వెడదాం... మీ అంటీ కూడా నిన్నూ, పాపనూ చూడాలనుకుంటోంది" అంటూ బలవంతంగా బయలుదేరదీశాడు శంకరం.

దగ్గర వుండి విషయం తెల్సుకోవాలనీ, చేతనైన సాయం చెయ్యాలనీ వున్నా ఇంట్లో మతిస్థిమితంలేని మాలతీ... చంటిపిల్ల కారణంగా శంకరంగారితో వెళ్ళడమే మంచిదని రేవతికి నచ్చచెప్పి తను వెళ్ళిపోయాడు రఘు.

నాలుగురోజులు ఏ ఫోనూ, కబురూ లేక అలమటించిపోతున్న రేవతికి,

"రేవతీ... అమ్మా రేవతీ, చూడు... ఈ వార్త" అంటూ పేపరు తెచ్చి చూపించారు శంకరంగారు.

"ప్రేమ మత్తులో ముంచి మల్లికను కాటు వేసిన కాలనాగు" అంటూ భార్గవ్ ఫొటోతో సహా వేసి, విషయం వెలికితెచ్చిన లాయర్ కార్తీక్ అంటూ బాగా కవరేజ్ ఇచ్చి ప్రెస్ వాళ్లు రాసినది చదువుతుంటే రేవతికి కళ్ళు తిరిగి, ఒళ్ళు గగుర్పొడిచింది.

మల్లికను ప్రేమించినట్లు నటించి, నమ్మించి ఆమెను కళ్యాణ మండపానికి తీసుకెడతానని చేయిపట్టి 'వల్లకాటికి' నడిపించిన పర్వర్టెడ్, శాడిస్టు భార్గవ్. కావలసినంత డబ్బు, హోదా... పలుకుబడిగల ఇంట్లో పుట్టి విచ్చలవిడితనానికి అలవాటు

పడి, లేని వ్యసనం అంటూ లేని భార్గవ్... కేవలం తన ఫ్రెండ్‌తో ఛాలెంజ్‌చేసి, మల్లి కలాంటి తెలివైన అందమైన అమ్మాయిని ట్రాప్ చెయ్యడమే గొప్పగా భావించి, మల్లి కను వెంటబడి వేధించి, ఆమె ప్రేమను పొందడంలో సఫలత సాధించి... చివరకు ఫ్రెండ్స్‌తో కల్సి ఆమెను ఆనందించి, హింసించి, ఆ విషయం బయటపడితే తన బతుకు ఏమైపోతుందో అనే వెరపుతో తెలి విగా ఆమెను చంపేసి... ఆత్మహత్యగా చూపించాడు.

"ఇది కథో... నా కథనమోకాదు. యదా ర్థంగా జరిగినదే అది... అందుకే దానికి ప్రత్యక్ష సాక్ష్యాన్ని నేను మీడియాకిస్తున్నా... ఇందులో ప్రతి అక్షరం... అక్షరం వెనుక నున్న వ్యథ మల్లిక స్వహస్తాలతో రాసినదీ, అనుభవించినదీ, ముందుగా మీడియాకెందు కిస్తున్నానంటే... ఏసాక్ష్యాలనయినా తలకిం దులుచేసి తారుమారుచేసే శక్తి డబ్బుకుంది. ఆ డబ్బు భార్గవ్‌కు చాలా వుంది. అయితే మీడియా అంతకంటే పవర్‌ఫుల్. ఒకసారి జనం మధ్యకు వెళ్ళిన నిజాలు, సాక్ష్యాలు అంత త్వరగా సమాధి అవవు. అందుకే నిజం తెలిసిన నేను... ఆ నిజాల్ని మీ ముందు ఉంచుతున్నాను. ఆమె చేతి రాతతో వున్న దానినే యథావిధిగా ప్రచురిం చమని నేను చేసిన విన్నపాన్ని మన్నించిన ఈ పేపర్‌వారికి నా కృతజ్ఞతలు...

అనుకోకుండా భార్గవ్ అసలు స్వరూపం తెలుసుకున్న మల్లిక... తను ప్రేమించిన వాడు ఎంతనీచుడో... అలాంటివాడిని ప్రేమించి తను ఎంత తప్పుచేసిందో... ఆమె స్వహస్తాలతో రాసిన దస్తూరీలోనే చదవండి"

తేది: 27-9-2002

"ఏమిటో ఈ పెద్దవాళ్లకు ప్రేమ అంటే అంత చిన్న చూపు దేనికో... అన్ని విష యాల్లోనూ నా అభిమతానికి విలువనిచ్చే నాన్న... ఎందుకో భార్గవ విషయంలోనే చాలా పట్టుదలగా వున్నారు. భార్గవ్... నా భార్గవ్ మంచివాడుకాదట, ఎవరన్నారలా? భార్గవ్‌కున్న స్టేటస్, అతని సిరిసంప దలూ... అవన్నీ నాన్నకేం తెలుసు? కిట్టని వాళ్ళు ఏదో చెబితే నమ్మెయ్యాలా?

నాన్న ఎంతకూ ఒప్పుకునేలా లేరు, భార్గవ్ ఇంట్లో ఆ ప్రాబ్లమ్‌లేదు

వాళ్ళు భార్గవ్ ఇష్టాన్ని కాదనరు.

నాన్న కాదన్నా... నేను భార్గవ్‌నే పెళ్ళా డతాను. అసలు మా పెళ్లి ఎంత త్వరగా అయితే అంత మంచిది. రేపే ఈ విషయం భార్గవ్‌తో మాట్లాడాలి.

తేది: 28-9-2002

అయ్యో... ఈవేళ భార్గవ్‌తో ముఖ్యమైన విషయం మాట్లాడాలనుకుంటే ఈ అవాం తరం ఏమిటో దేముడా... నానీకి రాత్రికి రాత్రి సడన్‌గా హార్ట్‌ఎటాక్ వచ్చింది. రాత్రే హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేశాం. ఇంకా ఈరోజు గడిస్తే కానీ ఏవిషయం చెప్పలేం అన్నారు డాక్టర్స్. నానీకి ఏం కాకూడదు. తను ఎంత మంచిది... తను కోలుకోవాలి, తప్పక నా పెళ్ళి చూడాలి, ఈ భార్గవ్ ఫోనుకేమయిందో... ఎంత ట్రై చేసినా దొర కడంలేదు. ఓ పనిచేస్తా... ఎటూ హాస్పిట ల్‌కు వెళ్ళే దారిలోనేకదా అతని రూం. నానీకి బాగాలేదు, మళ్ళీ రెండురోజులదాకా కలవడం కుదరదు అనిచెప్పి హాస్పిటల్‌కు వెడితేసరి... లేదంటే విషయం తెలియక అలుగుతాడు భార్గవ్.

ప్రేమంటే ఇదేనా... నేను తనని చూడ కుండా ఒక్కరోజు ఉండలేకపోతున్నా... కలిసి మాట్లాడి వచ్చిన మరుక్షణం నుంచీ, మళ్ళీ ఎప్పుడు తెల్లవారుతుందా... మళ్ళీ ఎప్పుడు భార్గవ్ ముందర వాలిపోదామా అని, భార్గవ్‌కూ అలాగే ఉంటుందా...

అయ్యో అవతల నానీ హాస్పిటల్‌లో ఉంది... అక్కడకు వెళ్లాల్సిన అవసరం వుంటే ఇక్కడ కూర్చుని ఈ పిచ్చి రాతలేమిటి?

తేది: 29-9-2002

భగవంతుడా... ఇదెక్కడి ఘోరం, చెవులారా విన్నదే నమ్మలేకపోతున్నానే అసలు ఇంత ఘోరమైన నిజం తెలిశాక ఇంకా నేనెలా బతికి వున్నాను, ఎందుకు బతికి వున్నాను. ఛ... ఛ... ఇలా ఆలోచిస్తున్నానేమిటీ భగవంతుడు దయామయుడు కనకే మేకవన్నెపులిలాంటి భార్గవ్ నిజస్వరూపం నాకు తెలిసేలా చేశాడు. పాపం నాన్న ఎంతగా చెబుతున్నారు అతను మంచివాడుకాదు, నమ్మకు... అతనితో పెళ్ళివద్దూ అని. నయమే నానీ అనారోగ్యం నన్ను భార్గవ్‌బారినుంచి రక్షించడానికే వచ్చి ఉంటుంది. నిన్న నానీ దగ్గరకు హాస్పిటల్‌కు వెడుతూ దారిలోనే కదా భార్గవ్‌కు చెప్పి వెడదాం అని వెళ్లిన నాకు, వాడూ, వాడి ఫ్రెండ్స్ వాగిన, వాగుతున్న మాటలు ఇంకా చెవుల్లో మారుమోగుతున్నాయి.

"అరె భార్గవా... ఇంతకూ ఎప్పుడురా నీకూ, మల్లికకూ పెళ్ళి" అడిగాడు ఫ్రెండ్.

"నాకా... పెళ్ళా... మల్లికతోనా" ఫెళ్ళున నవ్వాడు భార్గవ్

గుమ్మం దాకా చేరిన తనకి ఆ మాటలు చెవిన బడటంతోటే కళ్ళు గిరగిర తిరిగాయి.

"మరి పాపం... తనకు 'ఇంట్లోవాళ్ళు వేరే సంబంధాలు చూస్తున్నారనీ, నీ గురించి ఇంట్లోవాళ్ళకి ఎవరో చెడుగా చెప్పారనీ, చచ్చినా నీతో పెళ్ళికి మాత్రం ఒప్పుకోరనీ, కనుక తప్పనిసరిగా సాధ్యమయినంత త్వరగా మనపెళ్ళి జరిగిపోవాలి... నువ్వు లేకుండా నేను బతకలేను. నీతోకానీ జీవితం నేను ఊహనైనా భరించలేను' అంటూ ఎంతో ప్రేమతో రాసింది కదరా నీ సిరి మల్లి" వేళాకోళంగా అడుగుతున్నాడింకొకడు.

"ఒరే తప్పురా... అది వాడి లవర్ వాడికి రాసిన లవ్ లెటర్. అలా అంతా చదవకూడదమ్మా... ఇచ్చెయ్... ఇచ్చెయ్" వింటున్న నాకు నెత్తిన పిడుగు పడ్డట్టయింది.

"అంటే నేను ఎంతో ప్రేమతో రాసిన ఆ లెటర్స్ అన్నీ అందరిచేతిలో పడి అందరూ చదువుతున్నారా! అంటే... అంటే భార్గవ్ నన్ను ప్రేమించడంలేదా? మరెందుకు వెంటపడి, వేధించి, అల్లరిపెట్టి ప్రేమలోకి దించినట్లు... యస్... ఇప్పుడు అర్థం అయింది. వాడొట్టి రోగ్. ప్రేమపేరుతో నన్ను వంచించాలని చూశాడు.

ఎంత ఘోరమైన నిజం... వాళ్ళ మాటలు వింటూంటే రక్తం మరిగిపోయింది. వెంటనే భార్గవ్‌ని నిలదీయాలనీ... కసిదీరా కొట్టాలనీ వుంది. ఎంతమాట అన్నాడు వెధవ.

"ఒరే... వేసిన జోకులు చాలుగానీ, ఒరేయ్ భార్గవ్ ఇది చెప్పు ఇంతకూ నీ మల్లిక నిన్ను కనీసం దగ్గరకైనా రానిచ్చిందా లేదా"

"లేదురా... అదేకదా నా బాధంతా... ఒట్టి పాతచింతకాయ పచ్చడిరా బాబూ... పెళ్ళికిముందు ఎలాంటి వేషాలూ కుదరవని తెగేసి చెప్పింది. అందుకే త్వరలో ఓ పసుపుతాడు దాని మెడలో కట్టేద్దామనుకుంటున్నా... ఎలాగూ అది కాదనే వీలులేకుండా యింట్లోవాళ్లు వేరే సంబంధాలు చూస్తున్నారు. మన పెళ్లి త్వరగా అయిపోవాలని అదే గోలెడుతోంది కదా... అయినా ఎలావుందిరా మన ఏక్టింగ్. యింట్లోవాళ్ళు నా గురించి చెడుగా చెప్పినా కనీసం అనుమానం అయినా రాలేదంటే... పూర్ ఫెలో..." జాలిపడ్డాడు క్షణంసేపు... వాడి జాలి ఎలాంటిదంటే తనకు ఆహారం కాబోయే మేకపిల్లమీద పులి జాలిపడటం లాంటిది.

భరించలేక బయటకు వచ్చేయబోతున్న నాకు ఆ తరువాత భార్గవ్ అన్నమాటలకు ప్రాణం చచ్చిపోయింది. యిలాంటి వెధవనా నే ప్రాణానికి ప్రాణంగా ప్రేమించింది, జీవితం పంచుకోవాలని ఆరాటపడినదీ... వాళ్ళమాటలు యింకా నా చెవుల్లో గింగురుమంటున్నాయి.

"ఒరే... అదేదో త్వరగా కట్టరాబాబూ... నువ్వెప్పుడు పార్టీయిస్తావా... సెలబ్రేట్ చేసుకుందామా అని ఆత్రంతో చచ్చేలావుంది మా పరిస్థితి. యింతకూ నువ్వు మమ్మల్ని గాలికొదిలేసి పవిత్రమైన పసుపుతాడు... తాళి... ఆలి అంటూ సెటిలయిపోవు కదా..." ఎవడో ఓ వెధవ అడిగినదానికి భార్గవ్ సమాధానం విన్న నాకు భార్గవ్‌ని, ఆ వెధవలను అక్కడిక్కడే నరికి పారేయా లన్నంత కోపం వచ్చింది. కానీ ఆ పరిస్థి తిలో వాళ్ళ కంటబడడం అమ్మో... అసలు అలాంటి మాటలు సభ్యసమాజంలో ఉన్న ఎవరైనా అనగలడా?

"ఛ...ఛ... అంత మిత్రద్రోహం చెయ్య నురా... ఇదిగో నీ ప్రాణం పెట్టే బీర్ బాటిల్ సాక్షిగా మల్లిక మనందరిదీ" గొల్లున నవ్వులు.

ఆ మాటలూ... ఆ నవ్వులూ నా చెవుల్లో మారుమోగుతున్నాయి. ఏదో చెయ్యాలి. ఆ వెధవలకు జీవితంలో ఇంకో అమ్మాయికేసి చూడకుండా కలలో అయినా అపకారం తల పెట్టకుండా ఏదో చెయ్యాలి. ఏం చెయ్యాలి.

చదువు, సంస్కారం, సభ్యత అన్నీ మరచి పశువులా మారిన ఆ నీచుడికి ఎలా బుద్ధిచెప్పాలి? ఇంత అవమానించబడ్డాకా పోనీ చచ్చిపోతేనో... నో... చచ్చినా చావను. నేనెందుకు చావాలి. అమాయ కంగా ప్రేమించిన నేరానికి నేను ఆత్మహత్య చేసుకుని నావాళ్ళనెందుకు ఏడిపించాలి. తప్పు చేసింది వాడే. వాడే శిక్షింపబడాలి. కానీ ఎలా? అదే ఆలోచించాలి. ఆలోచించి ఏదో ఒకటి చెయ్యాలి. దీనికి పరిష్కారం నా ఆత్మహత్య మాత్రం కాదు"

"ఇది ఆమె డైరీలోనే కాదు, జీవితంలోనే ఆఖరి పేజీ... ఇంకొక పేజీ రాసే అవ కాశం ఆమెకు లేకుండా ఆమెను దారు ణంగా హత్యచేశాడు ఆ రాస్కెల్ భార్గవ్.

"ఇదంతా చదివాకా మీ మనసు వికలమై, గుండెలు బాధతో బరువెక్కి కన్నీళ్ళు వచ్చా యికదూ. చదివిన, విషయం తెలిసిన మనకే ఇంత బాధగా ఉంటే, పాపం మల్లిక మనసు ఎంత నలిగిపోయిందో, ద్వేషంతో రగిలిపోయిందోకదా... కానీ ఆమె మనసు నేకాదు ఆమె దేహాన్ని వాళ్ళ దాహానికి బలి చేసి, పరమ కిరాతకంగా హింసించి హింసించి చంపేశారు ఆ కిరాతకులు. ఇదంతా కల్పితమో... నా ఊహాగానమో కాదు. చాలా ఖచ్చితమైన ఫోరెన్సిక్ ద్వారా... సాక్ష్యాలతోసహా లభించిన నిజాలే... నిందలూకాదు, అభూతకల్పనలు అంతకంటేకాదు"

భార్గవ్ ఏమిటీ అనడానికి మల్లిక డైరీ సాక్ష్యం. అందులో ఆమె పడ్డ వేదన ప్రతి అక్షరంలోనూ కనిపిస్తోంది. అయితే ఆమె ఎప్పుడు, ఎలా హత్య చేయబడింది అనడా నికి విలువైన సాక్ష్యాలు ఉన్నాయి, అవన్నీ ఎలానూ కోర్టులో ప్రవేశపెట్టబడి హంత కులు శిక్షింపబడడం ఖాయం, అయితే అది భయంకరమైన హత్య. ఆ హత్య ఎంత పక డ్బందీగా చేసి ఆత్మహత్యలా మలచారు.

భార్గవ్ నిజస్వరూపం తెలిసిపోయిన మల్లిక... ఆ క్షణంలోనే వాళ్ళని చంపేయా లన్నంత ఆవేశం వచ్చినా ఆ సమయంలో తను వాళ్ళ కంటపడడం ఎంత ప్రమా దమో గుర్తించి తనను తాను సంబాళించు కుని జాగ్రత్తగా చప్పుడు చెయ్యకుండా బైటకు వచ్చేసింది. కానీ అక్కడే పొరపాటు జరిగిపోయింది.

తను వాళ్ళకు తెలియకుండా బైటపడ్డాన నుకుందే కానీ, ఆ హడావుడిలో కింద పడి పోయిన తన కర్చీఫ్... తరువాత వాళ్ళు చూసి తనకు నిజం తెలిసిపోయిన సంగతి గ్రహించి, తన అంతానికి ముహూర్తం అంత త్వరగా పెట్టేస్తారని తెలియక బల యిపోయింది. ఆకుపచ్చని ఆకులమధ్య తెల్లటి సిల్క్ త్రెడ్‌తో అందంగా కుట్టిన మల్లెపూవున్న ఆ కర్చీఫ్ ఆమె అక్కడకు

వచ్చి వెళ్ళిందనీ, తమ సంభాషణ అంతా విందనీ వాళ్ళకు అర్థమైపోయింది.

'ఆలస్యం అమృతం విషం' ఒక దుష్కార్యానికి రంగం సిద్ధమైపోయింది.

మర్నాడు సాయంత్రం తన ఇంటి దగ్గర ఉన్న మెడికల్ షాప్‌నుంచి వస్తున్న మల్లిక దగ్గరగా ఆపాడు భార్గవ్ తన ఇంపోర్టెడ్ కారుని.

"హాయ్ డియర్... ఈరోజు కాలేజ్‌కి రాలేదేం? రా... నీతో కాస్త మాట్లాడాలి" ఏం తెలియనట్లే ఎంతో కాజువల్‌గా పిలిచాడు.

మల్లిక కూడా రోడ్‌మీద సీన్ క్రియేట్ చెయ్యడం ఎందుకనీ, అటువంటి మృగం నుంచి తాను జాగ్రత్తగానే తప్పించుకోవాలనీ, తనకేమీ తెలియనట్లే వుండాలని ఆలోచించి మామూలుగా కారెక్కింది. తన కర్చీఫ్ వాళ్ళకి చిక్కిందనీ తాను బలిపశువు కాబోతున్నాననీ ఆమెకి తెలియదు.

దారిలో వాడి ఫ్రెండ్స్‌ను కూడా కలుపుకుని ఆమెను సామూహికంగా అనుభవించారు. అంతే మల్లిక ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి.

డాక్టర్స్... పోలీసులు అంతా భార్గవ్ చేతిలో కీలుబొమ్మలే.

'ధనమూలమిదం జగత్' కదామరి. జరిగినది ఇది. ఇక జరగబోయేది మీరే చూడండి"... మిగతా వార్త, జరిగిన విషయాలు మర్నాడు పేపర్లో వస్తుందని వుంది.

చదువుతున్న రేవతి దుఃఖం కట్టలు తెంచుకుంది. ఏమైపోతున్నాం మనం. నాగరికత ముసుగులో శతాబ్దాల వెనక్కి 'ఆటవిక' న్యాయంలోకి వెళ్ళిపోతున్నామా. అక్కడ కూడా తమ అవసరార్థమో... ప్రాణరక్షణకో తప్ప ఇలా నిండు ప్రాణాలు తియ్యడం, ఘోరాలు చెయ్యడం లేదే. పాపం... ఎంత మరణయాతన పడి ఉంటుందో మల్లిక.

"అమ్మా కార్తీక్ వస్తున్నాడట ఫోను చేశాడు. సరాసరి ఇక్కడికే వచ్చేయమన్నాను. ఈ పూటకి ఇక్కడ ఉండి సాయంత్రం వెళ్ళిపోదురుగాని, లే... లేచి కాస్త ముఖం కడుక్కుని రిలాక్స్ అవు. ఏం చేస్తాం. ఎవరెంత ఏడ్చినా, బాధపడినా పోయిన మల్లిక తిరిగి రాదు. లే... కార్తీక్ అలసిపోయి వస్తాడు కాస్త సేదదీర్చు.. అంతే కానీ నువ్వే ఏడుస్తూ కూర్చుంటే ఎలా. అదిగో మాటల్లోనే వచ్చాడు కార్తీక్"

కార్తీక్ బాగా అలసిపోయి కనిపిస్తున్నాడు నాలుగు రోజులకే నలభై లంఖణాలు చేసినవాడిలా ఉన్నాడు.

"రా... కార్తీక్! మొత్తానికి ఘటికుడివయ్యా. నాలుగు రోజులనుంచీ రాష్ట్రాన్ని అతలాకుతలం చేసేశావు. ఎన్నో నిజాలు బయటకు తీసి ఎప్పుడూ పేపరుముఖం కూడా చూడనివాళ్ళని పేపరు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూసేలా చేశావ్... హంతకుల గుండెల్లో దడ పుట్టించావు.'

"వాళ్ళ గుండెల్లో మాటేమోగానీ, నాకలాగే వుంది. ఎక్కడ సాక్ష్యాలు తారుమారుచేసి కేసు తల్లకిందులు చేస్తారో అని. అందుకే స్పెషల్ రిప్రజంటేషన్ పెట్టి కేసు సాధ్యమయినంత త్వరగా హియరింగ్‌కు వచ్చేలా చూడమన్నాను. ఫస్టు హియరింగ్ ఈ నెలలోనే. సరిగ్గా వారముంది. మీరు రేవతినీ, పాపనీ మీ ఇంటికి తెచ్చి మంచిపనిచేశారు. నేను టెన్షన్ లేకుండా ఉండగలిగాను"

"సరే... సరే... నాకు అసలు తిండి, నిద్రా వేటిమీదా దృష్టిలేదు. అన్యాయంగా బలయిపోయిన మల్లిక, మల్లికేకాదు మల్లిక లాంటి ఆడపిల్లలెందరో... కొన్ని బయటకు తెలిసీ, కొన్ని తెలియకా. ఈ కేసు నెగ్గాలి... ఆ రాక్షసులకు శిక్షపడాలి. అది ఇలాంటి రాక్షసకృత్యాలు చేసే నరరూప రాక్షసులకు హెచ్చరిక కావాలి, న్యాయం ధర్మం అనేవి ఉన్నాయన్న జడుపు రావాలి" ఆవేశంగా అన్నాడు కార్తీక్.

"తప్పకుండా అలాగే జరుగుతుంది" తృప్తిగా అన్నాడు శంకరం.

నాలుగురోజులు వుండి పెండింగ్‌లో వున్న కేసులు తన తోటిలాయర్, స్నేహితుడూ అయిన రాఘవకు అప్పగించి మళ్ళీ వెళ్ళిపోయాడు కార్తీక్.

అత్యంత నాటకీయంగా, రసవత్తరంగా సాగిన ఈ 'మెలోడ్రామా'లో మల్లికకు డైరీ రాసే అలవాటు ఉండటం, అది భార్గవ్‌కు తెలియకపోవడం ఒక ఎత్తయితే ఆ డైరీ మల్లిక ఫ్రెండ్ చేతిలోపడి, దాన్ని ఆమె తెలివిగా కార్తీక్‌కు పోస్ట్ చెయ్యడం ఆ డ్రామాకు హైలైట్.

లోకం పోకడా, అవినీతి, అన్యాయాల బలం బాగా తెలిసిన కార్తీక్ ఆ డైరీని యథాతథంగా జిరాక్స్ తీయించి అత్యంత పవర్‌ఫుల్ మీడియా అయిన ప్రెస్ ద్వారా ప్రజల మధ్యకు వదలడంతో భార్గవ్ ఆటకట్టింది.

ఒకసారి జనాలమధ్యకు వెళ్ళిన నిజాల్ని తారుమారు చెయ్యడానికి ఏ ధనబలం, ఏ రాజకీయం పనిచెయ్యవు. ఫలితంగా భార్గవ్ నేరం అంగీకరించక తప్పలేదు. దానికితోడు వాడి తోడుదొంగ ఒకడు అప్రూవర్‌గా మారాడు కూడానూ.

"ప్రేమ అన్న అతి పవిత్రమైన పదానికే మాయని మచ్చ తెచ్చిన భార్గవ్... అలాంటివాళ్ళను ఏంచేస్తే పాపం... పాముకాటుకైనా విరుగుడుందేమోకానీ దుష్టుల ప్రేమ కాటుకు విరుగుడేది? "

"ఎంతో అమాయకంగా తనేదో, తన చదువేదో, తన లోకమేదో అన్నట్లు ఉండే మల్లికను ప్రేమ పేరుతో వంచించి... అంతంచేసిన ఆ నీచుడికి ఏ శిక్షవేసినా తక్కువే అవుతుంది"

"మరణశిక్ష, యావజ్జీవ కారాగారం ఇవన్నీ చాలా తక్కువే యువరానర్... నాకే కనుక అవకాశం ఇస్తే మిలార్డ్, ఇలాంటి మేకవన్నె పులులనీ, తడిగుడ్డతో గొంతులుకోసే కసాయివాళ్ళనూ అనుక్షణం వేధించి, చేసిన పాపం వెంటాడేవిధంగా 'సాంఘిక బహిష్కరణ' శిక్ష అమలు జరిగేలా చూస్తా యువరానర్. వీళ్ళు ఒంటరిగా జైలులో తమ శేష జీవితం గడిపే అవకాశం ఇవ్వకూడదు. అలా చేస్తే నాలుగు రోజులకే జరిగిన ఘోరం మరచిపోతుంది ఈ సంఘం. ఇలాంటి చీడపురుగులు పుడుతూనే వుంటారు. అందుకే... అందుకే యువరానర్ వీళ్లను సంఘవిద్రోహ శక్తులుగా గుర్తించి, ముద్రవేసి 'సాంఘిక బహిష్కరణ' శిక్ష విధించాలి"

"జనం మధ్య, జనంతోబాటే వీళ్ళూ ఉంటారుకానీ వీళ్లను జనం వాళ్ళలో కలుపుకోకూడదు. వీళ్ళను మంచికీ, చెడుకూ ఎవరూ పిలవకూడదు, వీళ్ళతో మాట్లాడకూడదు, అనుక్షణం వీళ్ళు చేసిన కిరాతకాన్ని ఎత్తిచూపుతూ వెలివేయాలి"

"చేసిన తప్పులకు మళ్ళీ మళ్ళీ ఏడుస్తూ ఎటువంటి ఆదరణ, ఆప్యాయతలకు నోచుకోక అలమటించిపోవాలి యువరానర్... అదే...అదే ఇలాంటి నీచులకు తగినశిక్ష" కోర్టులో కార్తీక్ కంఠం ఆవేదనతో ఆక్రోశంగా మారుమ్రోగింది. కోర్టు ఆవరణలో వున్న జనం గుండెల్లో ప్రతిధ్వనించాయి ఆ మాటలు. బోనులో దోషిగా నిలబడ్డ భార్గవ్ తల వాలిపోయింది. ఒక్క క్షణం. అంతలోనే నిర్లక్ష్యంగా తల ఎగరేశాడు పొగరుగా.

కార్తీక్ చెప్పింది మానవతాపరంగా సమంజసమే అయినా చట్టాన్ని చేతిలోకి తీసుకుని మార్చలేం కనుక... చట్టపరంగానే భార్గవ్‌ని శిక్షిస్తున్నాం అనీ, చీటింగ్‌తో ఓ స్త్రీని నాశనంచేసి హత్యచేసినందుకుగానూ పధ్నాలుగు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించారు న్యాయస్థానంవారు. అక్కడున్న లాయర్లు, జనం... అందరూ కార్తీక్ చేసిన కృషికీ, సాధించిన విజయానికీ హారతులు పట్టినా కార్తీక్‌లో కించిత్ ఆనందం

కలగలేదు.

ఏంసాధించాడని ఆనందించాలి? కళ్ళు తెరిచినా మూసినా నవ్వుతూ మొగ్గలా ముగ్ధలావున్న మల్లిక బలవంతంగా ఛిద్రమై... కిరాతకంగా చంపబడటమే మెదులుతుంటే కార్తీక్ అసహనంతో ఉన్మాదైపోయాడు. ఏంచేస్తే మట్టిపాలైపోయిన మల్లిక తిరిగి వస్తుంది? ఏంచేస్తే జరిగిన ఘాతుకానికి మనస్థిమితం కోల్పోయి పిచ్చిదయిన మాలతి మామూలు మనిషవుతుంది? ఏంచేస్తే ఆ తల్లిదండ్రుల గర్భశోకం చల్లారుతుంది?

అసలు మంచి, మానవత్వం మరచి, నైతిక విలువలనేవి గాలికొదిలేసి మృగంలా విశృంఖలతకూ, విచ్చలవిడితనానికీ బానిసలయి 'ప్రేమ' అనే పెథిడిన్‌తో ఎంతో మంది అమాయకులను పొట్టనబెట్టుకుంటున్న ఈ నవసమాజ సభ్యులని ఏంచేయాలి? ఎలా బుద్ధి చెప్పి దారికి తేవాలి... కార్తీక్‌లో అంతులేని విషాదం... మథనం ఆరంభం అయ్యాయి.

రోజురోజుకూ స్తబ్దుగా... మూడీగా మారుతున్న కార్తీక్‌ను చూస్తుంటే రేవతికి దుఃఖం ఆగడంలేదు.

కార్తీక్‌ను పలకరించాలన్నా భయపడుతోంది.

రఘూ, శంకరంగారూ అతికష్టంమీద అతనిని మళ్ళీ మనుషుల్లో పడేశారు. మతిస్థిమితంలేని మాలతిని తిరిగి మనిషిని చేసే బాధ్యత కార్తీక్‌పై వేశారు. దానివలన అయినా అతను త్వరగా ఆ విషాదంనుంచి డిప్రెషన్‌నుంచి బయటపడి కోలుకుంటాడని.

"కార్తీక్... ఎలాంటి మతిస్థిమితంలేని కేసులైనా ఛాలెంజింగ్‌గా తీసుకుని ట్రీట్‌చేస్తున్న ఓ పెద్ద డాక్టర్ మద్రాసునుంచి వచ్చాడట... ఓసారి మాలతిని ఆయనకు చూపిద్దామనుకుంటున్నా... ఎపాయింట్‌మెంట్ కూడా తీసుకున్నాను. కాస్త నువ్వొతోడు రాకూడదూ" ఫోను చేసి అడిగాడు రఘు.

వెంటనే బయలుదేరి వెళ్లాడు కార్తీక్. మాలతిని చూసిన ఆ డాక్టర్ విషయం తెలుసుకుని తప్పకుండా నయం అయ్యే కేసేననీ. కాస్త ఓర్మితో సాధించాలనీ చెప్పి కొన్ని మందులు రాసి పంపేశారు నెల తరువాత మళ్ళీ రమ్మంటూ... మాలతినీ, రఘునీ వాళ్ళ ఇంటి దగ్గర దింపి ఏవో ఆలోచనలతో పరాకుగా వస్తున్న కార్తీక్ సడన్‌గా తన కారుకింద పడబోతున్న యువకుడినిచూసి సడన్‌బ్రేక్ వేశాడు.

సమయానికి బ్రేక్ వేసినా... కారు గుద్ది కిందపడిపోయిన వాడిమీద పట్టరాని కోపంతో కిందకు దిగాడు కార్తీక్.

"ఏం చావాలని ఉందా... ఇంట్లో చెప్పే వచ్చావా... అంత కారు కూడా కనబడనంత నెత్తిమీదికెళ్ళాయా కళ్ళు" అంటూ విసురుగా ఆ అబ్బాయిని చేరాడు కార్తీక్.

రోడ్డుమీద కూలబడి ముఖంచేతుల్లో దాచుకుని కుమిలిపోతున్న ఆ అబ్బాయినీ... చుట్టూ చేరి వినోదం చూస్తున్న జనాల్ని చూసి నెమ్మదిగా కోపం దిగమింగి ఆ అబ్బాయి దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యేసి, ముఖంమీదనుంచి చేతులు లాగేశాడు బలవంతంగా... పచ్చటిముఖం, అప్పుడప్పుడే వస్తున్న నూనూగు మీసకట్టు, అమాయకంగా వున్న పెద్ద పెద్ద కళ్ళు... ముద్దుముద్దుగా వున్న ఆ అబ్బాయికి వయసు ఓ పదహారు... పదిహేడు మించదు.

"అంత చిన్న వయసులో చావాలన్నంత కష్టం ఏం వచ్చిందబ్బా నీకు" ఉలుకూపలుకూలేదు. అలానే ఏడుస్తున్నాడు ఆ అబ్బాయి.

ఆ అబ్బాయిని చూస్తే ఏదో తెలియని ఆత్మీయతాభావం కలిగింది కార్తీక్‌లో. అలా ఆ అబ్బాయిని ఆ స్థితిలో రోడ్డుమీద వదిలి వెళ్ళాలనిపించలేదు. కారణాలు ఏమైనాకానీ

చావాలన్న పంతం, తెగింపు స్పష్టంగా కని పిస్తున్నాయి అతని ముఖంలో. అలానే వదిలేస్తే చావడానికి ఇంకోమార్గం ఎంచు కునే తెగువా, తెంపరితనం కనిపిస్తున్నాయి అతనిలో.

"అరె... తమ్ముడూ...ఏమిటిది చిన్నపి ల్లాడిలా... ఏదో ఆలోచనలోపడి చూసుకో లేదు, నిన్ను గుద్దేశానన్న కంగారులో నీకు ఏమైనా అయిందేమో అన్న బాధతో అనవ సరంగా నోరు జారాను ఎక్స్ట్రీమ్‌లీ సారీ, ఏం అనుకోకు... రా కెరెక్కు నిన్ను మీ ఇంటి దగ్గర దిగబెడతా" బలవంతంగా లేవ దీశాడు.

"వద్దు... నే రాను. నేనే వెళ్ళగల్ను" అంటూ ప్రతిఘటిస్తున్నా వినకుండా చెయ్యి పట్టి కారులోకి తోశాడు.

"ఎవరి అబ్బాయివీ, మీ ఇల్లు ఎక్కడ? "

"... ... ..."

"మీ నాన్నగారి పేరేమిటీ? ఏం చేస్తుం టారు"

"... .... ..."

"ఏమిటీ... ఎన్ని అడిగినా ఉలకవ్ పల కవ్. పొరబాటుగా కారుకింద పడలేదా? నిజంగా ఆత్మహత్యా యత్నమా? ఏం చదు వుతున్నావ్? "

"... ... ..."

"పరీక్ష తన్నేసిందా? అందుకే ఈ ప్రయ త్నమా? "

ఎన్ని ప్రశ్నల వర్షం కురిపించినా ఊహూ... ఉలుకూ లేదు పలుకూ లేదు. 'ఏదిఏమైనా చాలా డిప్రెస్‌డ్‌గా, డిస్టర్బ్‌డ్‌గా ఉన్న ఆ కుర్రాడిని వంటరిగా వదలడం మాత్రం ప్రమాదం' అనుకుంటూ తనతో బాటు తన ఇంటికి తీసుకొచ్చాడు కార్తీక్.

రేవతి పాపని తీసుకుని వాళ్ళ వాళ్ళని చూసి రావడానికి వెళ్ళింది. తాళం తీసు కుని లోపలికి అడుగుపెట్టాడు కార్తీక్ ఆ అబ్బాయితోసహా. చల్లటి మంచినీళ్లు తను తాగి, ఆ అబ్బాయికి ఇచ్చాడు.

చాలా సేపటికి, ఎన్నో రకాలుగా అడిగిన మీదట.

'తన పేరు అభిషేక్ అనీ, తను 'చైతన్య కాలేజ్'లో ఇంటర్ పరీక్షలు రాశాననీ, తప్ప కుండా మంచి మార్కులే వస్తాయనీ' చెప్పాడు.

"మరి అంత నమ్మకం ఉన్నవాడివీ పిచ్చి పని ఎందుకు చేశావ్"

"... ... ..."

"చూడు అభిషేక్, నేను నీకు అన్నయ్య లాంటివాడిని, లేదా నీ ఫ్రెండ్ అనుకో నీకు వచ్చిన కష్టం ఏమిటో, ఎందుకు చచ్చిపోవా లనుకుంటున్నావో చెప్పకపోతే ఎలా తెలు స్తుంది చెప్పు"

"అసలు నువ్వు ఇంట్లోంచి బయటకు ఎప్పుడనగా వచ్చావో, మీ ఇంట్లో నీకోసం ఎంత కంగారు పడుతున్నారో" అన్న కార్తీక్ మాటలకు దిగ్గున లేచాడు అభిషేక్.

"నిజమే నేను నిన్న రాత్రి కూడా ఇంటికి వెళ్ళలేదు. ఇంటిదగ్గర అమ్మా, నాన్న చాలా కంగారుపడుతుంటారు. నేవెళ్ళాలి"

"నిన్న రాత్రినుంచీ వెళ్లలేదా? మరి ఎక్క డకు వెళ్ళావ్. ఏంచేశావ్" అన్న కార్తీక్ ప్రశ్నకు జవాబు చెప్పడం ఇష్టం లేనట్లు ముఖం తిప్పేసుకున్నాడు.

"సర్లే, నీకంత ఇష్టం లేకపోతే నాకేం చెప్పద్దులేకానీ ఇప్పుడింటికి వెడతావా లేక మరో ఆత్మహత్యప్రయత్నం చేస్తావా? " సూటిగా అడిగిన కార్తీక్ ముఖం చూడలేక తల దించుకున్నాడు అభిషేక్.

"చూడు అభిషేక్... నీ ఇష్టం లేకుండా నీనుంచి నేను ఏ విషయమూ అడగనూ, తెలుసుకోను, కానీ ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో మనల్ని కనీ పెంచిన, మనమీదే ప్రాణాలు పెట్టుకు బతికే తల్లిదండ్రులకు అన్యాయం చేసే ఆలోచనలు మాత్రం చెయ్యకు. ఓ.కె. ప్రామిస్ చెయ్యి" అంటూ చెయ్యి జాపిన కార్తీక్‌ను చూస్తే దుఃఖం ఆగలేదు అభిషేక్‌కు.

"అలాగే అన్నయ్యా, ఇంకెప్పుడూ ఇలాంటి తప్పుడుపని చెయ్యను కానీ, ఎలా బతకాలి, ఎందుకు బతకాలి నా కావేరి నన్న న్యాయం చేశాక" చివరి మాటలు తనలో తను అనుకుంటున్నట్లు మెల్లిగా గొణుక్కు న్నాడు. మెల్లిగా అనుకున్నా ఆ మాటలు కార్తీక్ చెవిన పడనేపడ్డాయి.

"బాప్‌రే... మరో ప్రేమకథా ఏమిటి దేముడా ఇంత చిన్నపిల్లవాడు మరీ పసి తనం వీడనివాడు"

అలా అనుకోగానే... తన గతం గుర్తొచ్చి అప్రయత్నంగా నవ్వొచ్చింది.

"చరిత్ర పునరావృతం అవుతూంది అంతే"

అవును తను రేవతిని ప్రేమించి ఇంట్లోంచి లేవదీసుకుపోయిననాడు తన వయసు మాత్రం ఎంతని? కాకపోతే ఈ అబ్బాయి మరీ సుకుమారంగా ఆడపిల్లలా ఉన్నాడంతే.

"అమ్మో మంచీచెడు తెలీనీకుండా మత్తులో పడేసి పరిస్థితులకు బానిసచేసే ప్రేమతో బాధపడుతున్నాడీ కుర్రాడు... ఇప్పుడిలా వదిలేస్తే మళ్ళీ చచ్చే ప్రయత్నం చేసినా చెయ్యచ్చు. అందుకే వంటరిగా వద లకూడదు" అనుకుంటూ.

"సర్లే తమ్ముడూ రా ఇంటి దగ్గర దిగబె డతా" అంటూ లేచాడు కార్తీక్.

"మీరా" అయిష్టంగా అన్నాడు, ఆ పెద్ద పెద్ద కళ్ళలో జరిగినది ఇంట్లో చెబుతా నేమో అన్న భయం తొంగిచూసింది.

"ఏంఫర్వాలేదు... ఇంట్లో నే సర్దిచెబు తాగా. రా... నీకేం భయంలేదు" అంటూ బయలుదేరదీశాడు కార్తీక్.

అభిషేక్ చాలామటుకు తేరుకున్నాడు. "ఇంట్లో ఇదేదీ చెప్పకు... సాధ్యమయినంత మామూలుగా వుండు, రాత్రి రానందుకు నేనేదో సర్దిచెబుతా" అంటున్న కార్తీక్ అతని కళ్ళకు దేముడిలా, ఆపద్బాంధవు డిలా కనిపించాడు.

అభిషేక్ చెప్పిన అడ్రస్‌తో ఓ ఇంటి ముందు కారు ఆపాడు కార్తీక్.

కారు ఆగిన శబ్దానికి బయటకు వచ్చిన ఓ అతను..."అన్నయ్యా... అభి... మన అభి షేక్ వచ్చాడు" అంటూ ఆనందాశ్చర్యాలతో అరచిన అరుపుకు ఇంట్లోంచి బిలబిలలా డుతూ వచ్చేశారు బోలెడుమంది ఆడా మగా.

"అభీ" అంటూ అభిషేక్‌ను వాటేసుకుని బావురుమన్న వాళ్ళిద్దరినీ అతని తల్లిదండ్రు లుగా గుర్తించాడు కార్తీక్.

వాళ్ళ కంగారు తీరాక, "రాత్రంతా ఇంటికి రాలేదు ఏమైపోయావురా" కోపంగా అడి గాడు వాళ్ళ నాన్నకాబోలు.

ఏంచెప్పలేనట్లు నిస్సహాయంగా కార్తీక్ వైపు చూశాడు అభిషేక్.

"చూడండి... మీరు మమ్మల్ని లోపలికి తీసుకెడితే అసలు ఏంజరిగిందో నేను చెబుతా" అన్న కార్తీక్‌తో ఎవరన్నట్లు ఓసారి చూసి అంతలోనే...

"సారీ... రండి లోపలికి రండి" అంటూ వదిలేస్తే మళ్ళీ ఎక్కడ తప్పిపోతాడో అన్నట్లు అభి చెయ్యి గట్టిగా పట్టుకునే లోప లికి దారితీశాడు.

"చూడండి, నాపేరు కార్తీక్, లాయర్ కార్తీక్" కార్తీక్ మాటలు పూర్తికాకుండానే...

"ఏమిటీ, మల్లిక కేసు డీల్ చేసిన లాయర్ కార్తీక్ మీరా" అంటూ అక్కడున్న అందరూ కార్తీక్ చుట్టూ చేరడం... కార్తీ క్‌కు ఓక్షణం సంతోషం అనిపించినా... అంతలోనే మల్లిక జ్ఞాపకాలే నీలినీడల్లా ముసిరాయి అతని ముఖంలో.

"అవును, నేనే... అదలా ఉంచండి. నిన్న రాత్రి నేను ఏదో కేసు గురించి ఆలోచిస్తూ రోడ్డు క్రాస్‌చేస్తున్న మీ అభిషేక్‌ను చూడ కుండా గుద్దేయబోయాను. లక్కీగా ప్రమాదం తప్పించి, షాక్ తిన్న అతనిని డాక్టరుకు చూపించి మా ఇంటికి తీసు కెళ్ళా...

డాక్టర్ సెడెటివ్ ఇవ్వడంతో ఇతని వివ రాలు తెలియక రాత్రంతా మా ఇంట్లోనే

వుంచి, ఇతనికి మెలకువ వచ్చాక ఈ ఉదయం ఇతని వివరాలు తెలుసుకుని ఇదిగో ఇలా తీసుకొచ్చాను, మీకు ఇంత టెన్షనూ, ఆవేదనా కలిగించినందుకు మీరంతా నన్ను మనస్ఫూర్తిగా మన్నించండి" అంటూ తండ్రిని అడుగుతున్న కార్తీక్‌ను చూస్తే మతిపోయింది అభిషేక్‌కు.

చావాలని కారుకింద పడ్డాడని తన గురించి నిజం చెప్పకుండా నింద తనమీద వేసుకున్న కార్తీక్ అంటే ఓ విధమైన అభిమానం, ఆత్మీయత, గౌరవం కలిగాయి అభిషేక్‌కు.

కృతజ్ఞతగా తనకేసి చూస్తున్న అభిషేక్ చెయ్యి చిన్నగా నొక్కాడు కార్తీక్ ఆత్మీయంగా.

తమ బిడ్డని అలానే రోడ్డుమీద విడిచివెళ్ళిపోకుండా మానవత్వంతో రక్షించి జాగ్రత్తగా తమకు అప్పచెప్పిన కార్తీక్ ఔదార్యాన్ని పొగిడి అతని పరిచయం తమకెంతో సంతోషం అని చెప్పారు వాళ్ళు.

"నా పేరు ఆనందరావు, మెడికల్ కాలేజీలో యు.డి.సిగా పనిచేస్తున్నాను. అభిషేక్ మా ఒక్కగానొక్క కొడుకు. ఈ ఏడుతో వాడి ఇంటర్ చదువు అయిపోయింది. వాడి తెలివి, చురుకుదనానికి వాడినెలాగయినా మెడిసిన్ చదివించాలని మా ఆశ. అది తలకుమించిన భారమే అయినా వాడి జీవితం బాగుపడుతుందనే నా ఆశయం, ఆశ" నిట్టూర్చాడు ఆనందరావు.

"మీ వాడికేమండీ చాకులాంటి పిల్లాడు... తప్పకుండా మెడిసిన్ చదివించండి, కోచింగ్ ఎక్కడ ఇప్పిస్తున్నారు? "

"కోచింగ్‌లకు ఫీజులిచ్చే స్థోమత నాకు లేదుబాబూ, అందుకే స్నేహితుల దగ్గర మెటీరియల్ అదీ తీసుకుని స్వంతంగానే ప్రిపేరు అవుతున్నాడు. ఏమో కష్టపడుతున్నాడు, మరి ఆ పైవాడి దయ ఎలా వుందో వాడిమీద"

"కావలసినంత వుంది, మీరేమీ వర్రీ అవకండి మీవాడు డాక్టర్ అవడం ఖాయం. అభిషేక్ నేనే నీ మొదటి పేషెంట్‌ను... ఫీజు మాత్రం ఎక్కువగా వడ్డించకు సుమా" నవ్వుతూ అన్నాడు.

"ఏమో మీలాటి మంచివారి నోటి వాక్యాన వాడు డాక్టర్ అయితే అదే పదివేలు, మీరు మాత్రం సకల ఆయురారోగ్య ఐశ్వర్యాలతో కలకాలం హాయిగా ఉండాలి" ఎమోషనల్‌గా అన్నాడు ఆనందరావు.

"సరే సరే... అన్నట్లు మీ చైతన్య కాలేజ్ వాళ్ళే ఏవో కోచింగ్ క్లాసులు కండక్టు చేస్తున్నారుగా అందులో నాకు తెలిసినాయన ఒకరు వున్నారు. రేపు రా, నీకు పరిచయం చేస్తాను, క్లాసులు ఎటెండ్ అవుదుగానీ, నేమాట్లాడతా ఫీజులూ అవీ లేకుండా"

ముక్కూమొహం తెలియని తమ మీద అతను చూపిస్తున్న ఆదరాభిమానాలకు వాళ్లు ఉక్కిరిబిక్కిరి అయ్యారు.

కొడుకు మీద వాళ్లకున్న నమ్మకానికీ, ప్రేమకూ కళ్లు చెమర్చాయి కార్తీక్‌కు. 'మరి అలాంటి అభిషేక్ ఈ ఆత్మహత్య యత్నం ఏమిటో? ఆ కావేరి ఎవరో? అభిషేక్‌కు ఏమయినా జరిగితే ఆ తల్లితండ్రులు తట్టుకోగలరా? అసలు ఏ తల్లితండ్రులయినా తమ పిల్లలు బాగా చదువుకుని వృద్ధిలోకి వస్తే చూసి సంతోషించాలి అనుకుంటారే గానీ అల్లరి చిల్లరిగా తిరిగి పాడయిపోతే వాళ్ల వేదన వర్ణింపనలవికాదుగదా! ఎందుకు అర్థం చేసుకోరు ఈ పిల్లలు..., నవ్వొచ్చింది మళ్లీ తన ఆలోచనలకు. తను మాత్రం ఏం చేశాడు ఆ వయసులో. తన వలన తన తల్లితండ్రులు ఎంత బాధపడ్డారు.

కార్తీక్ ముఖంలో మారుతున్న ఆలోచనలూ, రంగులు అభిషేక్ బాగానే గ్రహించాడు.

తర్వాత అంతా చెబుతా అన్నట్లు అభ్యర్థనగా చూశాడు.

ఆ కళ్లలో ఏం చదివాడో కార్తీక్ తన

విజిటింగ్ కార్డు ఇచ్చి ఏ అవసరం వున్నా తనను కలవమని, తననూ వాళ్లలో ఒక డిగా భావించమనీ చెప్పి కారెక్కాడు.

తమ ఒక్కగానొక్క కొడుకుని రక్షించడమేగాక అరమరికలు లేకుండా తమతో కల్సిపోయిన కార్తీక్ ఆనందరావు దంపతులకు బాగా నచ్చాడు. తప్పు తనదే అయినా అది ఇంట్లో వాళ్లకు చెప్పి తననూ, తన వాళ్లనూ బాధించక, తన తప్పు ఏమీ లేకపోయినా అది తన మీద వేసుకుని ఇంట్లో వాళ్ల దగ్గర తను దోషిగా నిలబడాల్సిన అవసరం లేకుండా చేసిన కార్తీక్‌పట్ల సోదరభావం, అంతకుమించి కృతజ్ఞత భావం కలిగాయి అభిషేక్‌లో.

మళ్లీ ఒకటి రెండుసార్లు కలిసినా ఆ రోజు జరిగిన దాని గురించి అడగని కార్తీక్ వ్యక్తిత్వం, మనస్తత్వం అభిషేక్‌కు ఎంతో నచ్చింది. తన విషయం చెప్పుకోదగిన ఆత్మీయుడిలా అనిపించాడు కార్తీక్.

"అరె అభి. ఎంతసేపయింది వచ్చి... బయటే నిలుచుండిపోయావ్! తలుపులు తట్టకపోయావా, పవర్ లేనట్లుంది" కాలింగ్ బెల్ నొక్కుతూ అన్నాడు. అప్పుడే బయటనుంచి వచ్చిన కార్తీక్, పిలవాలా వద్దా అని వేసివున్న తలుపులకేసి చూస్తూ సందిగ్ధంగా నిలబడ్డ అభిషేక్‌ను చూస్తూనే

"ఇప్పుడే వచ్చా మీరు ఇంట్లో ఉన్నారో లేరో అని..." సందిగ్ధంగా అంటూ అభిమానంగా తననే చూస్తున్న అభిషేక్‌లో పసితనపు ఛాయలు కనబడి మళ్లీ నవ్వొచ్చింది కార్తీక్‌కు. "రేవతీ" తలుపు తట్టాడు పెద్దగా పిలుస్తూ.

"ఆ వస్తున్నా" అంటూ రేవతి వచ్చి తలుపు తీయడం "డాడీ" అంటూ బయటకు పరుగున వచ్చిన పాపను చూస్తూనే అభిషేక్ కొంచెం ఆశ్చర్యపోవడం గమనించాడు కార్తీక్.

నిజమే మరి. పాతిక కూడా దాటని కార్తీక్‌కు ఆరేడేళ్ల వయసు కూతురుందంటే కొత్తవాళ్లకు ఆశ్చర్యమే. ఇప్పుడెవరికీ ఆ వయసులో ఇంకా పెళ్లిళ్లే అవడంలేదు మరి.

"హాయ్ స్వీటీ. ఏం చేస్తున్నావు" అంటూ తను తెచ్చిన బొమ్మల పాకెట్ పాపకిచ్చి "రా అభి" అంటూ ఇంట్లోకి నడిచాడు కార్తీక్.

ఆ రాత్రి అభిని ఇంటికి తీసుకొచ్చిన రోజు రేవతీ, పాప ఇంట్లో లేరు. వాళ్ల అమ్మమ్మగారింటికి వెళ్లారు. అందుకే అభి ఎవరో రేవతికి అర్థం కాలేదు.

"రేవతీ, ఈ అబ్బాయి అభి" అంటూ కార్తీక్ చెప్పగానే అభి ఎవరో అర్థం అయింది. జరిగిన సంగతి ఆ తర్వాత అతను చెప్పాడు.

"రా అభి... కూర్చో" అంటూ తెలిసిన వ్యక్తిలా ఆదరంగా మాటాడుతున్న రేవతిని అయోమయంగా చూశాడు అభి.

"ఈవిడ రేవతి. మీ వదిన"

కాసేపు మాట్లాడాక అభి తనతో ఏదో చెప్పాలనుకుంటున్నాడని అర్థం అయింది. రేవతి ఎదురుగా మొహమాట పడుతున్నాడని కూడా అర్థం అయింది.

"అభి... రా... మేడమీద నా ఆఫీసు గది చూపిస్తా"

"అభికి, నాకూ మంచి కాఫీ ఇచ్చి నీ పని పూర్తి చేసుకురా! అంతవరకూ మేం ఇద్దరం పైన ఆఫీసు గదిలో ఉంటాం" రేవతితో చెప్పాడు. వాళ్లిద్దరూ ఏదో మాటాడుకోవాలనే అతను అలా చెప్పాడని అర్థం అయింది రేవతికి. వాళ్లకు కాఫీ ఇచ్చి "నాకు బోలెడు పని ఉంది, మీరిద్దరూ పైన కూర్చోండి నే తర్వాత వస్తా" అంది.

"రా అభి" మేడమీద గదిలోకి తీసుకెళ్లాడు.

అక్కడ బీరువాల్లో బోలెడన్ని లాబుక్స్, టేబుల్, దానిమీద ఫైల్స్, ఎదురుగా కుర్చీలు ఎక్స్‌టెన్షన్ ఫోనూ అది కార్తీక్ ఆఫీస్ రూం అని చెప్పకనే చెబుతున్నాయి.

చిన్నగా ఏసీ ఆన్ చేసి తలుపులు దగ్గ

రకు వేసి అడిగాడు "ఊ ఇప్పుడు చెప్పు. ఏమిటి కబుర్లు. నీ చదువెలా వుంది. ఎంట్రన్స్ ఎప్పుడు?"

"ఎంట్రన్స్ నెక్స్ట్ మంత్‌లోనే, బాగానే చదువుతున్నాను. మరి... మరి.." అంటున్న అభిషేక్‌తో.

"చూడు అభి. నువ్వు నాకేదో చెప్పాలను కుంటున్నావు. అదేమిటో నిర్భయంగా చెప్పు. జస్ట్ నేను నీ ఫ్రెండ్ అనుకో. నా దగ్గర నీకు ఎలాంటి సంకోచం, భయం వద్దు. కమాన్, స్పీకౌన్" అభి చెయ్యి నొక్కాడు కార్తీక్ అనునయంగా.

"అన్నయ్యా! మరి ఆ రోజు నేను చావా లనే నీ కారు కింద పడ్డాను. కానీ మర్నాడు నువ్వు నన్ను ఇంటికి తీసికెళ్లాక ఇంట్లో అమ్మానాన్నల కంగారు, నా గురించి వాళ్ల బాధ చూశాక అలాంటి పని ఇంకెప్పుడూ చెయ్యకూడదనిపించింది. కానీ నాకసలు బతకాలని లేదన్నయ్యా! కావేరి నా కావేరి నన్ను చీట్ చేశాక నాకసలు బతకాలని లేదు" చేతుల్లో ముఖం దాచుకున్నాడు అభి.

ముఖం ఎర్రబడి ఉద్రేకంతో ఊగిపో తున్న అభిని చూశాక అతనెంతటి మాన సిక సంఘర్షణకు లోనవుతున్నాడో అర్థం అయింది కార్తీక్‌కు.

"అరె కూల్ డౌన్ బాబా... కూల్ డౌన్. జీవితం అన్నాక అనేక ఎత్తుపల్లాలుం టాయి. అయినా ఇంకా జీవితపు తొలిమెట్టు కూడా ఎక్కనివాడివి. నీ ప్రాబ్లమ్ ఏమిటీ? అప్పుడే జీవితం మీద విరక్తి ఏమిటీ? అవునూ మొన్న కూడా నీలో నువ్వు గొణు క్కోవడం విన్నాను. ఎవరూ? ఎవరీ కావేరి? నీ లవ్వరా?" అదోలా అడిగాడు కార్తీక్.

ఎలా చెప్పాలా అని సతమతమౌతున్న అభిషేక్‌కు కార్తీక్ అలా సూటిగా అడిగేస రికి క్షణంసేపు బిత్తరపోయి తడబడ్డాడు.

"అవునన్నయ్యా! మా ఇద్దరి ప్రేమా ఈనాటిదికాదు. గత ఐదేళ్లుగా మేం ప్రేమిం చుకుంటున్నాం" సీరియస్‌గా చెప్పాడు అభి, తెల్లబోయాడు కార్తీక్.

"ఏ... ఏమిటీ గత ఐదేళ్లుగానా ఇప్పుడు నీ వయసెంత? నువ్వు రాసింది ఇంటర్ ఎగ్జామ్స్ అంటే నీకు సుమారుగా పదిహే డేళ్లు కంటే ఉండవు అవునా?" అయోమ యంగా అడిగాడు కార్తీక్.

"అవును, కానీ మా ప్రేమ వయసు నిజంగా ఐదేళ్లు అంటే ఇంచుమించు మేం ఎనిమిదోక్లాసులో ఉన్నప్పటినుంచీ అను కుంటా" గంభీరంగా అన్నాడు అభి.

"మా నాయనే. ఇంకా నయం ఎనిమిదో ఏట పడలేదు ప్రేమలో" అనబోయి అసలే సీరియస్‌గా ఉన్న అభిషేక్ ఈ వేళాకోళం మాటలు వింటే విషయం అసలు చెప్ప డేమో అని ఆగాడు కార్తీక్.

"మా పక్క ఇల్లే కావేరీ వాళ్లది. వాళ్లూ మేమూ చాలా స్నేహంగా ఉండేవాళ్లం. కావేరీ నేనూ ఒకే క్లాసు, ఒకే సెక్షనూ అవ డంవలన రోజూ స్కూలుకు కలిసే వెళ్లి కలిసే వచ్చేవాళ్లం. స్కూల్లో కూడా చాలావ రకు కలిసే తిరిగే వాళ్లం. మా స్కూల్లో అంతా మమ్మల్ని లవ్‌బర్డ్స్ అనేవాళ్లు. ఓసారి కావేరికి నా మీద ఎందుకో కోపం వచ్చి నా మీద మా మాస్టారికి లేనిపోని చాడీలు చెప్పి బాగా కొట్టించింది. కానీ మళ్లీ నావంటి మీద దెబ్బలు చూసి తనే తట్టుకో లేక ఏడ్చేసింది. అలా మొదలయింది మా ప్రేమ"

కార్తీక్ ఏదో సినిమా చూస్తున్నట్లు చూస్తున్నాడు అభిషేక్ ముఖంలోని ఫీలిం గ్స్‌ను.

"అది మొదలు ఇద్దరం ఎప్పుడూ ఒకేమా టగా ఉండేవాళ్లం. సరదాకయినా ఎప్పుడూ పోట్లాడుకోలేదు. మేం ఇద్దరం బాగా చదు వుకుని డాక్టర్లయి పెళ్లి చేసుకోవాలని అను కున్నాం. అందుకే ఇంటర్లో ఇద్దరం ఎంతో కష్టపడి చదివాం. ఎంట్రన్స్ ఎగ్జామ్ కూడా రాద్దామనుకుంటున్న సమయంలో అనుకో



కుండా... అనుకోకుండా" చెబుతున్న అభి గొంతు పూడుకుపోయింది. ఇంక చెప్పలేనట్లు ఆగి కళ్లు తుడుచుకున్నాడు. కార్తీక్ ఏమీ మాట్లాడకుండా అతని ఎమోషన్స్ చూస్తూ కూర్చున్నాడు.

రెండు నిముషాలాగి అభిషేక్ చెప్పడం మొదలు పెట్టాడు.

"ఓ నాలుగు రోజుల క్రిందట ఏం జరిగిందంటే"

"అభి, ఓ అభి! రేపు శ్రావణమాసంలో నా పెళ్లి మా బావతో" ఎంతో క్యాజువల్‌గా చెప్పింది కావేరి.

"ఏయ్ కావేరీ. సరదాగా అయినా అలాంటి మాటలు అంటే నిన్ను చంపేస్తాను" కోపంగా అన్నాను.

"కాదు అభీ! నిజంగానే మా అమ్మకు హార్ట్ ప్రాబ్లమ్ కదా! నా పెళ్లి త్వరగా చెయ్యాలని అంటోంది నాన్నతో. నాన్న కూడా మా అత్తయ్య, అదే మా నాన్న చెల్లెలు కొడుకుతో అంటే మా బావతో నా పెళ్లి ఫిక్స్ చేశారు. అతను మెడిసిన్ థర్డ్

ఇయర్ చదువుతున్నాడు ఇంకా. అప్పుడే పెళ్లేమిటీ. నాకిష్టంలేదు అని చెప్పినా ఇంట్లో వినడంలేదు. నే మెడిసిన్ చదువుతా అంటే పెళ్లయ్యాకా చదువుకో అంటున్నారు. అత్తయ్యా, మామయ్యా, బావ అంతా మంచి వాళ్లు. నే సుఖపడతానని నాన్న నమ్మకం"

"అంటే నేను మంచివాడిని కానా. నువ్వు నన్ను పెళ్లి చేసుకుంటే సుఖపడవా"

"అదికాదు అభీ! తెలిసీ తెలియని వయసులో మనం ఎన్నో అనుకుంటాం. ఇంకా నువ్వు ఇంటరు చదువుతున్నావు, ఇప్పుడే నీకు పెళ్లంటే ఎవరయినా నవ్వుతారు. మీ ఇంట్లో వప్పుకోరు. అమ్మ ఆరోగ్యరీత్యా నా పెళ్లి చేసెయ్యాలని మా వాళ్లు నిర్ణయించుకున్నారు. రేపోమాపో డాక్టర్ కాబోతున్న బావను కాదనడానికి నాకే కారణం కనిపించడం లేదు. అన్నట్లు కావేరి ఇష్టపడి చదువుకుంటానంటే ఆమెనూ మెడిసిన్ చదివించడానికి ఏ అభ్యంతరం లేదన్నారట వాళ్లు నాన్నతో. నేను నిన్ను నిజంగా మనస్ఫూర్తిగా ప్రేమిస్తే బావతో నా పెళ్లి అనగానే నాకు చాలా బాధ కలగాలి. జీవితం మీద విరక్తి కలగాలి కానీ అవేమీ నాలో లేవంటే... జస్ట్ నేను నిన్ను మంచి ఫ్రెండ్‌గా ఇష్టపడ్డానంతే అంతకుమించి నీ మీద నాకేభావం లేదన్నమాట" నవ్వుతూ అంది కావేరి.

"అసలు మాట్లాడేది నా కావేరేనా అనిపించింది. సరదాగా నన్ను ఆటపట్టించడానికామె అలా అందా అనిపించింది. కానీ కానీ అంకుల్ వాళ్లు కూడా నాన్నతో ఈ విషయం చెప్పడం విన్నాను. కావేరికి వాళ్ల బావతో ఎంగేజ్‌మెంట్ కూడా అయిపోయింది. వాళ్లు బాగా డబ్బున్న వాళ్లు. ఆమెకు మంచి చీరలూ, నగలూ పెట్టారుట, ఆంటీ అమ్మతో చెప్పి అన్నీ చూపిస్తుంటే ... విన్నాను. అసలు సంగతి కావేరికి నాకంటే నాకంటే వాళ్ల డబ్బూ, డాబూ ఆస్తిపాస్తులే ఎక్కువయ్యాయి" ఉక్రోషంగా అన్నాడు అభి.

"పైగా నువ్వూ నన్ను మర్చిపోయి బాగా చదువుకుని పెద్ద డాక్టర్ అవ్వాలి అంటూ పెద్ద డైలాగ్స్ చెప్పింది. డైలాగ్స్..." కసిగా అన్నాడు అభిషేక్.

"సో, కావేరి నిన్ను ఐదేళ్లుగా ప్రేమించి ఇప్పుడు వాళ్ల బావను పెళ్లి చేసుకుంటోందన్నమాట. అదేగా నీ బాధ. అందుకేగా ఆత్మహత్య ప్రయత్నం" అని

"చూడు అభి... ఒకరకంగా కావేరి తెలివైన పిల్ల. ఆమెకు వాస్తవం, ఊహలు వేరు వేరని తెలిసింది. అయినా కావేరి అన్నట్లు మీది ప్రేమకాదు అభి. చిన్నప్పటినుంచి కలిసిమెలిసి తిరిగిన అభిమానం. ఇప్పటి టీనేజ్ లవ్ సినిమాలు చూసి చూసి దాన్నే మీరు ప్రేమ అనుకున్నారు. కావేరి చేసింది మంచి పనే. అలాకాక ఇద్దరూ చదువు వదిలేసి ఇంట్లో చెప్పాపెట్టకుండా. పారిపోయి పెళ్లి చేసుకున్నారే అనుకోండి. ఏమిటీ మీ పరిస్థితి? ప్రేమ, దాని మీద మోజు తీరి అసలు జీవితం అర్థం అయ్యేసరికి కష్టాలు, కన్నీళ్లు ఒకరికొకరు బద్ధ శత్రువులైపోతారు. నీకు తెలుసా నాకిప్పుడు పాతికేళ్లు. నా కూతురు వయసెంతో తెలుసా? ఏడేళ్లు. అంటే నేను పద్దెనిమిది ఏళ్లకే తండ్రి అయ్యాను. నాకు తెలుసు మొదటిసారి మా పాపను చూసినప్పుడు నీ కళ్లలో కనబడ్డ ఆశ్చర్యం. నీకింకో సంగతి చెప్పనా. నేనూ రేవతి అదే మీ వదిన మీలాగే ఇంటర్ చదువుతూనే ప్రేమలోపడ్డాం.

ఇంట్లోవాళ్లు కేకలేసేసరికి కాదనేసరికి అదేదో పెద్ద ఎడ్వంచర్‌లా నేనూ రేవతీ ఉన్న కొద్దిపాటి నగలూ, ఇద్దరి ఇళ్లలోంచి కొద్దిపాటి డబ్బూ తీసుకుని ఇంట్లోంచి పారిపోయాం. కరక్టు భాషలో చెప్పాలంటే లేచిపోయాం. దగ్గర ఉన్న సొమ్ములు కరిగిపోయేదాకా ఒకళ్లలో మరొకరికి ప్రేమ, ఆరాధనా, స్వర్గం ఇవే కనిపించాయి. కానీ

సొమ్ములు కరిగిపోయి తిండి గడవని రోజు వచ్చేసరికి అంత ప్రేమా ఆవిరైపోయి ఇద్దరం బద్ధ శత్రువులయ్యాం. అంతలోకే మా మధ్యకి మా పాప వచ్చేసింది. లోకం అంటే ఏమిటో తెలియదు, చదువు సంధ్యా లేదు, చేతిలో చిల్లిగవ్వలేదు. ఆ రోజుల్లో మేం పడ్డ కష్టాలూ, నరకయాతనా అంతా ఇంతా కాదు. ఆఖరికి అంత ప్రేమా ఎగిరి పోయి రేవతిని ఆమె ఖర్మానికి పాపతో సహా వదిలేసి నేను మా ఇంటికి పారిపో యాను. ఇది చెప్పుకోవడానికి ఈ రోజు నే సిగ్గు పడటంలేదు. వాస్తవానికీ ఊహలకూ ఉన్న వ్యత్యాసం అదే.

గతిలేక పాపతోసహా ఆత్మహత్య చేసుకో బోయిన రేవతిని సమయానికి చూడబట్టి ఆదరించి మా ఇద్దరికీ తప్పొప్పులు చెప్పి చదువుకునేట్లు చేసి, మళ్లీ మాకు చక్కటి జీవితాన్నీ, సంఘంలో ఓ స్థానాన్ని ప్రసా దించిన దేముడు మా శంకరం బాబాయ్.

ఆయనే లేకుంటే మా జీవితాలు... ఓ హ్... ఊహించడానికి కూడా ధైర్యం చాల డం లేదు. అయితే అందరికీ అలా చేయూ తనిచ్చి జీవితాలను సరిదిద్దుకునే అవకాశం ఇప్పించేవాళ్లు ఉండద్దూ. ఈవేళ నూటికి ఎనభై శాతం ప్రేమలూ, జీవితాలు ఇలా ఆదుకుని ఏది తప్పో ఏది ఒప్పో తెలియ చెప్పి నిలబెట్టే వాళ్లు లేక రాలిపోతున్నాయి. నువ్వింకా చిన్నవాడివి, నీకు ఈ వయసులో కావాల్సింది చదువు. బాగా చదువుకుని నీ కాళ్ల మీద నువ్వు నిలబడితే అంతవరకూ నీ ప్రేమ నిలబడితే, ప్రేమా పెళ్లీ తప్పు కాదు కానీ కారణం ఏదైనా కావేరి తన జీవితం తను నిర్ణయించుకున్నప్పుడు మూర్ఖుడిలా పిచ్చివాడిలా నువ్వు నీ జీవితం పాడు చేసుకోవడం, అంతం చేసు కోవాలనుకోవడం అవివేకం. చూశావుగా నీ తల్లితండ్రుల ఆరాటం. నువ్వు ఒక్క రోజు... కాదుకాదు ఒక్క రాత్రి కనబడక పోతేనే అంత తల్లడిల్లిపోయారే. నువ్వే కనుక ఆత్మహత్య చేసుకు చనిపోతే వాళ్ల గుండెలు బద్దలుకావా? అసలు వాళ్లు బతు కుతారా?

"నా మాట విని నువ్వు నీ చదువు మీద మనసు లగ్నం చెయ్యి. కావేరి అన్నట్లు అసలు ఇదంతా ప్రేమకాదు. తెలియని తనంతో ప్రేమ అనుకుంటున్నావంతే నువ్వు బాగా చదువుకుని డాక్టర్ అవడమే నీ లక్ష్యంగా పెట్టుకో. నీకు ఏ కలవరం, దుఃఖం వుండవు. జీవితంలో స్థిరపడ్డాకే ప్రేమా పెళ్లి ఆలోచన చెయ్యి" గంభీరంగా చెప్పిన కార్తీక్ సుదీర్ఘ హితోపదేశం అభిషే క్‌ను ఆలోచనలో పడేసింది.

"అలాగే అన్నయ్యా. ఇకనుంచీ నా లక్ష్యం నా గమ్యం ఒక్కటే. బాగా చదువు కుని డాక్టర్ అవడం. అప్పుడు నా తల్లితం డ్రుల కళ్లలో మెరిసే మెరుపు నే చూడాలి. నాకు కావలసినది అదే" స్థిరంగా అన్నాడు.

వెరీగుడ్ ఇంక వెడదామా. మీ ఇంట్లో కంగారుపడతారేమో" అంటూ లేచిన కార్తీక్ పాదాలంటాడు అభిషేక్ అభిమానంగా.

"అరెరె... ఇదేమిటీ చిన్న పిల్లాడిలా లే... లే నువ్వు రియలైజ్ అయ్యావు నాకంతే చాలు" తృప్తిగా అన్నాడు కార్తీక్.

"రేవతీ తలుపేసుకో నేను అభిని ఇంటి దగ్గర దిగబెట్టి వస్తాను" తలుపులు దగ్గరకు వేసి వెళ్లిపోయారు కార్తీక్, అభి.

పనిపూర్తి చేసుకుని పైకి వెడదామనుకు న్నదల్లా మళ్లీ మనసు మార్చుకుని పుస్తకం చదువుతూ కిందే కూర్చుండిపోయింది. ఈ ప్రేమ వ్యవహారాలు చాలా సున్నితమైనవి. అసలే చిన్నతనం. అభి తన రాకకు ఇష్టప డకపోవచ్చు ఫ్రీగా కార్తీక్‌తో మాట్లాడలేక పోవచ్చు అనుకుంది.

చదువుతున్న పుస్తకం పక్కనపెట్టి తలు పేసివచ్చింది. అన్ని విషయాల్లో తలదూర్చి ఈ కార్తీక్ అనవసరంగా చాలా వర్రీ అయి పోతున్నాడు. తనూ కార్తీక్ హాయిగా గడిపి ఎన్ని రోజులయింది. అసలు సమాజమే

మోసాలు, నేరాలు, ఘోరాలు, అరాచకాలకు ఆలవాలంగా మారిపోయిన వేళ అడుగడుగునా రాజేష్‌లాంటివాళ్లూ భార్గవ్‌లాంటి వాళ్లూ ఎదురవుతుంటే ఎంతమందిని మార్చగలం. ఎంతమంది అమాయకులను బలికాకుండా ఆపగలం.

అలోచిస్తూనే గబగబా వంట పూర్తి చేసింది రేవతి. రేపే కార్తీక్‌తో మాట్లాడి ఓ వారం రోజులపాటు ఎటైనా వెళ్లిరావాలి. ఆ ఎప్పటినుండో అనుకుంటోంది తను తిరుపతి వెళ్లిరావాలని. ఆ పని చేస్తే ఉభయ తారకంగా ఉంటుంది. ఆ దేవదేవుడ్ని దర్శించుకున్నట్లూ వుంటుంది. కాస్త ఈ రొటీన్ లైఫ్ నుంచి మార్పూ వుంటుంది. కార్తీక్ రాగానే మాట్లాడాలి. మాట్లాడటం కాదు ఒప్పించాలి.

అభిని ఇంట్లో దిగబెట్టివచ్చాక ఆ రాత్రి భోజనాలయ్యాకా ఒళ్లో తలపెట్టి పడుకున్న కార్తీక్ ఏదో ఆలోచనలో అలజడిగా అశాంతిగా ఉండటం గమనించింది రేవతి.

"అరె కార్తీ... ఏమయింది? ఎందుకలా రెస్ట్‌లెస్‌గా, అనీజీగా ఉన్నావు. ఎనీ ప్రాబ్లమ్? " మృదువుగా ప్రేమగా అడిగింది రేవతి.

"ఏంటోరా. మనసు చాలా అశాంతిగా ఉంది. అసలు ఏమైపోతోంది ఈ యువత, ఎటుపోతున్నారు. నిన్న మల్లిక అలా... ఈ వేళ అభి ఇలా! అసలు టీనేజ్ మొదలయింది మొదలు ఈ ప్రేమా పరస్పరాకర్షణ తప్ప జీవితంలో ఇంకేదీ ఉండదా? ఎంతవరకూ వీళ్లని ఎవరో ఒకరు వాచ్ చేస్తూ ఉంటారు చెప్పు. మనసంగతే తీసుకో శంకరం బాబాయ్ మనల్ని ఆదుకుని సరైన సమయంలో సరైన దారి చూపకపోతే అసలు మనం ఉండేవాళ్లమా! ఉన్నా ఎటువంటి జీవితం అనుభవిస్తూ ఉండేవాళ్లం, అసలు ఊహిస్తేనే తలచుకుంటేనే భయం వేస్తోంది.

నిజంరా, అది గుర్తొస్తే ఓ పీడకలలా అనిపించి భయం వేస్తోంది. అసలు ప్రేమను క్రేజీగా, ఓ ఫ్యాషనులాగానో స్టేటస్‌లానో చూపించి టెక్నికలర్ ఇచ్చే ఈ సినిమాలు బేన్ చేస్తే బాగుండును. ఏ సినిమా చూసినా ప్రేమ, సెక్స్, వయొలెన్స్. అసలు ఏ సినిమాలో అయినా వంటినిండా బట్టలున్న హీరోయిన్ ఉంటోందా? ఆ సినిమాలు అందులో ఉండే పోకడలూ చూసే ఆ ఆడపిల్లలు కూడా ఇటీవల కాలంలో ప్రొవకేటింగ్‌గా తయారవుతున్నారు. అలాంటివి చూసే ఈ యువత ఇలా మారిపోతోంది. చక్కగా చదువుకుని జీవితంలో సెటిల్ అవ్వాల్సిన ఎంతో అమూల్యమైన కాలం ఇలా ప్రేమా దోమా అంటూ పాడు చేసుకుంటున్నారే! దీనికి కారణం ఎవరు? పర్యవసానాలు ఏమిటీ? " కార్తీక్ గొంతులో అంతులేని నిరాశా, విషాదం.

"నిజమే కార్తీ. అసలు ఏమీ తెలియకుండానే మంచి హుషారు మీదుండేదే కుర్రకారు. అలాంటిదీవేళ సినిమాలద్వారా, పుస్తకాలలో, ఇంకా టీవీ సీరియల్స్, ఆఖరికి ఎడ్వర్‌టైజ్‌మెంట్స్‌లో కూడా అసభ్యకర దృశ్యాలు. అసలు సృష్టి కార్యమనేది పవిత్రంగా తెరచాటుగా ఉండటంలో ఉన్న అందం ఆనందం ఈ బరితెగించినతనంలో ఉంటుందా?

ఆ ఆకర్షణకూ అవసరానికీ అందమైన ముసుగు ముచ్చటైన పేరు ప్రేమ.

అసలు నిజమైన ప్రేమ, స్వచ్ఛమైన ప్రేమ మచ్చుకైనా కనబడకుండా పోతోంది. టీనేజ్‌లో అడుగుపెట్టీ పెట్టగానే ఓ బాయ్ ఫ్రెండో ఓ గర్ల్ ఫ్రెండో ఉండకపోతే అసలు అది చాలా అవమానకరంగానూ అనాగరికంగానూ భావిస్తోంది ఈనాటి యువత.

ఈవేళ రేపు తల్లితండ్రులదికూడా చాలా వరకూ తప్పు ఉంటోంది కార్తీక్.

పిల్లల్ని చాలా గ్రాండ్‌గానూ మంచి స్టేటస్‌తోనూ పెంచాలనే ఆరాటంతో

డబుల్ ఎంప్లాయ్‌మెంటు ప్రిఫర్ చేస్తున్నారు. వీళ్లు వీళ్ల పనులలో మునిగి తేలుతూంటే కేవలం కేలరీడ్ డైట్, కాస్ట్‌లీ లైఫ్ ఇస్తే సరిపోతుందనుకుంటున్నారు పిల్లలకు. కానీ వాళ్లకు కావలసిన ఆత్మీయత ఆప్యాయత, ఏది మంచి ఏది చెడూ తెలిపే దగ్గరతనం ఇవన్నీ వాళ్లకు అందటం లేదు.

ఆఖరికి... ఆఖరికి కొన్ని చోట్ల అక్క, చెల్లి అనే సెంటిమెంట్స్‌కూడా లేకుండా పోతున్నాయి. తెల్లారిలేస్తే అలాంటివి అక్కడక్కడ ఎక్కడో అక్కడ చెదురుమదురుగా వింటున్నాం. పేపర్లలో చూస్తున్నాం. ఎందుకు ఇలా తయారవుతున్నారు? ఎవరిది లోపం? ఎంత ఆలోచించినా 'భూమిగుండ్రంగా ఉంది' అన్నట్లే బాధ్యత పెద్ద వాళ్లదే అనిపిస్తోంది.

చాలా ఇళ్లలో డబ్బు సంపాదనే లక్ష్యమైపోతోంది. అది తప్పుకాకపోవచ్చు కానీ అది ఎంత బాధ్యతగా చేస్తున్నారో అంత బాధ్యత, కన్‌సర్న్ పిల్లల మీద కూడా చూపాలికదా! కన్నందుకు ఇంత తిండీబట్టా ఇచ్చేసి ఖరీదైన స్కూళ్లు, కాస్మపాలిటన్ లైఫ్ అందిస్తే బాధ్యత అక్కడితో తీరిపోయిందనుకోవడమో, లేకపోతే ఇంతకంటే ఏం చెయ్యలేకపోతున్నాం ఏం చేస్తాం? అని సరిపెట్టుకోవడమో చేస్తున్నారు! కానీ వాళ్లకు కొంత సమయం కేటాయించి వాళ్లతో ప్రేమగా ఆప్యాయంగా గడుపుతూ మంచీచెడూ మన సంస్కృతీ సాంప్రదాయం లాంటివి వాళ్లతో చర్చిస్తే వాళ్లకూ వాటి అవసరం, విలువ తెలిసే అవకాశం ఉంటుంది.



"సరేకానీ కార్తీ! అసలు ఈ టాపిక్ చాలా గంభీరమైనది, లోతైనదీ. ఎంత స్టడీ చేసినా తరగనిది. అలాంటి దాని గురించి మనం ఇలా ఆలోచిస్తూ మాట్లాడుకుంటూ పోతే తెల్లారిపోతుంది. పడుకో. మళ్లీ రేపు కోర్టు కెళ్లాలిగా చాలా అలసిపోయావ్‌గానీ ఇంక పడుకో. అనవసరమైన ఆలోచనలు చేసి బుర్రపాడు చేసుకోక హాయిగా పడుకో" అంటున్న రేవతిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు కార్తీక్.

ఎడారి అంతటా ఇసుక మేటలు.. తన చేతిలో వస్తువేదో కిందపడిపోయింది. ఎండ... కాలి బూడిదయ్యేటంత ఎండ. కాలి బూడిదయ్యేటంత వేడి, చాలా అపురూపమైనది చేజారిపోయింది. వెతుకుతున్నాడు. ఆ ఎర్రటి ఎండలో వెతుకుతున్నాడు. వెతుకుతూనే ఉన్నాడు. నిలబడలేకుండా ఉన్నాడు. ఏడుపొచ్చేస్తోంది. భగవంతుడా ఏమిటీ పరీక్ష రేవతి... తన రేవతి అపురూపంగా తన వేలికి తొడిగిన ఉంగరం ఎలా... ఎలా చేజారిపోయింది. అది తనకు కావాలి. దానికోసం ఎంత అవస్థపడైనా వెతుకుతాను.

"ఏమండీ... లెండి కార్తీక్ లెండి. ఏమిటా పలవరింతలు. ఏమయింది. ఎందుకలా చెమటలు పడుతున్నాయి. లెండి.. కళ్లు తెరవండి. ప్లీజ్ నేను రేవతిని" కుదిపి కుదిపి లేపింది రేవతి కార్తీక్‌ను.

తెరవలేక తెరవలేక అతికష్టం మీద బల

వంతంగా కళ్లు తెరిచాడు కార్తీక్ "రేవతీ ఉంగరం... నా ఉంగరం" అంటూ.

"ఏమయింది? ఏమిటా కలవరింతలు? కళ్లు తెరు కార్తీక్. ఏదీ మెలకువ తెచ్చు కోండి. ఏమయినా పీడకలా. ఇదిగో చల్లటి మంచినీళ్లు తాగండి" రేవతి అందించిన చల్లటినీళ్లు గడగడా తాగేశాడు. కలవరంగా కళ్లు తెరచిచూశాడు. పక్కనే పాప నిద్రపో తోంది. రేవతి చల్లటి స్పర్శ.

"టైమెంత అయింది"

....

"అంత డిస్టర్బ్ అయ్యారు, ఏదైనా పీడ కలా"

.....

"పోనీలెండి. ప్రశాంతంగా నిద్రపోండి. అయినా ఈమధ్య సరైన తిండీ లేదు, నిద్ర లేదు. ప్రశాంతత అసలు లేదు. అందుకే పాడు కలలూ. పీడ కలలూ, మర్చిపోయి నిద్రపోండి"

"రేవతీ. నువ్వు కాసేపు నా దగ్గరగా కూర్చో" చెయ్యి గట్టిగా పట్టుకుంటూ అడి గాడు.

"అలాగే నేనిక్కడే నీ దగ్గరే ఉంటాను పడుకో"

కార్తీక్ మీద చేయివేసి దగ్గరగా పడు కుంది. రేవతికి ఇట్టే నిద్రపట్టేసింది.

'తెల్లవారుఝాము కలలు నిజమవుతా యంటారు. దేముడా నాకింకేం వద్దు నా రేవతిని, పాపని, ప్రశాంతమైన జీవితాన్ని ఇలాగే వుంచు. నాకింకేం వద్దు. పడ్డ కష్టాలు, గడిచిన చేదు అనుభవాలు చాలు. మమ్మల్ని చల్లగా చూడు దేముడా' ఆలోచ నలతో, అశాంతితో ఎప్పటికో మళ్లీ నిద్రప ట్టింది కార్తీక్‌కు.

ఎనిమిది గంటలు కావస్తోంది ఉదయం. మంచి నిద్రలో ఉన్నాడు కార్తీక్. లేపదల్చు కోలేదు రేవతి. పాపని రెడీచేసి స్కూలుకు పంపేసింది. తను స్నానం అదీ కానిచ్చి పూజ చేసుకుంది. టిఫిన్ రెడీ చేసి హాట్ ప్యాక్‌లో పెట్టి వంట ప్రయత్నంలో పడింది.

ఎలాగయినా కార్తీక్‌ని ఒప్పించి కనీసం వారం పది రోజులయినా ప్రశాంతంగా గడి పి రావాలి ఎక్కడయినా. ఈమధ్య కాలంలో మరీ నలిగిపోయాడు కార్తీక్. అసలు తామిద్దరూ హాయిగా ప్రశాంతంగా గడిపి ఎన్నాళ్లయిందో. ఈ కోర్టులూ కేసులూ చాలవన్నట్లు ఎక్కడి గొడవలూ తనకే కావాలి. మనిషి ఎంత డల్‌గా వీక్‌గా అయిపోయాడో! తను గొడవ పెట్ట యినా సరే ఒప్పించాలి. ఎక్కడకు... ఆ తిరుపతి మొక్కు ఎలాగూ ఉందిగా. పుణ్యం పురుషార్థం రెండూ దక్కుతాయి.

....

"రేవతీ టైమెంతయింది" కళ్లు తెరవకుం డానే కాబోలు అడుగుతున్నాడు మగతగా.

"తొమ్మిదిన్నర"

"మైగాడ్... నీకసలు బుద్ధుందా. ఎందుకు లేపలేదు. ఈవేళ ముఖ్యమైన కేసొకటి ఉంది హియరింగుకు" ఒక్క ఉదు టున మంచం దిగుతూ కేకలేశాడు కార్తీక్.

"హియరింగూ లేదు చెవి రింగూ లేదు. చక్కగా ఓ వారం సెలవు పెట్టకూడదూ! ఎంచక్కా తిరపతి వెళ్లొద్దాం"

"నాలుగు రోజులు ఇలా లేస్తే తిరుపతి వెళ్లకుండానే క్షవరం అయిపోతాయి కేసు లన్నీ. అసలు నీకేమయింది ఎందుకు లేప లేదు" హడావుడిగా బ్రష్ చేసుకుని స్నానం అదీ కానిచ్చేశాడు కార్తీక్.

టిఫిన్ తినకుండా ఎక్కడ వెళ్లిపోతాడో అని మారు మాట్లాడకుండా టిఫిన్ ప్లేటులో తెచ్చేసింది రేవతి.

"తర్వాత మాట్లాడుకుందాం. సీయూ రా" హడావుడిగా వెళ్లిపోయాడు కార్తీక్.

కోర్టు దగ్గర కారు దిగి హడావుడిగా లోప లకు వెళ్లబోతున్న కార్తీక్‌ను ఎవరో పిలిచిన ట్లయి ఆగి చూశాడు. ఎవరో తనెప్పుడూ

చూడని వ్యక్తులిద్దరు తనకేసే వస్తూ కని పించారు. ఆగమని సైగ చేశారు.

'అసలే ఆలస్యమయిందని కంగారు పడు తుంటే ఇదెక్కడి గోలరా బాబూ' మనసు లోనే అనుకున్నాడు కార్తీక్.

"ఎవరు మీరు? నాతో ఏం పని? నాకు కొంచెం అర్జంటుగా వెళ్లాల్సిన పని ఉంది. తరువాత కలుద్దామా" మర్యాదగా అడిగాడు కార్తీక్.

"లేదు సార్! ఇప్పుడే మీతో కొంచెం మాట్లాడాలి. ప్లీజ్" అడిగాడు అందులో ఒకడు.

"సరే... త్వరగా చెప్పండి" వాచ్ చూసు కుంటూ అన్నాడు.

"సూటిగా విషయానికొస్తున్నా! ఈవేళ వాదించబోయే కేసులో నిందితుడు రామ కృష్ణ మా బావమరిది"

"ఎవరు, భార్యని హత్య చేసిన కేసులో అరెస్టయినతనా"

"అవును అతను హత్య చెయ్యలేదు. ఇద్దరూ బాగా గొడవపడ్డారు. అతను కొట్టాడు. ఆ పెనుగులాటలో ఆ అమ్మాయి వెలుగుతున్న గ్యాస్ స్టవ్‌మీద పడి అంటు కుని కాలి చచ్చిపోయింది. మా వినోద్ కావాలని హత్యచెయ్యలేదు. దయచేసి మీరు ఆ కేసు..."

"స్టూపిట్" అతికష్టంమీద కోపాన్ని కంట్రోలు చేసుకుంటూ అన్నాడు కార్తీక్. 'ఆ అమ్మాయి కావాలని ఆత్మహత్య చేసుకుంది. నాకేం తెలియదు' అని ఇప్పటిదాకా అన్నారు. కానీ అతనే హత్య చేశాడనడానికి తగిన సాక్ష్యాధారాలు దొరకడంతో ఇప్పుడు ఇలా. ఛ.. ఛ ఎందుకిలా మృగాల్లా మారి పోతున్నారు. ఇప్పుడీ కేసులోంచి బయటప డిపోతే మళ్లీ బోలెడంత కట్నంతో ఇంకొక రిని పెళ్లాడి వాళ్లనూ వేపుకు తినొచ్చు థాంక్యూ... ఒకరకంగా మీరు నాకు మేలు చేశారు. నాతో ఇలా మాట్లాడి మీ నేరం మీరే ఋజువుచేసుకున్నారు. మీ గొయ్యి మీరే తవ్వుకున్నారు. థాంక్యూ వెరీమచ్" చరచరా ముందుకెళ్లిపోయాడు కార్తీక్.

"నే... చెప్పానా వాడొట్టి కరోడా మన ఎత్తులేం పారవు అని. అనవసరంగా అడిగాం. ఇప్పుడు వీడు మరీ రెచ్చిపోతాడు" చాలా కోపంగా అన్నాడొకడు.

"ఏడిశాడు. రెచ్చిపోతే చచ్చిపోతాడు. పోదాం పద లోపలికి" ఇద్దరూ లోపలికి వెళ్లేసరికి వాదన ప్రారంభం అయింది.

"యువరానర్ నా క్లయింటు రామకృష్ణ భార్యనెంతో ప్రేమించేవాడనీ సంస్కారవం తుడనీ ప్రమాదవశాత్తు ఆమె వెలుగుతున్న స్టవ్‌మీద పడటం చేతనే ఈ ప్రమాదం సంభవించి ఆమె మరణించిందనీ తెలుపు తున్నాను. కోర్టువారు మరో విషయం గ్రహించాలి. రామకృష్ణ ఆమెను ప్రేమించి ఆమెకోసం తన వాళ్లనందరినీ వదులుకుని మరీ ఆమెను పెళ్లి చేసుకున్నాడు. అలాం టిది తన భార్యని తనే ఎందుకు చంపుకుం టాడు యువరానర్. అదీగాక ఆ సమ యంలో నా క్లయింట్ రామకృష్ణ అక్కడ లేడు"

"ఎనీ క్రాస్ ఎగ్జామినేషన్" జడ్జి కార్తీక్‌ను అడిగాడు.

"ఎస్ యువరానర్. నేను నిందితుడు రామకృష్ణను క్రాస్ ఎగ్జామిన్ చెయ్యడానికి అవకాశం కోరుతున్నాను"

"ఎస్ ప్రొసీడ్"

"మీ పేరు"

"ఎన్నిసార్లు అడుగుతారు" కోపంగా అన్నాడు.

"ఎన్నిసార్లు చెప్పినా మీ పేరు అదేగా... చెప్పండి"

"నా పేరు రామకృష్ణ... రామకృష్ణ"

"చాలు చాలు.. మీరు మీ భార్యని ప్రేమించి పెళ్లి చేసుకున్నారా? "

"ఆ అవును"

"ఎప్పుడు? ఎక్కడ? "

"పోయిన సంవత్సరం రిజిస్ట్రార్ ఆఫీ

సులో, హైదరాబాద్‌లో"

"అబద్ధం... పోయిన ఏడు మీరు అసలు హైదరాబాద్‌లో లేరు. అసలు చెప్పాలంటే మీకు పెళ్ళేకాలేదు"

"మా పెళ్లి జరిగిన రిజిస్ట్రార్ ఆఫీసు వాళ్లిచ్చిన మ్యారేజ్ సర్టిఫికెట్ ఇదిగో" అసలు పెళ్లే కాలేదంటున్నాడు ఈయన ఎక్కడ దొరికాడ్రా బాబూ అనుకున్నాడు.

"ఈ సర్టిఫికెట్ నిజమే. పెళ్లి జరగడమూ నిజమే. కానీ నీకు మాత్రంకాదు. యువరానర్ ఇతను అసలు రామకృష్ణ కాదు"

"వ్వాట్" అదిరిపడ్డాడు జడ్జీ, తోటి లాయర్స్. కోర్టులో ఒకటే కలకలం.

"యస్ యువరానర్. ఇతని అసలు పేరు వినోద్. చదువు అబ్బక చచ్చీచెడీ ఎలాగో ఇంటర్ అయిందనిపించాడు. ఇతనికి లేని వ్యసనం లేదు. చక్కటి రూపం. మంచి మాటకారితనం ఇతని ఆస్తి. ఇతను ఉద్దేశ్య పూర్వకంగా ఆ అమ్మాయి జీవితంలో ప్రవేశించి తెలివిగా ఆమెను ట్రాప్ చేసి వలలో వేసుకుని ఆమె సాయంతోటే ఆమె భర్త అయిన రామకృష్ణను వెడుతున్న ట్రైన్ లోంచి కిందకు నెట్టేసి ఆ అడ్డు తొలగించుకున్నాడు. చాలా తెలివిగా అంతకుముందే రామకృష్ణ చేత ట్రాన్స్‌ఫర్‌కు అప్లయి చేయించి ఉండటంతో అతనికి హెల్త్ గ్రౌండ్స్ మీద ట్రాన్‌ఫర్ కావడం... ఆ గ్రౌండ్స్ మీదే ఇన్ ఆబ్సెన్స్‌లో రిలీవ్ అయి ఇతను రామకృష్ణగా ఇక్కడ అతని జాబ్‌లో చేరడం జరిగింది. అతని ముఖ్యోద్దేశం అదే మంచి ఉద్యోగంలో చేరడం అనేది. అది నెరవేరిన తర్వాత ఆ అమ్మాయి అవసరం తీరాక ఇంక తనకి ఆమె అనవసరం అనీ ఎప్పటికయినా ఆమె ఉనికి తనకు ప్రమాదమనీ ఎంచి చాలా తెలివిగా ఆమెను అడ్డు తొలగించుకున్నాడు యువరానర్. ఇప్పుడు ఇతని మీద ఒకటికాదు. రెండుకాదు మూడు నేరాలున్నాయి యువరానర్. చీట్ చేసి వేరొకరి ఉద్యోగంలో చేరడం ఒకటి, చాలా తెలివిగా అసలు రామకృష్ణను ఏక్సిడెంట్ అనుకునేలా హత్యచెయ్యడం రెండు, అన్నింటికంటే అమానుషం హాయిగా భర్తతో సంసారం చేసుకుంటున్న అమ్మాయిని ట్రాప్ చేసి మాయమాటలు చెప్పి ప్రేమ మత్తులో ముంచి తన అసలు పని పూర్తయ్యాక ఆమెనే అమానుషంగా హత్య చెయ్యడం"

"వెరీగుడ్, లెర్నడ్ ఫ్రెండ్ చాలా తెలివిగా కొత్తకథనాన్ని సృష్టించారు. అసలు మనిషే రామకృష్ణకాదు, పెళ్లి ఇతనిదికాదు, భార్య ఇతనిదికాదు, అసలు టోటల్‌గా మనిషే ఇతను అతను కాదు అంటూ. చాలా థ్రిల్లింగ్ స్టోరీ. డిటెక్టివ్ స్టోరీ లెవెల్లో చెప్పారు. కోర్టుకు కావలసింది, కోర్టు నమ్మేది కాకమ్మ కథలూ కల్లబొల్లి కబుర్లూ కావన్న విషయం నా లెర్నడ్ ఫ్రెండ్ మర్చిపోతున్నారు.

"ఆడలేక మద్దెల ఓటన్నట్లు అసలు కేసుని వదిలిపెట్టి ప్రమాదవశాత్తు జరిగిన ఘోరకలిని హత్య హత్య అంటూ యాగీ చెయ్యడమేకానీ సాక్ష్యాధారాలు తెలీక, అయినా నా వెర్రిగానీ జరగని హత్యకు సాక్ష్యాలు తేవడం ఈయనకు కాదు ఈయనను పుట్టించిన ఆ జేజమ్మకు కూడా సాధ్యం కాదు. అందుకనే కేసుని ఇష్టమొచ్చినట్లు మలచడానికి కృషి చేస్తున్నారు. అలా ఎలాబడితే అలా చెయ్యడానికి ఇదేం టెక్నికలర్ సినిమా కాదని గుర్తుంచుకోవాలి. కోర్టువారి అమూల్యమైన కాలాన్ని వృథా చేసే ప్రయత్నాన్ని కోర్టువారు గ్రహించాలి"

"అబ్జెక్షన్ యువరానర్. నేపలికిన ప్రతి మాటా యదార్థగాథే కానీ కల్పిత కథ కాదనీ వాటికి అవసరమైన సాక్ష్యాధారాలు నా దగ్గర ఉన్నాయని, కోర్టువారు అనుమతిస్తే అవి ప్రవేశపెట్టడానికి తయారుగా ఉన్నాననీ తెలియచేసుకుంటున్నాను"

"ఎస్, ప్రొసీడ్" జడ్జి అనుమతించారు.

"యువరానర్ ఇతను అసలు రామకృష్ణ

కాదు. వినోద్ అని నిరూపించడానికి ప్రత్య క్షసాక్షి రామచంద్రని ప్రవేశపెట్టమని కోరు తున్నాను.

"మిస్టర్ రామచంద్ర... రామచంద్ర... రామచం...

"మీ పేరు"

"రామచంద్ర"

"భగవంతుని మీద ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను.. అబద్ధం చెప్పను"

"భగవంతుని మీద ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను. అబద్ధం చెప్పను.

"మీరు అతనిని ఎప్పుడైనా చూశారా? మీకు అతను తెలుసా" నిందితుని చూపిస్తూ అడిగాడు కార్తీక్.

"తెలుసు"

"ఎలా తెలుసు? ఐమీన్ రామకృష్ణ గానా.... వినోద్‌గానా"

"వినోద్‌గానే"

"ఐ అబ్జక్ట్ యువరానర్. ఏదో దురుద్దే శంతో క్రియేట్ చేసిన సాక్షి అతను. ఈ సాక్ష్యం చెల్లదు" అరిచేడు ప్రతివాది లాయర్.

"యువరానర్.. అసలు సాక్షిని ప్రశ్నించ కుండా సాక్ష్యం చెప్పనీకుండా అడ్డుపడి అవ మానించినందుకు గౌరవనీయులైన లాయ ర్‌గారు మూల్యం చెల్లించాల్సి వుంటుందని హెచ్చరిస్తున్నాను" హుంకరించాడు కార్తీక్.

"అబ్జక్షన్ వోవర్‌రూల్డ్. మీరు కంటిన్యూ చెయ్యండి లాయర్ కార్తీక్" జడ్జి చెప్పారు.

"థాంక్యూ యువరానర్"

"ఆ మిస్టర్ రామచంద్ర... మీకు ఇతను ఎలా తెలుసు. ఎప్పుడు తెలుసు. కాస్త వివ రంగా చెబుతారా? "

"ఇతను నాకు వినోద్‌గానే తెలుసు. అసలు రామకృష్ణ ఎవరో ఇతనెందుకు అలా మారాడో నాకు తెలియదు. ఇతను ఈ వినోద్ ఒకప్పటి నా క్లాసమేట్. మేం ఇద్దరం ఇంటర్ ఒకే కాలేజీలో ఒకే సెక్ష న్‌లో చదివాం. నేను ఇంటర్ అయింత ర్వాత బికాం చదివి బ్యాంక్ ఎగ్జామ్స్‌రాసి బ్యాంక్‌లో జాబ్ చేస్తున్నాను. ఇతను ఇంటర్ పరీక్ష పోయి ఇల్లు వదిలివెళ్లి పోయాడన్నారు. తర్వాత మళ్లీ ఇదే చూడటం. మొన్న బ్యాంకుకు వచ్చినప్పుడు గుర్తుపట్టి పలకరించబోతే తనని కానట్లు నన్ను గుర్తుపట్టనట్లు వెళ్లిపోయాడు"

"అతను వినోద్ అవడానికి మీ దగ్గర ఏమైనా సాక్ష్యం, ఆధారాలు ఉన్నాయా"

"ఉంది సార్! మేం కాలేజ్ నుండి విడి పోయేటప్పుడు కలిసి తీసుకున్న గ్రూప్ ఫొటోలో అతను ఉన్నాడు సార్"

"మీకు వాళ్ల కుటుంబసభ్యులు లేక ఇంకా ఎవరైనా ఫ్రెండ్స్ ఐ మీన్ కామన్ ఫ్రెండ్స్ వున్నారా? మీకు తెలిసి పరిచయం ఉండి"

"కుటుంబ సభ్యులంటే ఏదో ఒకసారి వాళ్లింటికెళ్లాకానీ ఎవరూ గుర్తులేరు సార్! కానీ మాతో బాటే కలసి చదివిన ఒకరిద్దరి ఫ్రెండ్స్ వుండాలి. మరి వాళ్లిప్పుడు ఎక్కడ ఉన్నారో"

"ఎగ్జిబిట్ నెంబర్ ఒన్‌గా ఆ గ్రూప్ ఫొటో..." కోర్టు అమీన్ కవర్‌లో వున్న ఆ ఫొటో జడ్జిగారికి అందించాడు.

"దట్సాల్ యువరానర్" కూర్చున్నాడు కార్తీక్.

"ఎనీ క్రాస్‌ఎగ్జామినేషన్? " జడ్జి లాయర్ విశ్వనాధ్‌ను అడిగాడు.

"ఎస్ యువరానర్"

"మీ పేరు"

"రామచంద్ర"

"ఏం చేస్తుంటారు"

"బ్యాంక్‌లో క్యాషియర్‌గా"

"మీ సర్వీస్ ఎన్నేళ్ళు? "

"ఆరేళ్ళు"

"మీరు ఇంటర్ ఏ సంవత్సరంలో చది వారు. చెప్పగలరా? "

"వై నాట్? నైన్‌టీ వన్... నైన్‌టీ త్రీ..."

"అంటే సుమారు పది సంవత్సరాలన్న మాట. పది సంవత్సరాల కిందట మీ క్లాస్‌మేట్. ఆ తర్వాత ఒక్కసారీ చూడకుండా మీకు అంత బాగా ఎలా గుర్తున్నాడు. ఎలా గుర్తుపట్టగలిగారు. మీ ఫ్రెండ్... ఐ మీన్... మీ క్లాస్‌మేట్ ఆ పోలికలు కొన్ని ఉన్న వేరే అతను కావచ్చుకదా ఇతను"

"కాదు... ఖచ్చితంగా అతనే. నేను మన స్ఫూర్తిగా నమ్మకపోతే సాక్ష్యం ఇవ్వడానికి రానుకదా"

"ఎవరైనా బలవంతం చేసి మీచేత ఇలా సాక్ష్యం చెప్పించవచ్చుకదా" ఓరగా కార్తీక్‌ను చూస్తూ అన్నాడు విశ్వనాథ్.

"కాదు... నాచేత బలవంతంగా ఎవరూ చెప్పించనూలేరు. ఒకవేళ అలా అడిగినా నేను చెప్పనూ చెప్పను. అతను ఖచ్చితంగా వినోదే"

"అంత ఖచ్చితంగా ఎలా చెబుతున్నారు?"

"అతని మొహంమీద... ఎడమ బుగ్గ మీద వున్న ఆ స్కార్ గుర్తు. నాకు ఇంకా బాగా గుర్తుంది ఆ సన్నివేశం. ఆ గాయం ఎలా అయిందో ఎప్పుడయిందో?"

"ఐ... అబ్జక్ట్ యువరానర్. లెర్నడ్ ఫ్రెండ్, సాక్షిని, సాక్ష్యాన్ని అనుమానించి అవమానిస్తున్నారు"

"అబ్జక్షన్ సస్టైన్‌డ్. లాయర్ విశ్వనాథ్ మీ అనుమానాలేమైనా వుంటే అడగండి. అంతేకానీ సాక్ష్యాన్ని, సాక్షినీ అవమానించి అవహేళన చేయకూడదు" హెచ్చరింపుగా అన్నాడు జడ్జి.

"సారీ యువరానర్"

"ఆ... మిస్టర్ రామచంద్ర! ఆ గాయం గురించి మీకు బాగా గుర్తున్నారు. ఎప్పుడు ఎలా జరిగిందో చెబుతారా?"

"మేం ఇంటర్ చదివేరోజుల్లో. సహజంగానే మా అందరికీ క్రికెట్ పిచ్చి బాగా వుండేది. మేం మాచ్ ఆడుతుండగా వికెట్ కీపర్‌గా ఉన్న వినోద్‌కు ప్రమాదవశాత్తూ క్రికెట్ బాల్ ముఖంమీదకు వెడుతుండగా అతను చాలా షార్ప్‌గా తప్పుకున్నాడు. అయినా ఆ వేగానికి బంతి రాసుకెళ్ళి బుగ్గ మీద చీరుకుపోయింది. కుట్లు కూడా పడ్డాయి. ఆ దెబ్బతో మేం చాలారోజులు ఆ ఆట జోలికి కూడా వెళ్ళలేదు" వివరించాడు రామచంద్ర.

"నో... నేను చెట్టు ఎక్కుతున్నప్పుడు జారి చీలిపోయింది. అసలు ఇతనెవరో, ఇలా ఇదంతా ఎందుకు చెబుతున్నాడో నాకు తెలియదు. నన్ను నమ్మండి" కీచుగా అరిచాడు రామకృష్ణ.

"ఆర్డర్... ఆర్డర్. ఇంకా మీరడిగేది ఏమైనా ఉందా లాయర్ విశ్వనాథ్"

"నో... యువరానర్. ఓవర్" అని వెళ్ళి కూర్చున్నాడు విశ్వనాథ్.

"అతను వినోద్ అనడానికి నా దగ్గరున్న మరో సాక్ష్యం. ఎగ్జిబిట్ నెంబర్ టూ"

జాగ్రత్తగా జేబులోంచి ఒక కేసెట్ తీసి కవరులో ఇచ్చాడు కార్తీక్.

"సాధారణంగా ఆడియో, వీడియో కేసెట్స్ సాక్ష్యాలుగా అంగీకరించనప్పటికీ దీనికి సంబంధించిన ప్రత్యక్ష సాక్షులను ముందుగా కోర్టులో ప్రవేశపెట్టడానికి అనుమతి కోరుతున్నాను"

"ఎస్... ప్రొసీడ్"

కార్తీక్ అక్కడున్న పోలీస్ ఎస్కార్ట్‌ను పిలిచి వాద ప్రతివాదనలు వింటున్న జనంలోంచి ఎవరినో చూపించి వాళ్ళను తీసుకురమ్మని మెల్లిగా చెప్పాడు. ఏం జరుగుతోందో, ఎవరిని తీసుకురమ్మంటున్నాడో తెలియక అయోమయంగా తన లాయర్ కేసి చూశాడు నిందితుడు.

పోలీసు తమకేసి రావడం చూసి కంగారుపడి మెల్లిగా జారుకోబోయిన ఆ ఇద్దరినీ పట్టుకుని బోనులోకి తెచ్చాడు పోలీస్.

"మీ పేరు?"

చెప్పారిద్దరూ.

"మీకు అతను తెలుసా? " నిందితుడిని చూపిస్తూ అడిగాడు కార్తీక్.

అసలు తమనెందుకు పిలిచాడో అర్థంకాక ఏం మాట్లాడితే ఏం తంటా వస్తుందో అనుకుంటూ తెలుసు అన్నట్లు తల ఆడించారు.

"అలా కాదు... నోటితో చెప్పండి"

"తెలుసు"

"ఎలా తెలుసు. ఏం అవుతాడు మీకు? "

"ఎలా తెలుసేంటి? ఆడు నా బామ్మర్ది" ఇద్దరిలో ఒకడన్నాడు.

"ఊహూ... అతని పేరేమిటి? "

"ఓస్... పేరా... వి... రామకృష్ణ" తడబాటుగా అన్నాడు.

"ఆ ప్రశ్న... ఎన్నిసార్లు ఎంతమందిని అడుగుతారు" కోపంగా అన్నాడు ఇంకోడు.

"ఎవర్ని ఎన్నిసార్లు అడిగితేనేం. నిన్ను ఇప్పుడేగా అడిగింది. చెప్పు అతని పేరు వి. రామకృష్ణా? "

"నేను వి. రామకృష్ణ అనలేదు. జి. రామకృష్ణ అన్నాను" నిర్లక్ష్యంగా చెప్పాడు.

"ఆహా... అన్నట్లు మీరిద్దరూ నన్ను ఇంతకుముందు ఎప్పుడైనా చూశారా? నాకు మిమ్మల్ని ఎక్కడో చూసినట్లూ, మీ గొంతు విన్నట్లూ ఉందే"

"మేం మిమ్మల్ని ఇప్పుడే, ఇదిగో ఇదే చూడడం. ఇంక మాట్లాడడం ఎక్కడ. ఏరా..." కనఫర్మేషన్‌కోసం తోటివాడినడిగాడు మొదటివాడు.

"అహా..." అంటూ జేబులోంచి మినీ టేప్‌రికార్డర్ తీశాడు.

అది ఫారెన్‌దిలా వుంది. చాలా చిన్నగా పెద్దసైజు అగ్గిపెట్టెలా వుంది. బటన్ నొక్కి అందులోంచి కాసెట్ తీశాడు. "ఇది ఖూడా నా ఎగ్జిబిట్ నెంబర్ త్రీ... సర్. ఇప్పుడు మీరు ఇందాక నే పంపిన కేసెట్ ఈ కేసెట్ ప్లే చేసి వింటే జరిగింది, నిజం ఏమిటన్న ది మీకే అర్థమవుతుంది. మీరు ముందుగా ఎగ్జిబిట్‌నెంబర్ త్రీ వినండి"

కోర్టు అమీన్ అది జాగ్రత్తగా జడ్జిగారికి అందచేశాడు మినీ టేప్‌రికార్డర్‌తో సహా.

జడ్జిగారు టేప్ ఆన్ చేశారు. అందులో అంతకుముందు కోర్టులో లాయర్ కార్తీక్‌కు... బోన్‌లో ఉన్న ఆ ఇద్దరి సాక్షులకు మధ్య జరిగిన సంభాషణ అంతా రిపీట్ అయింది.

"యువరానర్... జాగ్రత్తగా విన్నారు కదా... ఇప్పుడు ఎగ్జిబిట్ నెంబర్ టూ వినండి. నిజం మీకే తెలుస్తుంది."

"ఎవరు... భర్తని హత్యచేసిన కేసులో అరెస్టయినతనా? "

"అవును, అతను హత్య చెయ్యలేదు. ఇద్దరూ బాగా గొడవపడ్డారు. అతను కొట్టాడు. ఆ పెనుగులాటలో ఆ అమ్మాయి వెలుగుతున్న గ్యాస్‌స్టౌ మీద పడి కాలి చచ్చిపోయింది. మా వినోద్ కావాలని హత్య చెయ్యలేదు. దయచేసి ఆ... కేసు..."

"స్టాపిట్... ఆ అమ్మాయి కావాలని ఆత్మహత్య చేసుకుంది, నాకేం తెలియదని ఇప్పటిదాకా అన్నారు. కానీ అతనే హత్య చేశాడనడానికి తగిన సాక్ష్యాధారాలు దొరకడంతో ఇప్పుడిలా.... ఛ...ఛ ఎందుకిలా మృగాల్లా మారిపోతున్నారు? ఇప్పుడీ కేసులోంచి బయటపడితే మళ్లీ బోలెడంత కట్నంతో ఇంకొంకరిని పెళ్లాడి.. వాళ్లనూ వేపుకుతినచ్చు"

"మీ శ్రమకు తగ్గ ఫలితం ఉంచుకోం. ఎంత చెబితే అంత..."

"షటప్... ఎంతకు తెగించారు? కోర్టు ముందే నాతో లంచం గురించి మాట్లాడ్డానికి మీకెంత ధైర్యం...."

.......

"థాంక్యూ... ఒకరకంగా మీరు నాకు మేలే చేశారు. నాతో ఇలా మాట్లాడి మీ నేరం మీరే రుజువు చేసుకున్నారు... మీ గొయ్యి మీరే తవ్వుకున్నారు. థాంక్యూ వెరీ మచ్..."

............

ఫేన్ తిరుగుతున్న శబ్దం తప్ప మొత్తం

కోర్టంతా ఒక్కసారిగా కామ్ అయిపో యింది. సడన్‌గా జడ్జి క్లాప్స్ కొట్టడం మొద లుపెట్టారు. సీనియర్ లాయర్స్.... తరు వాత కూర్చుని చూస్తున్న జనం అంతా రిథ మిక్‌గా క్లాప్స్....

"వెల్‌డన్ మిస్టర్ కార్తీక్! వెల్‌డన్. ఇప్పుడు మనందరి సమక్షంలో జరిగిన సంభాషణలోని గొంతులూ.... ఎక్జిబిట్ నెంబర్ వన్‌లోని స్వరాలూ ఒకటేనని కోర్టు విశ్వసిస్తోంది. అదీగాక ఆ సంభాషణలో మొదట రామకృష్ణ అని సంబోధించిన ఆ గొంతు, రామకృష్ణను తన బామ్మర్దిగా చెప్పిన ఆ గొంతు... వెనువెంటనే 'మా వినోద్ కావాలని హత్య చెయ్యలేదు' అన్నదే అతను రామకృష్ణ కాదు, వినోద్ అన్నదానికి సాక్ష్యం.

కానీ నిందితుడు మారుపేరుతో వేరొకరి ఉద్యోగం అది కూడా ప్రభుత్వ ఉద్యోగంలో చేరడమేకాక దిగ్విజయంగా సుమారు సంవ త్సరం పైగా ఎటువంటి అనుమానాలకూ తావివ్వకుండా చేశాడంటే అదే నమ్మశక్యం గా లేదు. క్లియర్‌కట్ పిక్చర్‌కోసం నింది తుడి డిపార్ట్‌మెంటల్ ఎంక్వయిరీకి ఆదేశా లిస్తున్నాను. అంతవరకూ నిందితుడిని రిమాండులోకి పంపిస్తున్నాం"

"యువరానర్... వేరొకరి ప్లేసులో మారుపేర్లతో ప్రభుత్వోద్యోగం చెయ్యడం అనే విషయం కొత్తేంకాదు. అలాంటి సంఘ టనలు ఈమధ్యకాలంలోనే కొన్నిచోట్ల జరి గాయి అని మనవి చేస్తున్నాను. డిపార్ట్ మెంటల్ ఎంక్వయిరీ ఆదేశాలకు చాలా సంతోషంగా ఉంది యువరానర్. ఇంక నిందితుడు నూటికి నూరుశాతం చట్టంచే తిలో చిక్కినట్లే. అన్యాయాలు, అక్రమాలు, నేరాలు, ఘోరాలు చేసినవారెవ్వరైనా ఎంతటి ఘనులైనా చట్టం దృష్టిలో పడితే తప్పించుకుపోలేరన్నది మరోసారి రుజు వైంది. థ్యాంక్యూ యువరానర్. థ్యాంక్యూ వెరీమచ్"

"చట్టానికి కావలసినవి సాక్ష్యాలు, ఆధా రాలు. అవి సంపాదించగలిగితే లాయ ర్లంతా మీలా చిత్తశుద్ధితో కృషిచేసి న్యాయాన్ని గెలిపించడానికి, అన్యాయాల్ని అణిచేయడానికి పాటుపడితే సాధ్యం కానిదంటూ ఏం ఉండదు మిస్టర్ కార్తీక్"

"ద కోర్ట్ ఈజ్ ఎడ్జర్న్‌డ్" జడ్జిగారు లేచి వెళ్ళడానికి ఉద్యుక్తులయ్యారు.

కోర్టు హాలులోని జనం, ప్రెస్ అంతా గబగబా కార్తీక్‌ను చుట్టుముట్టి అభినందన లతో ముంచెత్తారు.

"మిస్టర్ కార్తీక్... ఈమధ్యకాలంలో మీరు చేపట్టిన కేసులు, వాటి విజయం చూస్తుంటే తెలుస్తోంది, మీరెంత సత్తా కల లాయర్ అనేది. మీరు కేసు స్టడీ చేసి డీల్ చేసే పద్ధతే చాలా వెరైటీగా, సూటిగా, విజ యానికి రాజమార్గంలా వుంది. ఈ సక్సెస్ వెనకాల రహస్యం... ఏదైనా ఉందా? "

"వుంది. కేసుగెలవాలి అనుకునేముందు నేను అనుకునేది, చూసేది ఆ కేసులో వున్న న్యాయాన్యాయాలు. దానినిబట్టే నేను కేసు తీసుకుంటాను. అలాగే ప్రొసీడ్ అవు తాను"

"అంటే మీరనేది... కేవలం న్యాయం మీ పక్షాన ఉంది కాబట్టే మీ కేసులు విజయ వంతంగా గెలుస్తున్నాయి అంటారా? "

"అలా అనను. న్యాయం ఎటువైపు వుందో అటు గెలవడానికి... అన్యాయానికి శిక్షపడడానికి ఇది త్రేతాయుగమూ, ద్వాపర యుగమూ కాదు. కలియుగం. ఇక్కడ న్యాయం, అన్యాయం, ధర్మం, అధర్మం కంటే ముందుగా డబ్బు, పలుకుబడి, దాదా గిరీ, దౌర్జన్యం రాజ్యమేలుతుంటాయి. అయితే ఒక్కమాట ఎంతటి కొమ్ములు తిరి గిన నేరస్తుడయినా ఎక్కడో ఒకచోట తన అకృత్యాలకు ఆనమాలు వదిలిపెడతాడు. మనం ఆ కోణంలో ముందుకు సాగితే తప్పకుండా న్యాయానికి చేరువవుతాం"

"ఇప్పుడు ఈ కేసులో నిందితుడి నేరం

నిరూపించబడి శిక్ష పడుతుందంటారా. ఇంకా జడ్జిమెంట్ యివ్వలేదు కనుక ఏమైనా గోల్ మాల్ జరిగే అవకాశం వుందా?"

"ఇంతవరకూ వచ్చాకా వాదోపవాదాలన్నీ అయ్యాకా గోల్ మాల్ అవదనే అనుకుంటు న్నాను. నేరం అన్నివిధాలా ధృవీకరించబ డింది. కేవలం డిపార్ట్‌మెంటల్ ఎంక్వయిరీ మిగిలి వుంది. అది సరిగ్గా జరిగితే కేసు నెగ్గినట్టే"

"ఈ విజయాలకు మీరు ఆనందిస్తు న్నారా?"

"ఎంతమాత్రం లేదు. నాగరికత ముసు గులో ఎంతమంది పైశాచికంగా వికృతంగా, అమానుషంగా ఉంటున్నారో చూసేకొద్దీ నా హృదయం ముక్కలౌతోంది. అందరిలోనూ కనీస మానవత్వం వెల్లివిరిస్తే ఇన్ని కోర్టులూ, కేసులూ, లాయర్లూ, ఏమీ అక్క రలేదు"

"ప్రతిసారీ మీరు చాలా ఎమోషనల్‌గా ఫీలవుతున్నారంటాను... దీనికి మీరేమం టారు?"

"అలా అవగలగడం నా అదృష్టం అంటాను. ఇంకా నాలో ఆ మాత్రపు స్పందన మిగిలి ఉంది అన్న ఆలోచనే అమృతప్రాయమంటాను. ఎవరెలాగ పోతే నాకేం.. నేనూ నా కుటుంబం సుఖంగా సంతోషంగా ఉన్నాం చాలు అనే ఆలోచనే మృతప్రాయం"

"మీరు కలకాలం కరప్ట్ కాకుండా న్యాయ దేవతకు బాసటగా ఉండి అభాగ్యులకు న్యాయం చేకూర్చాలని ఆశిస్తున్నాం"

"థ్యాంక్యూ వెరీమచ్"

పేపర్లు, టీవీలు... ఎక్కడ చూసినా ఈ సంచలనవార్తే ముఖ్యవార్త అయి కూర్చుంది. అందరూ కార్తీక్‌ను పొగిడే వారే. అయినా కార్తీక్‌లో మాత్రం ఏ ఆనందం, ఏ భావం లేవు. నిర్వికారంగా అసలు దేశం, ప్రజలు ఎందుకు ఇలా తయారు అవుతున్నారు అన్న వేదన... ఆ ఒకే ఒక ప్రశ్న.

"కార్తీక్... చూశారా. మీ విజయ సంకీ ర్తన ఎలా మారుమోగిపోతోందో" ఆనం దంగా అంది రేవతి.

"ఊ..." పేపరు చదువుతూ అన్నాడు.

"ఏమిటి ఊ... నేనింత ఆనందంగా ఆనందాన్ని నీతో పంచుకోవాలనుకుం టుంటే" చేతిలో పేపరు లాగేసింది రేవతి.

"ఎందుకు ఆనందం. నేరం చేసినవాడికి శిక్ష పడటమా, అంతకంటే అసలు నేరమే జరగకపోతేనే నాకు ఆనందం. ఎంతో ప్రగతి సాధించాం అని గొప్పలు పలు కుతూ, ఉన్నతి సాధించాం అని బీరాలు పోతూ, ఎక్కడచూసినా అన్యాయం, అరాచ కత్వం"

"అయ్యో గౌతమబుద్ధా... అవి జరగ కుండా చూడడమనేది మన చేతిలో లేదు. మనకు చేతనైనంతవరకూ న్యాయానికి న్యాయం చెయ్యాలని చూడాలంతే. కానీ..."

"ఏముంది దానిలో. నేను ఈ కేసు వాదించాను. గెలిచాను. కానీ అన్యాయంగా కుట్రకు బలయి హత్య చేయబడ్డ రామకృష్ణ బతికి బట్టకడతాడా. లేక పర వ్యామో హంలో తాత్కాలికమైన మోహావేశానికి ఆక ర్షింపబడి కట్టుకున్నవాడికి అన్యాయంచేసి తనూ అన్యాయం అయిపోయిన ఆ అమ్మాయి అదే రామకృష్ణ భార్య బతికి వస్తుందా? ఏమిటి నేను సాధించినది. కాక పోతే నేరం చేసినవాడికి మళ్ళీ ఇప్పట్లో అటువంటి అవకాశం లేకుండా శిక్ష పడడం. అంతేగా...

"బాగుంది వరస. మీ వృత్తిధర్మం మీరు చేశారు. ఒక డాక్టర్ ప్రాణాలమీదకొచ్చిన రోగిని కాపాడాలని శతవిధాల ప్రయత్ని స్తాడు. ఒకవేళ ఆ రోగి ఖర్మ కాకపోతే అసలు వాడికా రోగం ఎందుకు రావాలి. వాడెందుకలా అర్థాంతరంగా చావాలి అని కృంగిపోతే ఇక తన వృత్తినెలా చెయ్యగ

లడు. ఒక చావు కళ్ళారా చూస్తే సామాన్య మానవుడికి అయ్యో అనిపించి హృదయం కకావికలమైపోతుంది. అదే ఓ డాక్టర్, ఓ పోలీస్, ఓ లాయర్ అలా ఫీలయితే ఇంక వారు ఆ వృత్తులు ఎలా చెయ్యగలుగుతారు. మనకు చేతనైనంతవరకూ అన్యాయమైపోయిన వాళ్ళకు న్యాయం చెయ్యడానికి పోరాడాలి. అంతే కానీ జరిగే అన్యాయాలన్నిటినీ చూస్తూ క్షోభపడిపోతే ముందు మన బతుకు అన్యాయమైపోతుంది.

అయినా ఈకేసు కూడా అయిపోయిందిగా. నా మాట విని ఓ వారంరోజులు సెలవు పెట్టండి. అలా తిరుపతి వెళ్ళొద్దాం. మనసుకు శాంతి ఉంటుంది. మనిషికి కాస్త విశ్రాంతి ఉంటుంది. వచ్చే సోమవారం దశమి, చాలా బాగుంది. నేను టికెట్స్ రిజర్వ్ చేయించేస్తాను. మీరు లీవు అప్లయ్ చేయండి" అదే తన నిర్ణయం, దానికి తిరుగులేదు అన్నట్లు చెప్పి లోపలికి వెళ్ళిపోయింది రేవతి.



"నిజమే... తనకీ కాస్త విశ్రాంతి, ప్రశాంతత అవసరం. ఈ గొడవల్లో పడి తను రేవతిని, పాపని అలక్ష్యం చేస్తున్నాడు. తన పిచ్చి కానీ అసలు చాలామటుకు మానవాళి మొత్తమే అన్యాయాలకూ, అరాచకత్వానికి ప్రతీకలవుతుంటే తనలాంటి ఏ ఒక్కరో, నూటికీ కోటికీ ఒక్కరు అల్లాడిపోతే ఒరిగేదేమిటి వేదన తప్ప. రేవతి చెప్పినట్లు ఇలా బాధపడిపోవడం మానేసి తను చెయ్యగలిగిన సాయం చేసుకుంటూ పోవడమే. ఆలోచిస్తూ అలానే నిద్రపోయాడు కార్తీక్.

"రండి అంకుల్. ఆంటీని తీసుకురాలేదా?"

"లేదమ్మా. ఇదిగో నీకో సర్‌ప్రైజ్ గిఫ్ట్"

"ఏమిటంకుల్" ఇమ్మన్నట్లుగా చెయ్యి చాపింది రేవతి.

"ఊహూ... ఇప్పుడివ్వను. అన్నట్లు కార్తీక్ లేడా ఇంట్లో?"

"ఉన్నారంకుల్. పడుకున్నారు, లేపనా?"

"వద్దులే. నేనింకా ఉంటాగా. అసలు ఆయనగారు నిద్రపోవడమే గొప్ప. పడుకోనీ, బాగా అలసిపోయాడీ మధ్యన. ఏమిటి సంగతులు?"

"ప్రత్యేకంగా ఏం లేదంకుల్. మీరిలా కూర్చుని ఈ మేగజైన్ చూస్తుండండి. నేను చిటికెలో కాఫీ తెస్తా. తాగుతూ మాట్లాడుకోవచ్చు"

'అంకుల్ ఇచ్చే గిఫ్ట్ ఏమై ఉంటుంది చెప్మా' కాఫీ కలుపుతూ ఆలోచనలో పడింది రేవతి.

"ఇదిగో... తీసుకోండి అంకుల్" శంకరం గారికి ఓ కప్పు ఇచ్చి రెండోది తాను తాగుతూ కూర్చుంది.

"ఏమిటా గిఫ్ట్. చెప్పండంకుల్" సస్పెన్స్ భరించలేక అడిగింది రేవతి.

"అంత తొందరెందుకు... కార్తీక్‌ని రానీ చెప్తా..." తాపీగా అన్నాడు శంకరం.

ఏవో ఆ మాటలూ ఈ మాటలూ చెప్పు

కుంటూ కూర్చున్నారిద్దరూ... "అన్నట్లు ఈమధ్య మాలతివాళ్లని కలిశారా అంకుల్" అడిగింది రేవతి.

"ఆ... మొన్ననే వెళ్ళానమ్మా...ఎలా వుండే పిల్ల ఎలా అయిపోయిందో... నిజంగా ఆ రఘుని మెచ్చుకోవాలి. ఓపక్క చంటిపిల్ల, ఇంకోపక్క అనారోగ్యపు తండ్రి... మరోపక్క మతిస్థిమితంలేని భార్య... అన్నింటినీ మించి బాధ్యతాయుతమైన ఉద్యోగం... పాపం ఎలా సమర్థించుకు వస్తున్నాడో..."

"నిజమే... మనం ఎవరం ఉండీ ఏంచెయ్యలేకపోతున్నాం, నేను ఈమధ్య వెళ్ళనేలేదు. నాకు... నాకు కార్తీక్‌ను చూస్తే చాలా భయంగా వుంది అంకుల్. మరీ మూడీగా అవుతున్నాడు. ఈకేసులూ, గొడవలూ బాగా అప్‌సెట్ అవుతున్నాడు"

"మరీ సెన్సిటివ్‌గా వుండేవాళ్ళతో వచ్చే చిక్కు ఇదేనమ్మా... ప్రతీదీ మనసులో పెట్టుకుంటారు"



"హలో బాబాయ్, మీరా... ఎంతసేప యింది వచ్చి?" వచ్చి పక్కనే కూర్చుంటూ పలకరించాడు కార్తీక్, నన్ను లేపలేకపో యావా అన్నట్లు రేవతిని చూస్తూ.

"ఎంతోసేపు కాలేదులే... అమ్మాయితో మాటాడుతున్నాగా... ఇదిగో కార్తీక్... ఈమధ్యకాలంలో నువ్వు సాధించిన ఘనవిజయాలకు సంతోషిస్తూ... ఈ బాబాయ్ మీకిచ్చే చిన్న కానుక..." అంటూ ఓ కవర్ కార్తీక్ చేతిలో పెట్టాడు.

"ఎలాగయినా మీకు కార్తీక్ అంటేనే ప్రేమ. ఇందాకటినుంచి అడుగుతున్నా అదే మిటని... ఇవ్వలేదు సరికదా కనీసం ఏమిటో చెప్పలేదు" చిరుకోపంగా అంది రేవతి.

"ఎవరికిస్తేనేమిటమ్మా... అది మీ ఇద్దరి దీనూ" నవ్వుతూ అన్నాడు శంకరం.

"ఈ హడావుడి ఏమిటి బాబాయ్ మీరు నాకు గిఫ్ట్ ఇవ్వడం ఏమిటీ" అంటూ కవర్ ఓపెన్‌చేసి చూశాడు కార్తీక్.

"అదేమిటీ ఏవో టికెట్స్‌లా వున్నాయి" కార్తీక్ చేతిలోంచి లాగేసుకుంది రేవతి.

"ఏయ్ చిరిగిపోతాయ్. ఏమిటదీ" మెత్తగా కోప్పడ్డాడు.

"హాయ్... తిరుపతికి టికెట్స్ మీకెలా తెలుసంకుల్ నేను వెళ్ళాలనుకుంటున్నానని" ఆనందంగా అడిగింది రేవతి.

"బాబాయ్..." కార్తీక్ నోట మాటరా లేదు.

"ఎందుకు బాబాయ్ మీకు మామీద అంతటి కన్‌సర్న్" అన్నట్లు చూశాడు.

"అంకుల్" అంటూ శంకరంగారిని పట్టు కుని ఏడ్చేసింది రేవతి.

"కన్నవాళ్లు కూడా చూపించనంత ప్రేమా నురాగాలు మామీద చూపిస్తున్నారు. ఏదో మాటవరసకు తిరుపతి వెడితే బాగుంటుం దేమో అనుకుంటే, మీరు మాకోసం"

"అరె, రిలాక్స్. ఎందుకంత ఎమోషన్. ఎవరికి నేను చేస్త. నా పిల్లలకు నే చేశా. అదీ గొప్పేనా. అమ్మాయ్ ఈ రాత్రికే ప్రయాణం. త్వరగా లేచి అన్నీ సర్దు. ఇదిగో కార్తీక్ నీకు మూడుగంటల టైమ్ ఇస్తున్నాం. ఏమైన అర్జంటుపనులుంటే త్వరగా చూసుకో. ట్రైన్ ఎక్కింది మొదలు మళ్ళీ తిరిగి వచ్చేవరకూ నీకు అమ్మాయే లోకం. ఏమిటి అర్థం అయిందా"

"అలాగే బాబాయ్" నవ్వుతూ అన్నాడు కార్తీక్.

సాయంత్రం వాళ్లను ముగ్గురినీ రైలె క్కించి "ఏమిటో ఈ అనుబంధం" అను కుంటూ నిట్టూర్చాడు శంకరం.

★ ★ ★

"రేవతీ..."

"ఊc..."

"ఏమిటాలోచిస్తున్నావు?"

"... ... ..."

"పోనీ ఏం ఆలోచిస్తున్నావో... నీ మన సులో ఏముందో నే చెప్పనా?"

"ఊ" మత్తుగా అంది రేవతి.

"సుమారు ఎనిమిదేళ్ళ కిందట మనం హైదరాబాద్ రైలెక్కిన రోజులు జ్ఞాపకం వచ్చాయి నీకు. అవునా"

"ఊ"

"ఏమిటి అన్నింటికీ 'ఊ' ఏనా... కొంప దీసి ప్రయాణం అంతా నాకు మూకీ యేనా?" భయం నటిస్తూ అన్నాడు కార్తీక్.

"నాకు ఎంతో ఆనందంగా ఉంది కార్తీ... సుడిలోచిక్కి అల్లాడిన నావ మళ్ళీ సురక్షి తంగా ఒడ్డుకు వచ్చినంత ఆనందంగా ఉంది. ఇది కలేమో... కళ్ళు తెరిస్తే కరిగి పోతుందేమో అన్నంత భయంగా వుంది"

"ఇలలో కల ఊహించుకుని అలా కళ్లు మూసుకుని కాలక్షేపం చేస్తావా? బాబాయ్ ఎంతో ముందుచూపుతో మనకు కూపే రిజర్వ్ చేయించారు. మన బంగారు త ల్లేమో ఎంచక్కా నిద్రపోయి మనకు గ్రీన్‌సి గ్నల్ ఇచ్చింది" కార్తీక్ కళ్లలో కొంటెతనం,

మాటల్లో అనురాగం.

"చాల్లే...ఎక్కడ లేని హుషారు వచ్చింది అబ్బాయిగారికి"

"అదంతా అమ్మాయిగారి మహిమే" మత్తుగా వాలిపోతూ అన్నాడు కార్తీక్.

"అబ్బ నేల ఈనినట్లు వున్నారు జనం అంటే ఇదే కాబోలు. అసలు భారతదేశంలో సగం జనాభా ఎప్పుడూ బస్టాండుల్లోనూ... రైల్వేస్టేషనులోనే వుంటారు కాబోలు" రైలు దిగుతూ అన్నాడు కార్తీక్ ఆ రష్ చూస్తూ.

"నయం అంకుల్ ముందు చూపుతో కాటేజ్ కూడా బుక్ చేశారు కనుక సరిపోయింది కానీ నా కసలు ఆ ఆలోచనే రాలేదు"

"దటీజ్ శంకరం బాబాయ్. ఎప్పుడు ఏ పని ఎలా చెయ్యాలో ఆయనకు తెల్సినంత బాగా ఎవరికీ తెలీదు"

"డాడీ... వాళ్ళంతా ఎందు కలా వున్నారు?" ఉన్నట్లుండి గట్టిగా అడిగింది పాప.

"ఎవరూ" అంటూ అటు చూసిన కార్తీక్‌కు ఒక్కక్షణం ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"అదీ... అదీ..."

"గుండు అంటారమ్మా దాన్ని..."

"గుండు... భలే భలే... అంటే..."

"అంటే ఇక్కడి దేముడికి మొక్కుకుని తల నీలాలు ఇవ్వడం అన్నమాట. తలనీలాలు అంటే జుట్టు అన్నమాట" ఎలాగూ అడుగుతుందని చెప్పాడు.

"ఎందుకూ... దేముడు జుట్టేం చేసుకుంటాడు?"

"అలా అనకూడదు. అదొక ఆచారం అంతే..."

"అబ్బా... ఎంత హాయిగా, ప్రశాంతంగా వుందీ వాతావరణం. మనిషి జీవనవేటలో ఎన్ని అందాలనూ, అద్భుతాలనూ మిస్ చేసుకుంటున్నాడో కదా"

"అంకుల్ చేసిన ఎరేంజ్‌మెంట్స్ వలన ఇంత రష్‌లోనూ దర్శనం ఎంత బాగా జరిగిందోకదా" కార్తీక్ ఆలోచనలు ఎటు పరిగెడుతున్నాయో గ్రహించిన రేవతి డైవర్ట్ చెయ్యడానికి మాట మార్చేసింది.

"అవును... ఎంతైనా బాబాయ్ గ్రేట్. ఏపనిచేసినా పద్ధతిగా చక్కగా చేస్తారు"



"బాబాయ్‌ని మెచ్చుకోవడంకాదు, ఎటువంటి పరిస్థితిలోనయినా శక్తిని కోల్పోని ఆయన మనోస్థైర్యం, ఏ సమస్యకైనా కూల్‌గా పరిష్కారం ఆలోచించి సాధించే ఆ నేర్పు తెలుసుకుని ఫాలో అవగలగాలి" అయినదానికీ కానిదానికీ వర్రీ అయిపోకూడదని ఇండైరక్టుగా చెప్పింది రేవతి.

"అప్పుడే మనం తిరుపతి వచ్చి నాలుగు రోజులు గడచిపోయాయి. రోజులెంత ఫాస్టుగా తిరిగిపోతున్నాయో... నువ్వు ఈ ప్రపోజల్ పెట్టి చాలా మంచిపనిచేశావు 'రే...' మనసంతా సంతోషంతో నిండిపోయింది. హాయిగా ప్రశాంతంగా వుంది"

"దటీజ్ రేవతి..." కిలాకిలా నవ్వింది రేవతి.

"డాడ్ ఆ బొమ్మ కొనుక్కుందామా" అడిగింది పాప హిమ.

"నాకు బొమ్మ ఎందుకురా మీ అమ్మ వుండగా" కొంటెగా అన్నాడు కార్తీక్.

"ఛీ... అమ్మతో ఏం ఆడుకుంటాం, ఎంచక్కా బొమ్మతో అయితేనే బాగుంటుంది"

"ఇదిగో చిన్నారి... వాటిల్లో నీకేం బొమ్మలు కావాలో సెలక్టు చేసుకో" హిమతో అని,

"ఏయ్ చిన్నపిల్లతో ఏమిటా మాటలు" లోగొంతుకతో అంది కార్తీక్‌కు మాత్రమే వినబడేలా.

"దానికేం అర్థంకాదుగానీ... మరి నీక్కూడా ఏమైనా కొనుక్కో" ప్రేమగా అన్నాడు కార్తీక్.

వారంరోజులు నిముషాల్లాగా గడచిపోయాయి. హాయిగా జాలీగా ఫ్రీ బర్డ్స్‌లా తిరిగారు.

"మనం ఇంట్లోంచి పారిపోయిన తొలి రోజులు గుర్తుకు వచ్చాయి మళ్ళీ. అయితే అప్పటిది అనుభవంలేని మోహావేశం... మరి ఇప్పటిది... పరిపూర్ణత నిండిన మాధుర్యపు అనుభూతి"

"అబ్బో... అబ్బాయిగారికి భావుకత వురకలేస్తోందే. ఇంటికెళ్ళగానే అంకుల్, ఆంటీలకు థ్యాంక్స్ చెప్పాలి. అయినా వాళ్ళు మనకు చేసినదానికీ, చేస్తున్న దానికీ మన మీద చూపిస్తున్న అవ్యాజ ఆదరాభిమానాలకూ రుణం ఎలా తీర్చుకోగలం. థాంక్స్ అనే మాట అర్థంలేనిది" తృప్తిగా మనస్ఫూర్తిగా అంది రేవతి.

★ ★ ★

అన్నీ సర్దుకుని, ఆ ఏడుకొండలవాడికి మనస్ఫూర్తిగా అంజలి ఘటించి తృప్తినిండిన మనసులతో రైలెక్కారు.

వాళ్ళు బయలుదేరేముందే శంకరం... పార్వతీ గట్టిగా చెప్పడంతో రైలు దిగి ‍తిన్నగా సరి వాళ్ళింటికే వెళ్ళారు. వాళ్ళకేం తెలుసు ఊహించని ఘటన ఎదురౌతుందని.

ఆటో దిగి శంకరంగారి ఇల్లు తాళంపెట్టి ఉండటం గమనించిన రేవతి

"అయ్యో... ఇదేమిటండీ... వీళ్ళు ఎక్కడికి వెళ్ళి వుంటారు, అలా వెళ్ళరే... మనం ఇప్పుడు వస్తాం అని వాళ్ళకు తెలుసుగా" అంది కంగారుగా.

"నువ్వూరికే గాభరా పడకు... మధుని అడిగితే తెలుస్తుందిగా... అరె... వీళ్ళూ లేరు. ఎక్కడకు వెళ్ళి వుంటారు. ఒక్కక్షణం ఇదిగో హిమ చెయ్యి పట్టుకో, ఇప్పుడే వస్తాను" పక్కనే వున్న కిరాణా షాపుకేసి నడుస్తూ అన్నాడు.

"కార్తీక్ సార్... శంకరంగారికి హార్ట్ ఎటాక్ వచ్చింది. హాస్పిటల్‌లో వున్నారు. ఇదిగో మీరొస్తే ఈ తాళాలు ఇమ్మన్నారు. మిమ్మల్ని ఫ్రెష్ అయి 'స్టాలిన్' హాస్పిటల్‌కు రమ్మన్నారు" తాళాలు అందిస్తూ చెప్పాడాయన.

వింటున్న కార్తీక్ అదిరిపడ్డాడు. "బాబాయ్‌కు హార్ట్ఎటాకా, ఎప్పుడు? "

"నిన్ననే సార్, పరిస్థితి చాలా సీరియస్‌గానే వుంది. ఎలాగూ మీరు బయలుదేరుతున్నారు కదా... ఫోనుచేసి కంగారు పెట్టడం దేనికి అన్నారు పార్వతమ్మ"

"సరే... నే వస్తాను. ఆటో... ఆటో" రివర్స్ చేసుకువెళ్ళబోతున్న అదే ఆటోని పిలిచాడు కంగారుగా.

"ఇదిగో స్టాలిన్ హాస్పిటల్‌కు వెళ్ళాలి. రేవతీ నువ్వూ పాప ఎక్కండి. ఇదిగో నే లగేజ్ ఇంట్లో పడేసివస్తా..." అంటూనే తాళం తీసి సామాను లోపలికి గిరాటేసి ఒక్క ఉదుటున ఆటో ఎక్కాడు.

"ఏమయిందండి... ఏమిటా కంగారు... ఎవరికి బాగా లేదు" కంగారుగా అడిగింది రేవతి.

"బాబాయ్... బాబాయ్‌కి హార్ట్ఎటాక్ వచ్చిందట రేవతీ" కార్తీక్ గొంతు జీరబోయింది.

"అయ్యో... అదేమిటీ" షాకయింది రేవతి.

ఆటో దిగి లోపలికి వెళ్ళగానే కనిపించాడు మధు, శంకరంగారి ఇంట్లో అద్దెకుండేవాళ్ల అబ్బాయి.

"మధూ... బాబాయ్‌కెలావుంది ఇప్పుడు. ప్రమాదం ఏమీలేదుకదా" గాభరాగా అడిగాడు కార్తీక్.

"ఇంకా ఏం చెప్పలేం అన్నారు డాక్టర్స్"

"పిన్ని... పిన్ని ఎక్కడ. ఆవిడెలా తట్టుకుంటుంది ఇంతటి ఘోరాన్ని"

"గోలగోలగా ఏడుస్తోందని, ఆవిడకు సెడేటివ్ ఇచ్చారు. బాబాయ్‌గారి దగ్గరకు ఎవరినీ రానియ్యడంలేదు. ఇంటెన్సివ్‌కేర్‌లో పెట్టారు. పిన్నిగారి దగ్గర అమ్మ వుంది. నాన్న ఇప్పుడే ఇంటికి వెళ్లారు"

"ఎంత పని జరిగింది. సమయానికి మేం కూడా ఊళ్లో లేం. నయం మీరైనా సమయానికి ఉండి చూడబట్టి సరిపోయింది. ఒక్కక్షణం మధూ, ఒక్కసారి అంకుల్‌ని బయటనుంచైనా చూసివస్తాను. అలాగే పిన్నిని కూడా" ఆత్రంగా వెళ్లాడు కార్తీక్.

బెడ్‌మీద అచేతనంగా పడి ఉన్న శంకరంగారిని చూడగానే తట్టుకోలేకపోయాడు కార్తీక్. ఒక్కసారిగా భోరుమన్నాడు. అతికష్టంమీద నిగ్రహించుకున్నాడు. పార్వతిదీ ఇంచుమించుగా అదేపరిస్థితి. చైతన్యానికి మారుపేరుగా ఉండే ఆ దంపతులు అలా మృతప్రాయంగా పడి ఉంటే గుండె కెలికినట్లయింది కార్తీక్ , రేవతులకు.

వెంకటేశం దంపతులకు యింకా శంకరం దంపతులమీద మనసులో కోపమే తమ కొడుకుని తమకు కాకుండా చేశాడని. ఏదో మొక్కుబడిగా వచ్చి చూసి వెళ్లారు. తల్లితండ్రుల ప్రవర్తన కార్తీక్‌కు చాలా అసహానాన్ని, అసహ్యాన్ని కలిగించింది.

తోడుగా ఉంటారని గిరీశంగారికి ఫోను చేసి చెప్పారు. వెంటనే గిరీశం భార్యతో సహా రెక్కలు కట్టుకు వాలాడు. ఆయన దృష్టిలో శంకరం పార్వతమ్మలంటే ఆది దంపతులే. తమ కూతురు బతుకు నిలబెట్టిన అపర దేవతలే.

"అసలేం జరిగింది? ఎప్పుడూ ఆరోగ్యంగా ఉండే శంకరంగారికి సడెన్‌గా అంత సివియర్ స్ట్రోక్ ఎందుకొచ్చింది" పదేపదే అదే ప్రశ్న కార్తీక్‌ను వేధిస్తోంది.

"మొన్న రాత్రి బాగానే ఉన్నారు. రాత్రి భోజనాలు అయ్యాకా చాలాసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాం కూడా. ఉదయాన్నే అమెరికానుంచి ఫోను వచ్చిందిట. మరి ఏ విషయమో ఏమో. అలా దిగాలుగా కూర్చుండిపోయారుట. పార్వతమ్మగారు ఏమిటలా ఉన్నారు. అమ్మాయి క్షేమమే కదా అని గుచ్చిగుచ్చి అడిగినా "అమ్మాయి క్షేమమే నువ్వు కంగారుపడకు" అంటూ చెప్పారట. ఆ కూర్చోవడం కూర్చోవడం ఓ గంట ఏదో తీవ్రమైన ఆందోళనగా మౌనంగా ఉండిపోయిన ఆయన సడన్‌గా ముచ్చెమటలూ పోసి ఒళ్లు చల్లబడి కూలబడి పోయారుట. భర్తనే గమనిస్తున్న పార్వతమ్మగారు అది చూసి కంగారుపడి కేకలేస్తే నే వచ్చి చూశాను. వెంటనే ఇదిగో హాస్పిటల్లో చేర్చాను. నిన్న ఉదయంనుంచీ అలాగే ఉన్నారు. డాక్టర్స్ అప్పుడే ఏం చెప్పలేమంటున్నారు. దేముడి దయ ఎలా ఉందో"

"దేముడి దయ బాగుండబట్టే మీరు చూసి సమయానికి హాస్పిటల్లో చేర్చడం అదీ జరిగింది. నలుగురి మేలుకోరేవాడు. నలుగురికి మంచి చేసేవాడు. వాడికేం కాదు. తప్పక కోలుకుంటాడు" ధైర్యంగా ఓదార్పుగా అన్నాడు గిరీశం.

"మీలో కార్తీక్ ఎవరూ. పార్వతమ్మగారికి స్పృహవచ్చింది. మిమ్మల్ని పిలుస్తున్నారు" నర్స్ వచ్చి చెప్పింది. "ఒక్కరే వెళ్ళండి. అంతా వద్దు"

కార్తీక్ గబగబా వెళ్లాడు.

"కార్తీక్" బలహీనంగా ఉంది ఆమె గొంతు.

"పిన్నీ... ఏమిటిదంతా... ఎందుకిలా

జరిగింది" అని, వెంటనే

"డాక్టర్‌తో మాట్లాడాను. ఏం ప్రమాదం లేదన్నారు. అసలు ఏమయింది సడన్‌గా బాబాయ్‌కంత సివియర్ స్ట్రోక్ ఎందుకొచ్చింది"

"లీల... మనలీల... మనకిక లేదు కార్తీ" భోరుమంది ఆవిడ. నిశ్చేష్టుడయ్యాడు కార్తీక్. ఆ తల్లిని ఇంకా ప్రశ్నలతో విసిగించ దల్చుకోలేదు.

పార్వతమ్మ మళ్ళీ బాగా అప్‌సెట్ అవడంతో ఆమెకు మళ్ళీ సెడెటివ్ ఇచ్చారు డాక్టర్స్. ఆమెను డిస్టర్బ్ చెయ్యడం మంచిదికాదనీ, ఆమెకూ స్ట్రోక్ వచ్చే సూచనలు కనిపిస్తున్నాయని హెచ్చరించారు.

వాళ్లను జాగ్రత్తగా చూసుకోమనీ, అవసరం అయితే తన సెల్‌కు ఫోను చెయ్యమనీ చెప్పి ఇంటికొచ్చాడు కార్తీక్.

అసలు విషయం తెలియాలంటే అమెరికా కాంటాక్టు చెయ్యాలనుకుని, లీల యింటి నెంబర్ వెతికి ఫోను చేశాడు కార్తీక్.

అక్కడ పోలీసు ఆఫీసరిచ్చిన ఇన్‌ఫర్మేషనుతో కార్తీక్ తల తిరిగిపోయింది. లీలది అమానుషమైన హత్య. ఒంటరిగా ఉంటున్న ఆమెను చెరబట్టి ఘోరంగా చంపేశారు. ఎవరూ, ఏమిటీ అనేది ఇంకా ఇన్వెస్టిగేషన్ జరుగుతోంది.

అసలు లీల ఒంటరిగా ఉండటం ఏమిటీ. భర్త కేదార్, కొడుకు శ్యామ్ ఏమైనట్లు. సందేహాలతో కార్తీక్ తల తిరిగిపోయింది.

"ప్లీజ్ ఆఫీసర్. ఇండియానుండి లీల బ్రదర్ మాటాడుతున్నా. ఆమె క్లోజ్ ఫ్రెండ్ ఎవరిదైనా ఫోను నెంబర్ ఇవ్వండి'' అంటూ ప్రాధేయపడితే పాపం వెంటనే రియాక్టు అయి మార్టరిన్ ఫోన్ నెంబర్ ఇచ్చాడు ఆయన.

మార్టరిన్ చెప్పిన విషయాలు కార్తీక్‌ను నిలువెల్లా కదిలించాయి. ఎంతో ఇష్టపడి కోరి పెళ్ళిచేసుకున్న కేదార్ మొదట్లో బాగానే ఉన్నా, రాన్రానూ లీలని ఎంతో బాధపెట్టేవాడట. కొడుకుకోసం, కన్నవాళ్ల కోసం ఎంతో ఓర్చుకున్న లీల రెండేళ్లకింద యింక ఆ బాధలు సహించలేక కేదార్‌కు విడాకులు ఇచ్చేసి కొడుకుతో ఒంటరిగా ఉందిట. అసలే తమ్ముడు చరణ్ పోయిన బాధతో వున్నవాళ్లని ఇంకా బాధపెట్టడం ఇష్టంలేక ఆ వివరాలేం శంకరంగారికి తెలియనీయక తను హాయిగా ఆనందంగానే ఉన్నట్లు చెప్పేదట.

మార్టరిన్ చెబుతున్న ఒక్కో విషయం వింటూంటే కార్తీక్‌కి మతిపోయింది. అసలు చరణ్ ఎవరు? అసలు శంకరం బాబాయ్‌కో కొడుకు ఉండేవాడన్న విషయమే తమకు తెలీదు.

ఎంతో హుషారుగా ఉంటూ అందరికీ తలలో నాలికలా ఉండే శంకరం దంపతుల గుండెల్లో ఇంతటి విషాదం వుందా?

ఇంట్లో పిల్లాడిలా తిరిగిన తనకే అసలు శంకరం దంపతులకు ఓ కొడుకున్నాడని, అర్థాంతరంగా చనిపోయాడని తెలీదే. అచేతనంగా పడివున్న ఆ దంపతులు ఏమీ చెప్పగలిగే స్థితిలో లేరు. ఎవరిని అడగాలి?

అసలు ఎందుకు అడగాలి. ఇచ్ఛాపూర్వకంగా వాళ్లు సమాధి చేసిన గతాన్ని తను తెలుసుకోవడం ఎందుకు? లీల విషయం ఒక్కటి తెలుసుకుని, చేయగలిగింది చేయాలి, అంతే.

ఆ నిర్ణయం కార్తీక్‌లోని అస్థిమితాన్ని, అలజడిని తగ్గించింది. మళ్ళీ మార్టరిన్‌కు ఫోన్‌చేశాడు. లీల కొడుకు శ్యామ్ ఎక్కడ ఉన్నాడు అని అడిగాడు.

"మీరు శ్రమ తీసుకుని ఎలాగైనా శ్యామ్‌ని ఇండియా పంపించే ఏర్పాటు చెయ్యగలరా"

"ష్యూర్... తప్పకుండా ఏర్పాటు చేస్తాను. లీల ఫ్రెండ్‌గా నా బాధ్యత. అంతే కాదు, లీలకు ఈ గతిపట్టించిన వారిని చట్టానికి పట్టించి తీరతాను" అని

చెప్పింది.

కేదార్ పైశాచిక ప్రవర్తనతో విసిగిపోయి అతనినుండి విడిపోయి చిన్నారి శ్యామ్‌తో ప్రశాంతంగా ఉంటున్న లీల జీవితంలోకి మైఖేల్ రాహువులా ప్రవేశించాడనీ, ప్రేమిస్తున్నా, పెళ్ళి చేసుకుంటా, శ్యామ్‌ను కూడా కన్నకొడుకులా చూసుకుంటాననీ ఎంత ప్రలోభ పెట్టినా లీల లొంగలేదు. తను అలా ఒంటరిగా జీవించడానికే నిశ్చయించుకున్నాననీ, తను తన శ్యామ్ ఆలనా పాలనాతో అతనిని చక్కగా పెంచి పెద్దచేయడంలోనే తన మిగతా జీవితం గడపదలచుకున్నాననీ, దయచేసి పెద్ద మనసుతో అర్థంచేసుకుని తనను విడచిపెట్టమని ఎంతో ప్రాధేయపడిందట. అప్పుడు మైఖేల్ అసలు స్వరూపం బయటపడింది. ఏది ఏమైనా లీల తనకు లొంగిపోకపోతే శ్యామ్‌ను చంపేస్తానని బెదిరించాడట. లీల ఎన్నోరకాలుగా ప్రాధేయపడినమీదట లీల తన ఆస్తిపాస్థులను ఇష్టపూర్వకంగా చట్టబద్ధంగా తనపరం చేస్తే వాళ్ళ జోలికి రానని నమ్మబలికాడు ఆ నీచుడు.

అంతటితో వాడి పీడ పోతే చాలని అమాయకంగా తన ప్రాపర్టీస్ అన్నీ చట్టపరంగా మైఖేల్ పరం చేశాకా వాడు ఆ అమాయకురాలిని దారుణంగా రేప్‌చేసి చంపేశాడేమో అన్న మార్టరిన్ నమ్మకంలో నిజం ఉందనిపించింది కార్తీక్‌కు. ఆగ్రహంతో రగిలిపోయాడు. కానీ దేశంకాని దేశంలో చేయగలిగినది లేక అన్నింటికంటే ముఖ్యం ఇక్కడ శంకరం దంపతుల భారం బాధ్యత ముఖ్యం అనుకుని, ఆ నీచుడి ఖర్మానికి వాడినొదిలేసి శ్యామ్‌ను ఇండియా చేర్చే భారం మాత్రం మార్టిరిన్‌కు అప్పచెప్పాడు.

★ ★ ★

హాస్పిటల్ లో శంకరంగారు మెల్లిమెల్లిగా కోలుకుంటున్నారు. అది చాలు పార్వతమ్మ కోలుకోవడానికి.

విషయం అంతా తెలిస్తే పార్వతమ్మ ఏమైపోతుందో అని దిగులు పడ్డాడు కార్తీక్.

"పిన్నీ శ్యామ్‌ను ఇక్కడికి పంపించెయ్యమన్నాను. అక్కడ ఎవరున్నారు వాడికి. మీరు, బాబయ్య వాడికోసమైనా తేరుకుని..."

"ఏం చేస్తాం కార్తీక్ తేరుకోక. మాకు ఎదురుదెబ్బలు కొత్తేంకాదుకదా. కంటికి రెప్పల్లా పెంచుకున్న పిల్లలు అలా అన్యాయమైపోయారు. అంతే ప్రాప్తం అనుకుని కనిపించే ప్రతి పిల్లలోనూ వాళ్ళని చూసుకుంటూ కాలక్షేపం చెయ్యడమే"

"అంతటి కష్టాన్ని తట్టుకుని బతికెయ్యడానికి ఎంతో ఆత్మస్థైర్యం కావాలి. ఎన్నో ఏళ్ళుగా మిమ్మల్ని చూస్తున్న నాకు తెలుసు. అవి మీలో వున్నాయని" ధైర్యం చెప్పాడు కార్తీక్.

"కార్తీక్ నీకు చరణ్ గురించి చెప్పలేదు కదూ" ఆవేదనగా అంది.

"ఇప్పుడా విషయాలెందుకులే పిన్నీ. నువ్వు రెస్ట్ తీసుకో" వారింపుగా అన్నాడు.

"లేదు కార్తీక్... చరణ్ జ్ఞాపకాలను బలవంతంగా సమాధి చేసేసుకున్నాం. వాడి పేరుకానీ, జ్ఞాపకం కానీ మనసులోనైనా తలచుకోనని మీ బాబయ్య నాదగ్గర మాట తీసుకున్నారు. తనూ ఆ మాట మీదే ఉండిపోయారు. అందుకే మాకు ఓ కొడుకు ఉండేవాడన్న విషయం మేమే మరిచిపోయాం. నీలోనే చరణ్‌ని చూసుకున్నాం" ఆవేదనగా అంది పార్వతమ్మ.

ఆమెలో అంతర్గతంగా ఎంత ఆవేదన గూడుకట్టి వుందో అర్థం అయిన కార్తీక్ ఆమెలోని వేదననీ, దుఃఖాన్ని ఎలాగైనా బయటకు లాగి ఆమె మనసు తేలిక పరచాలనుకున్నాడు.

"పిన్నీ, అసలు చరణ్ ఎలా పోయాడు"

"చరణ్ ఇంజనీరింగ్ చదివేటప్పుడు ఓ మృత్యుదేవతని ప్రేమించాడు. అదే మా

పాలిట శాపమైంది" భోరుమంది పార్వతమ్మ.

"పిన్నీ... రిలాక్స్. ఎప్పుడో జరిగిపోయిన దానికి బాధపడి లాభంలేదు. మీకు చెప్పగలిగేటంతవాడిని కాదు. ప్లీజ్ కంట్రోల్ చేసుకో" అనునయంగా అన్నాడు.

"లేదు కార్తీక్. పైకి మామూలుగా కనిపించినా ఒకరికోసం ఒకరు బాధని మనసులోనే అదిమేసినా ఆ గాయం మా ఇద్దరి గుండెల్లో ఇప్పటికీ పచ్చిగానే ఉంది. దెబ్బమీద దెబ్బ అన్నట్లు ఇంతలోనే ఇది..." ఆపై మాట్లాడలేకపోయింది.

"పిన్నీ... జరిగిందేదో జరిగిపోయింది. బాబాయ్... పిన్నీ అని పిలిచినా నా దృష్టిలో మీరు నా తల్లితండ్రులే. మీరు గుండె నిబ్బరం చేసుకుని నాలోనే మీ పిల్లలిద్దరినీ చూసుకోండి. అయినా ఇప్పుడు మీమీద మరో పెద్ద బాధ్యత వుంది. అది శ్యామ్."

"శ్యామ్... ఆ పసివాడిని పెంచి పెద్దచేసే శక్తి మాకు లేదయ్యా. ఇక ఏ మమ



తలూ, మమకారాలూ పెట్టుకోకుండా ఏదో అలా బతికేస్తాం" నిస్పృహగా అంది.

"అలా అనకు పిన్నీ... నాకు తెలిసిన 'మీరు' అలా వుండలేరు. మీకు మేం ఉన్నాం. ఇంతకూ చరణ్..."

"చరణ్ మద్రాసులో ఇంజనీరింగ్ చదివే టప్పుడు మోనికా అనే అమ్మాయి ప్రేమలో పడ్డాడు. చదువు పూర్తయ్యేదాకా ఆ సంగతి మాకు చెప్పలేదు. అప్పటికే లీల కేదార్ అనే కుర్రాడిని ప్రేమించింది. అతనినే పెళ్ళి చేసుకుంటానని వాళ్ళ నాన్నగారితో చెప్పింది.

ఆయన మొదటినుంచీ పిల్లల్ని స్నేహి తుల్లా చూసేవారు. మన కులం కాదే అని మొదట బాధపడ్డా మనసు సరిపెట్టుకుని వాళ్ళవాళ్ళతో మాట్లాడి పెళ్ళి జరిపించారు. కేదార్ ఇష్టాన్ని అనుసరించి వాళ్ళు అమె రికా వెళ్ళిపోయారు. బాధపడినా ఎలాగో సరిపెట్టుకున్నాం" అలసటగా ఆగింది పార్వ తమ్మ.

"తర్వాత మాటాడుకుందాం పిన్నీ. ఇదిగో కాస్త జ్యూస్ తాగి కాసేపు పడుకో" పళ్ళ రసం తీసి ఇస్తూ అన్నాడు కార్తీక్.

"లేదు కార్తీక్. ఏళ్ళ తరబడి గూడుకట్టు కున్న బాధ నీతో పంచుకోనీ" కళ్లు తుడుచు కుంది.

వద్దనకుండా పళ్ళరసం తాగింది.

"చరణ్‌కూడా అక్క మార్గంలోనే వెళ్ళాడు. లీల వర్ణాంతరం చేసుకుంటే చరణ్ ఏకంగా మతాంతరమే. వద్దన్నా ఫలితం ఉండదనీ, ఒప్పుకుని పెళ్ళి జరి పించి పెద్దరికం నిలుపుకోవడమే అనీ అన్నారు మీ బాబాయ్. ఆ అమ్మాయి వాళ్ళతో మాట్లాడి పెళ్ళికి ముహూర్తం పెట్టించమనీ... ఆ అమ్మాయితో సహా ఇక్కడికే వచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుందనీ వాడితో చెప్పారు..

పాత జ్ఞాపకాలతో మళ్ళీ భోరుమంది పార్వతమ్మ. ఏడవనిచ్చాడు కార్తీక్. మన సులో వున్న బాధంతా కరిగి కన్నీటి రూపంలో బయటపడితే మనసు తేలికవు తుందికదా.

"ఎంతో ఉత్సాహంగా వెళ్ళాడు పిల్లాడు. నాలుగురోజులు ఏ కబురూ లేదు. విషయం తెలియక విలవిలలాడిపోయాం. ఐదో రోజు వచ్చాడు. అసలు మన పిల్లా డేనా అన్నంతగా మారిపోయాడు. మని షిలో కళా, కాంతీలేదు. జీవచ్ఛవంలా ఉన్నాడు. ఉలుకూపలుకూ లేకుండా తనలో తనే కుమిలిపోయేవాడు. మీ బాబాయ్ తరచి తరచి అడిగినమీదట ఒక్కసారిగా బయటపడి గోలపెట్టాడు.

"అప్పటివరకూ వీడిని ప్రేమించిన ఆ పిల్ల సడన్‌గా మనసు మార్చుకుని వీడితో పెళ్ళి తనకిష్టంలేదనీ, తనది కేవలం స్నేహమే అనీ తనని మరిచిపొమ్మనీ చెప్పిందట. తట్టుకోలేకపోయాడు. వాడి వాలకం చూసి తట్టుకోలేకపోయిన మీ బాబాయ్ స్వయంగా మద్రాసు వెళ్ళి ఆ పిల్ల తోటి, వాళ్ళ తల్లితండ్రులతో మాట్లాడి ఫలితం లేక, చేసేదేం లేక వెనక్కి వచ్చే శారు"

"ఎందుకు? ఏమైందా పిల్లకు. ప్రేమ, పెళ్ళంటే బొమ్మలాటనుకుందా. మనసుతో ఆటలాడుకోవడం... ఎంత ఘోరం? " ఆవే శంగా అన్నాడు కార్తీక్.

"ఆ పిల్లకది వినోదమేమో... అది అల వాటేనట. వీడికంటే డబ్బు, పొజిషన్ ఉన్న వాడు దొరికాడు. వీడు ఆనలేదు" నిర్లిప్తంగా చెప్పింది.

"అసలు అది ఆడదేనా? " అసహ్యం గొంతునిండా నింపుకుని అడిగాడు.

"ప్చ్.. ఎందుకులే ఒకర్ని అనుకోవడం. మన అదృష్టం అలా వుంది. చైతన్యానికి మారుపేరులా వుండే చరణ్ ప్రాణం ఉన్న బొమ్మలా మారిపోయాడు. వాడినలా చూడలేక అభిమానం పక్కనపెట్టి మీ బాబాయ్ వాళ్ళను మళ్ళీ బతిమాలారు.

కానీ అవమానమే ఎదురైంది. కాలమే అన్నింటినీ సరిచేస్తుందని సమాధానపడ్డాం.

చాలారోజులు అలా వుండి ఒకరోజు అన్నాడుకదా... "అమ్మా, అలాంటి దానికోసం నేను బాధపడడం, మిమ్మల్ని బాధపెట్టడం నాకేం బాగోలేదు. మర్చిపోతాను. నన్ను కాదనుకున్న తను నాకూ అక్కరలేదు. నేను ఎమ్.ఎస్.కు అప్లయ్ చేస్తాను. ఎలాగూ లీల అక్కడుంది కనుక తను స్పాన్సర్ చేస్తే నేను ఈజీగా అక్కడకు వెళ్ళి చదువుకోవచ్చు" అని. మా ఆనందానికి అవధులు లేవు. ఎలాగైనా పిల్లాడిలో మార్పు వస్తే చాలనుకుని మీ బాబాయ్ ఆ ఏర్పాట్లన్నీ చేశారు. కానీ ఒకరకంగా అదే తప్పయిందేమో. మాకోసం బింకంగా తన ప్రేమను మరచిపోయి చదువుకుంటానన్నాడేగానీ, ఆ అమ్మాయినీ, తను చేసిన దగాని అంత తేలికగా మరచిపోలేకపోయిన చరణ్... చరణ్... అక్కడ ఒంటరిగా ఉండి డిప్రెషన్‌లోకి వెళ్ళిపోయాడు. ఎంతగా అంటే ఆత్మహత్య చేసుకునేంత"

చెప్పలేక వెక్కివెక్కి ఏడవసాగింది పార్వతమ్మ. వింటున్న కార్తీక్ గుండె బరువైంది. కళ్ళనీళ్ళు తిరిగాయి.

'ఎంత పదునైంది ప్రేమ? గుండెల్లో గునపంగా మారి ప్రాణాలు బలిగొందికదా' అనుకోకుండా ఉండలేకపోయాడు.

"పిన్నీ... జరిగిందేదో జరిగిపోయింది. అది మరచిపోయి హాయిగా ఉండమని నేను చెప్పను. కానీ మరుపు అనేది మనిషికి దేముడిచ్చిన వరం. లేకుంటే అసలు మనిషికి మనుగడే ఉండదు. ఈరోజు బాధ రేపటికి ఉండదు. రేపటిబాధ మరునాటికి ఉండదు. నేను చెప్పేదేమిటంటే మనసు రాయి చేసుకుని జరిగినవి మరిచిపోవడానికి ప్రయత్నించండి. ఈ వయసులో నువ్వూ బాబాయ్ ఒకరికొకరు తోడు. అందుకే బాధని దిగమింగి ఒకరికోసం ఒకరు బతకాలి... తప్పదు"

"... ... ..."

కార్తీక్ చెప్పింది వింటూ మౌనంగా ఉండిపోయింది పార్వతమ్మ.

సాలోచనగా మనసులోనే అనుకుంది. 'అవును. నేను బెంబేలెత్తిపోతే ఆయన అసలు తట్టుకోలేరు. అందుకే నా బాధను మనసులోనే సమాధి చేసెయ్యాలి. ఆయన కోసం అన్నీ దిగమించి నవ్వుతూ బతికెయ్యాలి'

★ ★ ★

శంకరంగారి పరిస్థితి క్రమంగా మెరుగుపడింది. ఇంటెన్సివ్ కేర్‌లోంచి బయట రూంలోకి మార్చారు. ఆయన మనసులో ఏం ఉందో ఏ అగ్నిపర్వతాలు పగులుతున్నాయో కానీ పైకి ప్రశాంతంగానే కనిపించారు. అయితే పెద్దగా మాట్లాడడంలేదు. చాలా నిర్లిప్తంగా ఉంటున్నారు. తగిలిన దెబ్బనుంచి కోలుకోవడానికి కొంత సమయం పడుతుందికదా. కార్తీక్ డాక్టర్‌ను కలిసి మాట్లాడాడు.

"డాక్టర్‌గారూ... బాబాయ్ పరిస్థితి ఇప్పుడెలా వుంది. ఇంక ప్రమాదం ఏమీలేదు కదా"

"ప్రస్తుతానికి ప్రమాదం ఏమీలేదు. కానీ ఆయన ప్రశాంతంగా ఉండేలా చూడాలి. ఎటువంటి ఒత్తిడి, టెన్షన్స్ ఆవేశంలాంటివి లేకుండా చూడాలి. ఇంకోసారి కనక స్ట్రోక్ వస్తే ఇంక కష్టమే. చెయ్యగలిగింది ఏమీ ఉండదు"

"అలాగే డాక్టరుగారూ... ఆయనకు ఎటువంటి బాధా, వత్తిడీ కలగకుండా చూసుకుంటాం. ఆయనను ఎప్పుడు డిశ్చార్జ్ చేస్తారు? "

"రేపే... ఈరోజు సాయంత్రం మరోమారు చెక్‌చేసి ఆయనకు వాడాల్సిన మందులు, తీసుకోవాల్సిన జాగ్రత్తలూ చెబుతాను. మా మందులకంటే ఆయనకిప్పుడు కావలసినది మీ అండదండ. అర్థమైందనుకుంటాను"

"ఎస్ డాక్టర్... ఆయనను మా ఇంటికే

తీసుకెడతా. కంటికి రెప్పలా చూసుకుంటా"

"మంచిది మిస్టర్ కార్తీక్. మీ గురించి మిస్టర్ మధు చెప్పాడు. మీ సహృదయత... మీ పరోపకారబుద్ధి అవన్నీ ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. సో నైస్ టు మీట్ యూ"

"అదేంలేదు. ఆయన మాకు చేసిన దాని ముందు ఆయనకు మేం చేస్తున్నదేంలేదు"

"అలా అనడం మీ సంస్కారం"

"థాంక్యూ డాక్టర్. ఇంక నే వెడతాను. మళ్ళీ చెకప్‌కు ఎప్పుడు తీసుకురాను"

"పది హేను రోజుల తర్వాత తీసుకురండి. ఈలోపు ఏదైనా అవసరం అయితే రింగ్ చెయ్యండి. నే ఎటెండ్ అవుతాను" చాలా కార్డియల్‌గా చెప్పాడు డాక్టర్.

"ఒన్స్ ఎగైన్ థ్యాంక్యూ డాక్టర్. థ్యాంక్యూ ఫర్ ద సర్వీస్ యు హేవ్ డన్... బిల్ కౌంటర్లో పే చేసి నే వెడతాను"

"మంచిది వెళ్ళిరండి"

డాక్టర్ రూంనుంచి వస్తూనే శంకరంగారి రూంలోకి వెళ్ళాడు. ఆయనకు మందు వేసినట్లు ఉన్నారు, మత్తుగా నిద్రపోతున్నారు. పదిరోజులకే మనిషి బాగా చిక్కిపోయారు. ఓసారి ఆయనను చూసి బయటకు వచ్చి బిల్ పే చేసేశాడు కార్తీక్.

శంకరంగారినీ, పార్వతమ్మనూ హాస్పిటల్‌నుంచి తిన్నగా తన ఇంటికి తీసుకొచ్చేశాడు కార్తీక్.

"ఎందుకయ్యా... ఇప్పుడు బానే ఉన్నాం. మా ఇంట్లో దింపెయ్యి" అంటున్నా వినలేదు.

"కొడుకు దగ్గరే తల్లీతండ్రీ ఉండాలి. నేనే మీ కొడుకును" అంటూ. నెలరోజులు ఇట్టే గడిచిపోయాయి. ఇప్పుడు శంకరంగారూ పార్వతమ్మగారూ బాగా కోలుకున్నారు. కార్తీక్, రేవతి వాళ్ళను కంటికి రెప్పల్లా చూసుకున్నారు. చిన్నారి హిమ ఆటపాటలతో వాళ్ళకి కాలమే తెలియడంలేదు.



"బాబాయ్ ఎవరిని తీసుకొచ్చానో చూడండి. రోజూలానే కోర్టుకెడుతున్నా అని చెప్పిన కార్తీక్ ఓ గంటలోనే ఇంటికొచ్చాడు. వెంట ముద్దులు మూటకట్టే చిన్న అబ్బాయి... వారి ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్న లీల పోలికలు ఆ తల్లితండ్రులకు వాడెవరో చెప్పకనే చెప్పాయి.

"శ్యామ్" అంటూ చేతులు చాపారు శంకరంగారు. ఊటబావిలా ఊరుతున్న కన్నీరు శ్యామ్‌ని స్పష్టంగా కనబడనీయడంలేదు.

అంతా కొత్తవాళ్ళే. బిత్తరపోయి చూస్తున్నాడు చిన్నారి శ్యామ్.

"కార్తీ... శ్యామ్ ఎలా వచ్చాడు? ఎవరు తీసుకొచ్చారు? అమెరికానుండి ఎప్పుడు వచ్చాడు?" పరుగునవచ్చి వాడిని దగ్గరకు తీసుకుంటూ అడిగింది పార్వతమ్మ.

"అమెరికానుండి బొంబాయివరకూ వాడిని భద్రంగా పంపే ఏర్పాట్లు అమెరికాలో ఉన్న లీల ఫ్రెండు మార్టిరిన్ చేశారు. బాంబేనుంచి ఇక్కడికి నేను నా అసిస్టెంట్‌ని పంపాను. అతనే తీసుకువచ్చి నాకు అప్పగించి వెళ్ళాడు. బాబాయ్... పిన్నీ.

ఇక మీరు వీడిని తీర్చిదిద్దడంలో బిజీ అయిపోవాలి. వీడి స్కూల్ ఎడ్మిషన్ అన్నీ అయిపోయాయి. రేవతీ శ్యామ్‌ను తీసుకెళ్ళి స్నానం అదీ చేయించు" అంటూ హడావుడి పడుతున్న కార్తీక్‌ను కళ్ళనిండా చూసుకున్నారు ఆ దంపతులు.

"నిజం... ఒకవేళ చరణ్, లీల బతికి ఉండి తాము వాళ్ళ దగ్గరే వుండి ఉన్నా తమనింతకంటే బాగా చూసుకునేవాళ్ళు కారేమో. ఏనాటి బంధమో ఇది. ఇంతలా పెనవేసి ముడిపడింది" ఆ దంపతులిద్దరి లోనూ అదే భావం మెదిలింది.

★ ★ ★

"రేవూ... రేవతీ" పెద్దగా అరుస్తూ పిలుస్తూ వచ్చాడు కార్తీక్. ఎన్నో ఏళ్ళ తర్వాత అంత గట్టిగా మనసంతా నిండిన సంతోషం పట్టలేనట్లుగా తన ప్రేమనంతా ఆ పిలుపులో గుప్పించి పిలిచాడు.

వంటగదిలో పిల్లల చిరుతిళ్ళ తయారీలో మునిగిపోయిన రేవతి ఒక్క ఉదుటున బయటకొచ్చింది ఆశ్చర్యంగా "ఏమయింది... అంతలా కేకలు పెడుతున్నారు" అనుకుంటూ.

"రేవూ డియర్" అంటూనే అమాంతం రెండు చేతులతోచుట్టి పైకెత్తేశాడు.

"అబ్బబ్బ... కార్తీక్. ఏమిటిది? ఏమయింది? అవతల అంకుల్, ఆంటీ ఉన్నారు. ఏమనుకుంటారో" గింజుకుంటూ అంది రేవతి.

దెబ్బకి స్పృహ కలిగింది కార్తీక్‌కు. గభాలున రేవతిని కిందకి దించి గాభరాగా అటూఇటూ చూశాడు. పెద్దవాళ్ళ అలికిడి లేదుకానీ పెద్దపెద్ద కళ్ళు విప్పార్చి బొమ్మల్లా నిలబడ్డారు చిన్నారి శ్యామ్-హిమ వింతగా చూస్తూ.

"ఓ చిట్టికన్నలూ ఇక్కడున్నారా? ఇవిగో మీ మామూళ్ళు. మరి నా మామూలేది?" మోకాళ్ళమీద కూర్చుని ఇద్దరికీ చెరో బుగ్గా ఇచ్చాడు చేతిలో ఫైవ్‌స్టార్ చాక్లెట్లు పట్టుకుని.

"డాడీ..." పరుగున దగ్గరకొచ్చారిద్దరూ. ఇద్దరినీ ముద్దాడి చాక్లెట్లిచ్చి,

"తాతయ్యా, నానమ్మా ఎక్కడున్నారో చూడండి" వింటూనే పరిగెట్టారిద్దరూ లోపలికి.

మెరిసే కళ్ళతో ఆ ముగ్గురినీ చూస్తూ నిల్చుంది రేవతి అక్కడే.

"ఇంతకూ శ్రీవారి ఆనందానికి కారణం ఏమిటో?" దగ్గరగా వస్తూ అంది.

"చెప్పుకో చూద్దాం"

"ఏదో బ్రహ్మాండమైన కేసు గెలిచి ఉంటారు"

"ఊహూ..."

"లేకపోతే మీకు మంచి కొత్త కేసు వచ్చి ఉంటుంది"

"వ్వెవ్వె..." వెక్కిరింతగా అన్నాడు.

"అంతేలే నాకు ఎంతసేపూ కోర్టులూ, కేసులూ గొడవలూ అంతేగా... ఇంక వేరే ప్రపంచం ఏముంది నాకు?" కినుకగా అన్నాడు.

"అబ్బ... అలక ఆడవాళ్ళకు అందం అన్నారుగానీ ఇలా మగరాయుళ్ళకు కాదు మహాశయా. నసపెట్టక విషయం చెప్పరాదుటండీ" మురిపెంగా విసుక్కుంది రేవతి.

"అవునూ... అసలు రేవూ... రేవూ ఏమిటి? దాని అర్థం ఏమిటో చెప్పానా లేదా? అలా పిలవద్దని కూడా చెప్పానా?" గద్దించింది.

"అంతేలే నేనూ నా పిలుపూ పాతబడిపోయాం. అసలు రేవతీ దేవిగారి లెవెలే మారిపోయింది"

"అబ్బ... చంపక అసలు విషయం ఏమిటో చెప్పు కార్తీక్"

"అలా ఇలా చెబుతానా ఏం? నా మామూలు నాకిస్తే అప్పుడు చెబుతా"

"బాగానే ఉంది లాయర్‌గారికి మామూళ్ళ పిచ్చి బాగా ముదిరిపోయిందే" గలగలా నవ్వింది రేవతి.

"కళ్ళు మూసుకో. నీకో సర్ప్రయిజ్"

"మూసుకున్నాన్లే ఇవ్వండి" ఆత్రంగా చెయ్యి చాచింది రేవతి.

"అలాకాదు. ఇలా ఆమెని వెనకనుంచి వడిసి పట్టుకుని, ఆ మెడవంపులో ముఖం ఆన్చి "ఊ కళ్ళుతెరు..." అన్నాడు.

"వావ్" కళ్లు తెరుస్తూనే కళ్ళముందున్న తన ఫొటో చూసుకుని ఆనందంతో అరిచింది రేవతి.

"అమ్మాయిగారు రచయిత్రి అయిపోయారు. ఇదిగో 'ప్రేమికులదినం' అదే వాలంటైన్స్‌డే సందర్భంగా ప్రముఖ దినపత్రిక 'అంతరంగం' వాళ్లు పెట్టిన 'ప్రేమా... ఓ ప్రేమా' టాపిక్‌లో మొదటి బహుమతిగా ఎంపికైన విజేత 'శ్రీమతి రేవతీకార్తీక్' గారి 'అర్పణ'"

"ఇది... ఇది ఎలా... నేను పంపించలేదే?" ఆశ్చర్యంగా అడిగింది.

"అదే మరి ప్రేమంటే. నేను కష్టపడి దాన్ని ఇంకొంచెం అందంగా అలంకరించి నీకు తెలియకుండా ఆ కాంపిటీషన్‌కు పంపాను. సో... ఈ బహుమతి నాదే" ఆనందంగా అన్నాడు కార్తీక్.

"రా తాతయ్యా... రా నానమ్మా... రమ్మంటుంటే" శ్యామ్, హిమ శంకరంగారినీ పార్వతమ్మనూ చేతులు పట్టి లాక్కువస్తూ అంటున్నారు.

"అలాగే వస్తాం. ఉండండర్రా" శంకరంగారు నవ్వుతూ విడిపించుకోవాలని చూస్తున్నారు.

"రండి బాబాయ్... ఇదిగో మన రేవతి రచనకొకదానికి ప్రథమ బహుమతి వచ్చింది. ఇదిగో ఫొటోతోసహా వేశారు" పేపరు ఆయన చేతికిస్తూ అన్నాడు కార్తీక్.

"ఏమిటది మీరు, ఇలా ఇవ్వండి" లాగేసుకోవాలని చూసింది రేవతి.

"ఇయ్యమ్మా... అదేదో మేమూ చూసి, చదివి ఆనందిస్తాం" నవ్వుతూ ఆ పేపరు అందుకున్నారు శంకరంగారు.

"పొండంకుల్... మీరు కూడా" పేపరు లాగేసుకోబోయింది రేవతి.

"కొన్ని లక్షలమంది చదవచ్చుకానీ, పాపం మేం ఏం పాపం చేశామని" ఆప్యాయంగా నవ్వుతూ చదవడానికుపక్రమించారు శంకరంగారు.

"అదీ... అలా చెప్పండి అంకుల్. సరే, సరే, ఈ శుభసందర్భంలో మనం ఒక పార్టీ ఇద్దాం, మనవాళ్లనందరినీ పిలిచి"

"బాగానే ఉంది సంబడం. నా ఆర్టికల్ ఒకటి పడింది. చూడండోయ్ అంటూ దండోరా అన్నమాట"

"బాగుందోయ్ మనవాళ్లతో మన సంతోషం పంచుకోవడంలో తప్పేమిటీ?"

"తప్పేం లేదుకానీ... మీకంతగా సెలబ్రేట్ చేసుకోవాలని ఉండి అంత తీరుబడి ఉంటే నాదో కోరిక..." సందేహంగా అంది రేవతి.

"అబ్బా... రేవతీ... ఇంకా నా దగ్గర నీకు సంకోచాలు, సందేహాలూనా వెరీ బాడ్... చెప్పు ఏం కావాలి?"

"రేవతీ... ఏమి నీ కోరిక?" పాతాళభైరవి సినిమాలో పాతాళభైరవి ఫోజిచ్చి అడిగిన తీరుకు అక్కడున్న అందరూ హాయిగా నవ్వేశారు.

"నాకు ఎప్పటినుండో అరకులోయ చూడాలని ఉంది. వెడదామా?" ఆశగా అడిగింది.

"ఓస్... ఇంత దానికేనా అంతలా ముఖమాటం... నువ్వేం కులూమనాలినో, కాశ్మీరు లోయనో చూడాలనలేదుగా. పక్కనే ఉన్న అరకులోయకేగా, నిక్షేపంగా వెళ్లిరండి, ఈ పిల్లలిద్దరినీ నా దగ్గరే ఉంచుకుంటాను. హాయిగా రెండురోజులు గడిపి రండి" వెంటనే అంది పార్వతమ్మ.

"అయితే సరే, ప్రయాణానికి కావలిసిన ఏర్పాట్లు చూస్తాను. రేపు శని, ఆదివారాలే మన ప్రయాణం. బి రెడీ" చిటికేసి చెప్పాడు కార్తీక్.

"బాగానే ఉంది. లేడికి లేచిందే పరుగని... ఎందుకండీ తొందర, ప్రయాణం అంటే ఇంట్లో ఎన్ని విషయాలు చూసుకోవాలి" ముద్దుగా విసుక్కుంది రేవతి.

"ఏం ఇంత చిన్న విషయానికి కూడా మీనమేషాలు చూసుకోవాలా, ఏ కాలపు పిల్లవమ్మా తల్లీ నువ్వు, అమెరికా వెళ్ళినంత హడావుడి చెయ్యాలా పక్కనున్న అరకు లోయకు కూడా. అయినా ఇప్పుడు అమెరికా అనకూడదేమో ఎందుకంటే, అందరూ ఇలా వెళ్ళి అలా వచ్చేస్తున్నారు. అదేదో మనపక్క ఊరులాగా, పోనీ చంద్రమండలానికెళ్ళినంత హడావుడి చెయ్యాలా? తను అలాగే అంటుంది కానీ కార్తీక్ నువ్వు ఆ ఏర్పాట్లేవో చెయ్యి. రెండు రోజుల భాగ్యానికి ఆ మాత్రం నేనూ, మీ అంకుల్, ఇల్లు, పిల్లలు చూడగలం, ఏమండీ" మద్దతుకోసం అన్నట్లు అడిగిందావిడ.

"ఆ... ఆ... అలాగే" పేపరులోంచి తలెత్తకుండానే బదులిచ్చేశారు శంకరంగారు.

"పిన్ని ఏమడిగిందో కూడా వినకుండా భరోసా ఇచ్చేశారు బాబాయ్ ఎంత మంచి భర్తో నాలాగా" రేవతితో అన్నాడు కార్తీక్.

"మరే పాపం మా ఆయన బంగారం" గలగలా నవ్వింది రేవతి. శ్రుతికలిపారు కార్తీక్, పార్వతమ్మలు.

"ఏమిటి... నాకు చెప్పకుండా మీలో మీరే నవ్వేసుకుంటున్నారు. చాలా బాగా రాశావమ్మా రేవతీ. చక్కటి విషయాలు చెప్పడమే కాదు అంతకంటే అందంగా చక్కగా చెప్పిన తీరు చాలా బాగుంది. ఇంకేం నువ్వు రాయడం మొదలుపెడితే మంచి రచయిత్రి అయ్యే అవకాశాలు పుష్కలంగా కనబడుతున్నాయ్. ప్రొసీడ్" ప్రోత్సహించారు శంకరంగారు.

"ఇంకేం బాబాయ్ ఆశీర్వాదం అందింది. ఇంక విజృంభించు. నీ మొదటి కథ ఆరంభం అరకు వేలీ అందాల వర్ణనతో మొదలెట్టు. మేడమ్‌గారికి మంచి లొకేషన్స్ లొకేట్ చేసే బాధ్యత మాత్రం నాదే" డ్రమెటిక్‌గా అన్నాడు కార్తీక్.

"ఆలూ లేదు చూలూలేదు, కొడుకు పేరు సోమలింగం అన్నాడట వెనకటికెవడో మీలాంటివాడే. అప్పుడే నేనేదో పెద్ద రచయిత్రి అయిపోయినట్లు, లొకేషన్స్, అందాల వర్ణన అంటూ. అంత లేదు" పెదవి విరిచింది రేవతి.

"ఎందుకు లేదూ ఎవరూ మొదలే పెద్ద రచయితలవరు... రాయగా... రాయగా... వాళ్ళే అవుతారు" అంటున్న శంకరంగారిని అనుకరిస్తూ.

"మరే... ఒకళ్ళిద్దరిని చంపితే కానీ వైద్యులు కారంటారు. మరి పాపం ఎంత మంది పాఠకులు బలయితే, రచయితలవుతారో" వెక్కిరింపుగా అన్నాడు కార్తీక్.

"అందుకే... మహాప్రభో... నేనే రచనలూ చెయ్యను. ఎవరి ప్రాణాలూ తియ్యను" మూతి ముడిచింది రేవతి.

"ఊరికే అలా అంటున్నాడు లేమ్మా. నువ్వు రచయిత్రివయినావన్న ఆనందంతోనే కదా నిన్ను ఎత్తి గిరగిరా తిప్పింది" అన్నారు నవ్వుతూ శంకరంగారు.

"పొండి అంకుల్" మొహం ఎర్రబడి లోపలికి పరిగెత్తింది రేవతి. దొరికిపోయిన దొంగలాగా మెల్లిగా జారుకున్నాడు కార్తీక్ సిగ్గుపడి.

"చాల్లెండి. మీరు మరీను. పిల్లలు సిగ్గుపడరూ" కసురుకుంది మెల్లిగా పార్వతమ్మ.

"సిగ్గెందుకోయ్ వాళ్ళకా లైసెన్స్ ఉంది" నవ్వాడు శంకరం.

"కానీ... అలా అంటే మనకే సెన్స్ లేదనగలరు విన్నవాళ్ళు" ఆయన నవ్వులో తనూ జత కలిపింది పార్వతమ్మా.

"అబ్బో... లైసెన్స్, సెన్స్ ఏం ప్రాస. నువ్వూ ఏదైనా రాస్తున్నావా ఏం" టీజింగ్‌గా అన్నారు.

"ఆ... రాయాలి. అంబాజీపేట ఆముదం"

"ఈ'ముదం' చాలు పార్వతీ మనకు 'ఆముదం' గొడవెందుకు కానీ" సీరియస్‌గా అన్నారు శంకరంగారు.

"ఆ..." విస్తుబోయి చూస్తూ అర్థం అయి హాయిగా నవ్వేశారు పార్వతమ్మ. "అబ్బో... బాగున్నాయి విరుపులూ, చమక్కులూ" అంటూ.

"ప్రయాణం అంటే ఎన్ని సర్దుబాట్లు ఉంటాయి. ఈయనేమో లేడికి లేచిందే పరుగు అన్నట్లు మరీ ఎల్లుండే ప్రయాణం అంటున్నారు" భోజనాల కార్యక్రమం తర్వాత మొదలయింది రేవతి హడావుడి.

"ఈయనకు బయట తిండి సరిపడదు" అంటూ ఏవేవో టిఫిన్స్ తయారీ. "ఇది కావాలా, అది ఉండద్దూ" అంటూ సర్దుడు, మొత్తానికి నెల్లాళ్ల ట్రిప్ అంత సామాగ్రి చేర్చింది తీసుకెళ్లడానికి.

"ఇదంతా ఎందుకు కానీ, మూవర్స్ అండ్ పాకర్స్‌కు బుక్ చేస్తే పాపం ఆ షిఫ్టింగ్ ఏదో వాళ్లే చేసుకుంటారు. చెయ్యనా రేవతీ" కార్తీక్ వెటకారం.

మొత్తానికి ప్రయాణం ఘడియలు రానేవచ్చాయి. కారులో కార్తీక్ రేవతిలతోబాటు ఒకే ఒక్క సూట్‌కేస్, చిన్న ఎయిర్‌బాగ్ మాత్రమే రావడం చూసి లబోదిబోమంది రేవతి.

"చూడు కారులో వెడదాం అంటే ట్రైన్ జర్నీ టన్నల్స్‌లోంచి చాలా బాగుంటుందిట అంటూ సరదాపడ్డావ్. ఇప్పుడు బండెడు సామాను వెంట తీసుకుని ఎవరు తిరుగుతారు చెప్పు. అయినా మనకేం కావాలో నాకు తెలుసు. అవన్నీ తెస్తున్నా. మాట్లాడకుండా హాయిగా కూర్చో" కోప్పడ్డాడు కార్తీక్.

కారులో స్టేషన్ వరకూ దిగబెట్టి దగ్గరుండి రైలు ఎక్కించి సంతోషంగా వెనుదిరిగారు శంకరం దంపతులు పిల్లలతోసహా.

"పాపం పిచ్చిపిల్లలు. ఇంత చిన్నవయసులోనే ఎన్ని చేదు అనుభవాలూ, పాఠాలూ నేర్చుకున్నారో. ఇప్పటికి స్థిమితపడి ఆనందంగా ఉన్నారు. ఇకనైనా వీళ్ల జీవితాలు హాయిగా గడచిపోతే అంతేచాలు" నిట్టూర్చారు పార్వతమ్మగారు.

"వాళ్ల జీవితాలకేం. ఇక హాయిగా ఉంటారు. వాళ్లూ... వాళ్ల నీడలో మనం, అయినా బంగారానికైనా కొలిమిలోనే వన్నె పెరిగేది. అలాగే ఎవరికైనా ఎన్ని కష్టాలూ, ఇబ్బందులూ ఎదురైతే అన్ని అనుభవాలూ, పాఠాలు నేర్చుకుంటారు. రాటుదేలి నిలబడగలుగుతారు. అలాంటి వాళ్లకింక లైఫ్‌లో ఎదురుండదు"

"ఏం... ఎదురుండదో... ఏమో... ఎన్ని శ్రమలకోర్చి పెంచి పెద్దచేస్తే వీళ్లంత వాళ్లు అవ్వాలి పిల్లలు, ఆ విషయం గుర్తించక ప్రేమా, పెళ్లి అంటూ వాళ్ల వరకే వాళ్లు చూసుకుంటున్నారు ఈవేళ రేపు పిల్లలు. అది నరకమే అవుతుందో, స్వర్గమే అవుతుందో కాలమే తేల్చి చెప్పాలి. ఎన్ని కలలు కన్నాం. ఎంత పద్ధతిగా పెంచాం. ఎన్ని ఆశలు వాళ్లమీద పెట్టుకున్నాం. ఏం చేశారు మన పిల్లలు, చివరికి ఎలా అన్యాయం అయిపోయారో కదా, వాళ్లని తల్చుకుంటేనే గుండె చెరువయిపోతోంది" బాధగా అంది పార్వతమ్మ.

"వద్దు పార్వతీ... వద్దు. గతించిన వాళ్ళ జ్ఞాపకాలు కాలగర్భంలోనే కలసిపోనీ, వాటిని కలలో కూడా తలచుకోకు. ఇప్పుడు మనకు ఏం తక్కువైందని. కనకపోయినా, పెంచకపోయినా ఈ కార్తీక్ రేవతిలే మన బిడ్డలనుకుందాం. వాళ్లని చూసుకునే సంతోషిద్దాం" గొంతు బొంగురుపోయింది బాధతో

"అంతేలెండి ఎవరికెంత ప్రాప్తమో. ప్రాప్తం అంటే గుర్తొచ్చింది. ఆ వెంకటేశం, వాళ్ళ ఆవిడ, అదే మన కార్తీక్ తల్లితండ్రులు... వాళ్లకెంత అక్కసుగా ఉందో మనం యిలా కార్తీక్ ఇంట్లో ఉండటం. వాళ్లు సర్దుకుపోకుండా పిల్లల మంచితనం

గ్రహించకుండా రెండురోజులు కూడా ప్రశాంతంగా ఉండక, ఉండనీయక పోవడం మన తప్పా చెప్పండి. ఉన్న రెండురోజులూ మనల్ని సరే, కోడలు అనైనా లేకుండా పాపం పిచ్చిపిల్ల ఆ రేవతిని ఎంతలా చెండుకు తిన్నారు. అందుకే కార్తీక్ ఎంత చెప్పినా వినకుండా వాళ్లనలా ఆ పల్లెలోనే ఉంచి డబ్బు పంపుతున్నాడు. అదంతా మనవలననే అని వాళ్ల నమ్మకం, కడుపు మంట"

"పోనిద్దూ... ఎవరు ఎలాంటివాళ్లు అనేది అందరికీ తెలుసు. అలా పాండురంగస్వామి గుడికి వెడదామా... కాస్త మనసు ప్రశాంతంగా ఉంటుంది" అడిగాడు శంకరం.

"సరే... ఇప్పుడు ఇంటికి వెళ్ళి మాత్రం మనం చేసేదేముంది కనక" వెంటనే అంది పార్వతమ్మ.

"డ్రైవర్... కారు ఆ పాడురంగస్వామి వారి ఆలయానికి పోనీ" చెప్పాడు శంకరం.

"సరే సర్..."

చాలా సేపు గుడి ప్రాంగణంలో పిల్లలిద్దరూ పరుగులు పెట్టి ఆడుకుంటుంటే అలా కూర్చుండిపోయారిద్దరూ. మనసు ఎంతో ప్రశాంతంగా అనిపించింది. అంతలో...

"నమస్తే అంకుల్ బాగున్నారా? నన్ను గుర్తుపట్టారా? " అలా అడుగుతున్న అతడిని ఎక్కడో చూసినట్లే అనిపించింది కానీ ఎవరో వెంటనే గుర్తురాలేదు శంకరంగారికి.

"నేను... రాజేష్‌ను అంకుల్. కార్తీక్ వాళ్ళతో చదువుకున్నాను. మీరు కార్తీక్ కోసం కాలేజీకి వచ్చేవారుగా అందుకే మీరు నాకు తెలుసు. అన్నట్లు కార్తీక్, రేవతీ బాగున్నారా? వాడిప్పుడు మంచి లీడింగ్ లాయరటగా. అదంతా మీ చలవేనట. ఈ ఊరు వచ్చినప్పటినుండి అనుకుంటున్నా వాడిని కలవాలని, ఎక్కడుంటున్నారు? ఎలా ఉన్నారు? " చాలా ఆత్మీయంగా అడిగాడు రాజేష్.

రాజేష్ ఎవరో ఏమిటో వాళ్ళకు బాగా తెలుసు అన్న నిజం స్పష్టంగా వాళ్లలో కనబడ్డ కలవరమే చెప్పింది.

"వాళ్లా... వాళ్ళు ఊళ్ళో లేరు. అరకు వేలీ వెళ్ళారు" తొందర తొందరగా చెప్పింది పార్వతమ్మ.

వాళ్ళ విషయం చెప్పకపోవడమే మంచిదేమో అని ఆలోచిస్తున్న శంకరంగారు హతాశులయ్యారు ఆ మాటలు విని.

రాజేష్ ముఖంలో మెరిసిన ఆ మెరుపు , పెదాలపై ఆ వంకరనవ్వు త్రుటిలో పసిగట్టిన శంకరంగారు తల్లడిల్లిపోయారు.

"నేను రాజమండ్రిలోనే ఉంటున్నాను మా మెడికల్ షాపు చూసుకుంటూ... ఈ ఊళ్లో పనిబడి ఇలా వచ్చాను. వచ్చినపని నిర్విఘ్నంగా పూర్తయ్యేలా చూడమని ఆ దేముడిని వేడుకుందామని ఇలా వచ్చాను. ఆదిదంపతుల్లాంటి మీరు కూడా ఇక్కడే కనిపించారు. పెద్దవాళ్లు మీ ఆశీర్వాదం నాకు కావాలి " చాలా వినయంగా మాటాడుతున్నాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలిన చందంగా వుంది రాజేష్ పని. మనసు సంతోషంతో పొంగిపోతుండగా వాళ్ళకి నమస్కారంచేసి సెలవు తీసుకున్నాడు.

ప్రశాంతంగా వున్న నదిలో రాళ్ళు విసిరినట్లు అల్లకల్లోలమయిపోయింది. శంకరంగారు, పార్వతమ్మల అంతరంగాలు భయంతో వణికాయి.

ఇద్దరి మనసుల్లో ఒకటే భావన. "ఎన్నో కష్టాలకోర్చి చేదు అనుభవాలని రుచిచూసి వాళ్ళిద్దరూ ఇప్పుడిప్పుడే జీవితంలోని ఆనందాన్ని రుచిచూస్తున్నారు. వాళ్ళకిక ఏ కష్టాలూ ఉండవు" అనుకున్న. కొన్ని క్షణాల్లోనే వాళ్ళ జీవితాల్లో పెనుతుపాను రాజేష్ రూపంలో రానుందా? దేముడా ఆ అమాయకులను నువ్వే రక్షించు తండ్రీ.

భారమైన మనసుల్తో క్షణమొక

యుగంలా వాళ్ళ రాకకోసం ఎదురుచూస్తూ గడుపుతున్నారు.

★ ★ ★

"వావ్... ఎంత అందంగా... ఎంత ప్రశాంతంగా ఉందీ ఈ గెస్ట్ హౌస్ ప్రాంతం" ప్రయాణం అంతా చిన్నపిల్లలా కేరింతలు కొడుతూ రకరకాల భావవిన్యాసం చేస్తూ అలసిపోయిన రేవతికి ఆ అరకులోయ అందాలు చూస్తూనే మళ్ళీ హుషారు వచ్చేసింది.

"అలాగా...మాడమ్! అరకు అందాన్నంతా ఒక్క 'వావ్' ఎక్స్‌ప్రెషన్‌లో చూపించావు. చాలా సంతోషం కానీ తల్లీ నాకు నీ అంత భావుకత లేదుకానీ ముందు రూంకెళ్ళి హాయిగా స్నానం చేసి కడుపునిండా లాగిస్తే కానీ నాకే అందాలూ కనబడవ్. దేవిగారు వస్తారా లేకపోతే ఇక్కడే ఇలా నించునే ప్రకృతిని భోంచేస్తారా"

"అంత లేదులే. నాకు నీకన్నా చచ్చే ఆకలిగా, నీరసంగా ఉంది. పద"

"అలారా దారికి. నడు" ముందుకి నడిచాడు కార్తీక్. ఆ పూటకు బాగా రెస్ట్ తీసుకుని రిలాక్స్ అయి సాయంత్రం బయలుదేరారు అరకు అందాల విందారగింపుకు.

ఇద్దరికీ చాలా థ్రిల్లింగ్‌గా, ఎగ్జైటింగ్‌గా ఉంది. చాలా రోజుల తర్వాత అదీ వాళ్ళిద్దరూ మాత్రమే ఇలాటి అందమైన, మనోహరమైన చోటుకు రావడం. 'ఎందరో టూరిస్ట్‌లు. బొటానికల్ టూర్‌గా వచ్చిన స్టూడెంట్స్, విహారయాత్రగా వచ్చిన వాళ్ళు, హనీమూన్ జంటలు అమ్మో, విదేశీయులు కూడా ఉన్నారే. ఏదిఏమైనా మారుమూల ప్రాంతమైన అరకును అందాల లోయగా తీర్చిదిద్దిన ఘనత, పర్యాటకకేంద్రంగా మార్చేసిన ఘనత మాత్రం ఎ.పి.టూరిజం వారిదే సుమా' అనుకున్నాడు మనసులో.

"ఏమిటీ. కార్తీ ఇక్కడ కూడా నీ ఆలోచనలేనా, ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" నాగార్జున సిమెంట్ రేకుల యాడ్‌ని అనుకరించింది రేవతి.

"ఇంత అందాన్ని ఎలా ఆస్వాదిద్దామా అని" అంటూ రేవతికి కన్నుగీటాడు చిలిపిగా.

"ఏయ్... నిన్నూ..." సిగ్గుపడిపోయింది రేవతి.

"నిజంరా రేవూ... ఎప్పుడో ఇంటర్ చదివేటప్పుడు, అదే మన లవ్‌సీను స్టార్టు అవకముందు ఓ సారి ఫ్రెండ్స్‌తో సరదాగా వచ్చాను. అసలు ఇది అదేనా అన్నంతగా మారిపోయింది" అని "అవునూ ఎవరైనా గైడ్‌ని ఎంగేజ్ చేసుకుందామా అన్నీ చూడటానికి" అన్నాడు.

"వాడెందుకు మన మధ్య పానకంలో పుడకలాగా. నేనే నీకు చూపిస్తా"

"ఏమిటి నువ్వు చూపించేది" కొంటెగా అడిగాడు కార్తీక్.

"ఏయ్ అలా మాటాడితే నీతో రానుపో" అలిగింది రేవతి.

"అమ్మో... అంత పని చెయ్యకు. నువ్వు నా గుండెవి. బుల్‌బుల్ నువ్వుండాలే"

"నాయనా! ఆ పాతాళభైరవి ఎన్నిసార్లు చూశావ్. మాటాడితే డైలాగ్స్‌తో అదరగొట్టేస్తున్నావ్ ఈమధ్య"

"ఎన్నిసార్లోనా, ఓ పాతికసార్లేమో బహుశా! ఎలాంటి సినిమా అది. అసలు నాలాంటి ప్రేమికులకు ఆ తోటరాముడే ఓ ఇన్‌స్పిరేషన్" తన్మయత్వంతో అన్నాడు కార్తీక్.

"నువ్వు తోటరాముడివేమోగానీ నేను మాత్రం రాజకుమారిని కానులే"

"సరె... సరె. మనం ఇలా కబుర్లు చెప్పుకుంటూ, ఒకళ్లనొకళ్లు చూసుకుంటూ, తిట్టుకుంటూ గడిపేద్దామా చూసేదేమయినా ఉందా"

"మనకి ఉన్న సమయం రెండు రోజులు మాత్రమే కనుక టయిమ్ వేస్ట్ చెయ్యకుండా చూడవలసినవి చూసేసి, చెయ్యవలసినవి చేసేస్తే ఓ పనయిపోతుంది" నవ్వుతూ కళ్లు చికిలించాడు కార్తీక్.

# ఏరినముత్యాలు

* ఎవరికైనా విమర్శల బాధ తప్పదు. సింహమైనా ఈగల బాధ నుంచి తప్పించుకోలేదు.

–జర్మన్‌సామెత

* సంశయవాదం అత్యున్నత విధి. గుడ్డినమ్మకం క్షమార్హం కాని పాపం.

–థామస్‌హక్స్‌లే

* పగతీర్చుకుంటే ఆ రోజు మాత్రమే ఆనందం కలుగుతుంది. ఓర్పు చిర కాలం నిలబడే కీర్తిని ఇస్తుంది. ఒకరోజు ఆనందం కోసం చిరకాలం కలిగే ఆనందాన్ని బలిపెట్టకూడదు.

–తిరుక్కురళ్

* నేను పెద్దవాడిని అవుతున్న కొద్దీ మనుషులు ఏం చెబుతున్నారన్న దాన్ని అట్టే పట్టించుకోను కాని వారేం చేస్తున్నారో మాత్రం కనిపెట్టి చూస్తాను.

–ఆండ్రుకార్నీజి

* నిజాయితీపరుడైన వ్యక్తి తన అంతరాత్మ అంగీకరించని పని చేయ లేడు.

–హోమ్

* నీ బాధకు కారణం ఏదైనా కావచ్చు. ఆ కారణంతో ఇతరులకు మాత్రం హాని చేయకు.

–గౌతమబుద్ధుడు

* కొద్దిపాటి నిర్లక్ష్యం కూడా ఒక్కొక్కసారి పెద్దపెద్ద సమస్యలను సృష్టి స్తుంది.

–ఫ్రాంక్లిన్

* ఉన్నత మనస్కుడు ఒకరిని అవమానించడు. అవమానాన్ని సహిం చడు.

–రూజ్‌వెల్ట్

* ఆదర్శాలు లేని వ్యక్తులు ఎన్నటికీ ఎదగలేరు.

–అలివర్‌గోల్డ్‌స్మిత్

* ఎవరూ తప్పు పట్టనంత ఉత్తమంగా చేసేవరకూ ఆగుదామని మనిషి భావించి ఉంటే లోకంలో ఏ పనీ అసలు జరిగి ఉండేదే కాదు.

–కార్డినల్ న్యూమాన్

* అపజయం పొందడం కాదు, ఉన్నత లక్ష్యం లేకపోవడమే నేరం.

–జేమ్స్‌రస్సెల్

* మీరు వీలయినంత వరకూ ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ ఉండండి. అది కారు చౌక అయిన ఔషధం.

–బైరన్

సేకరణ: భూక్యా గోపీనాయక్

"ఇదిగో కార్తీ. ఇందాకటి నుంచి చూస్తున్నా నువ్వు ఏదోలా మాటాడుతూ, అదోలా బిహేవ్ చేస్తున్నావ్. ఇలా అయితే మనం ఏమీ చూడలేం. బుద్ధిగా ఉండు. సరేనా" కసిరింది రేవతి.

"ఆ తప్పు నాది కాదంటే మన్నించుమా ప్రియా.... అరకింత చల్లగా ఉంటే నా చెంత నువ్వు నిలుచుంటే ఆ తప్పు నాది కాదంటే... మన్నించుమా... ప్రియా ఆ... ఆ ..."

"కార్తీక్ ఏమయింది నీకు. నీ తిక్కకుదరాలంటే ఇలా కాదు ఏయ్ అబ్బాయ్, ఓ బాబూ... నువ్వు గైడువేనా" అటుగా పోతున్న ఓ పన్నెండు పధ్నాలుగేళ్ల కుర్రాడిని పిలిచింది.

"వాడు గైడో కాదో కానీ నేమాత్రం ఆల్ యిన్ఒన్ని" మెల్లిగా గొణిగాడు కార్తీక్.

వస్తున్న నవ్వుని బిగపట్టి విననట్లు నటించింది రేవతి.

"ఎస్ సిస్టర్. నాకీ ప్రాంతం అంతా కొట్టిన పిండి. మీకు అన్నీ వివరించి చెబుతూ మరీ చూపిస్తా. రోజుకి వంద రూపాయలు" చెప్పాడా కుర్రాడు.

"అమ్మో వందరూపాయలా. వద్దులే మేమే చూస్తాం"

"మీలాంటి వాళ్లు కూడా అలా అంటే ఎలా సిస్టర్. పోనీ తొంభై ఇవ్వండి" ఉదారంగా పది రూపాయలు తగ్గించాడు వాడు.

"అబ్బా రేవతీ. ఇప్పుడు కూడా బేరాలేనా! అలాగే లేవోయ్ వంద ఇస్తాలే. అయితే తీసుకెళ్లడం వరకే నీ డ్యూటీ. అంతేకానీ మమ్మల్ని చూడనీయకుండా, ఎంజాయ్ చెయ్యనియ్యకుండా రన్నింగ్ కామెంట్రీ, గబగబా తిప్పెయ్యడం లాంటివి చెయ్యకూడదు. ఓకే"

"అలాగే, మీ ఇష్టం పదండి" హుషారుగా అన్నాడా కుర్రాడు.

"అదేమిటండీ అతను తొంభై అడిగితే మీరు వంద అంటారు" విసుక్కుంది రేవతి.

"మన ప్లెజర్ ట్రిప్‌లో నేను అతనికిచ్చే టిప్ అనుకో ఆ పదీ. అయినా అసలు సిసలైన పిసినారి నారివైపోతున్నావోయ్" రేవతి చెయ్యందుకుంటూ అన్నాడు కార్తీక్.

"ఆడవాళ్లు అంతే సార్! ఎంతైనా మనలా బ్రాడ్‌గా ఉండరు"

"హార్నీ వేలెడంత లేవు అంతంత డైలాగ్స్. వద్దురారేయ్. నాకూ మీ సిస్టర్‌కి మధ్య ఫిట్టింగ్స్ పెట్టకు. అసలే అరకువేలీ చలీ..."

"ఏయ్ కార్తీక్! ఇదిగో బాబూ నీ పేరేమిటి" కార్తీక్‌తో లాభంలేదని ఆ అబ్బాయిని డైవర్ట్ చేసింది రేవతి.

"నా పేరు సింహాద్రి. నాకీ ఊరు నా చిన్నప్పటినుంచి తెలుసు. ఇక్కడ చూడాల్సినవి ఎన్నో ఉన్నాయి. ముందుగా ఎక్కడికి వెడదాం. పద్మావతీ గార్డెన్స్, బొర్రా కేవ్స్. అన్నింటికంటే సాపురాయి చాలా బాగుంటుంది. కానీ అక్కడకు ఇప్పుడొద్దు రేపుపొద్దునయితే ఎక్కువసేపు గడపవచ్చు ఆ అన్నట్లు చెప్పడం మరిసా. రేపు సాయంకాలానికి మాత్రం ఎటూపోకండి. టూరిస్ట్ బంగ్లా దగ్గర భలే బాగుంటుంది. కొండోళ్లు వచ్చి భలేగా డాన్స్ చేత్తారు" గడగడా చెబుతున్నాడు సింహాద్రి నడుస్తూనే.

"డాన్సా! ఏం డాన్స్? ఎవరు చేస్తారు" ఉత్సాహంగా అడిగింది రేవతి.

"దాన్ని థింసా అంటారు. కొండోళ్లు, అదే మీరు గిరిజనులంటారే వాళ్లు. ఆడోళ్లూ మగోళ్లూ కలిసి చక్కగా డప్పు వాయిస్తూ గుండ్రంగా తిరుగుతూ చేస్తారు. అయినా నేచెప్పడం ఎందుకూ మీరే చూస్తారుగా. గబగబా నడవండి మొదలు పద్మావతీ గార్డెన్స్‌కు వెడదాం. మళ్లీ ఎక్కువసేపు గడపలేరు లేటయితే" వేగం పెంచాడు సింహాద్రి.

"అదిగో అదే పద్మావతీ గార్డెన్స్.

నేపోయి టికెట్స్ తేనా?" మంచి బేరం దొరికిన హుషారులో ఉన్నాడు సింహాద్రి.

"ఇదిగో పోయి పట్రా" జేబులోంచి ఓ యాభై నోటు తీసి ఇచ్చాడు కార్తీక్.

"క్షణంలో తెస్తా" పరిగెట్టాడు వాడు.

"అబ్బ ఎంత బాగుందోకదూ కార్తీక్ ఈ ప్రాంతం. గార్డెన్స్ బయటే ఇంత ప్రశాంతంగా అందంగా ఉంటే ఇంక లోపలెంత బాగుంటుందో. అసలు అరకువేలీ అందాలు చూడటానికిదే మంచి సీజనట ఇందాక వాళ్లెవరో అనుకుంటూంటే విన్నా" అంది రేవతి.

"ఇంత మంచి ఆలోచన చేసిన నీకు తప్పక ఏదైనా ప్రజెంటేషన్ ఇవ్వాల్సిందే. ఏం కావాలిరా నీకు" ప్రేమగా అడిగాడు కార్తీక్.

"ఎప్పుడూ నన్నింత ప్రేమగా చూడు. చూస్తావుకదూ" గొంతు గద్గదమైంది రేవతికి.

"ఏయ్ పిచ్చా... ఏమిటా మాటలు నువ్వు నా ప్రాణం" ఆపై మాటలు రాక ఆమె చేతిని నులివెచ్చగా నొక్కాడు కార్తీక్.

ఆ నులివెచ్చని ఆప్యాయత ఆమె మనసు పొరలను తాకింది. ఎన్ని పువ్వులో. రంగు రంగుల పూలు, రకరకాల పూలు... ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యింది రేవతి.

"అక్కా వీటిని పొద్దుతిరుగు పూలంటారు. అదే సన్‌ఫ్లవర్. ఇక్కడ ఈ పూలు చాలా ఫేమస్. ఇది సూర్యుడితోబాటుగా తిరుగుతాయి తెలుసా. అంటే సూర్యుడితో పాటు పూచి సూర్యుడు ఎటువైపుగా పొద్దు వాలిపోతాడో అటుగా తిరిగిపోతాయన్న మాట" పెద్దపెద్ద సన్‌ఫ్లవర్స్ చేతుల్లోకి తీసుకు ముద్దాడింది రేవతి.

"అక్కా వాటినలా ముట్టుకోకూడదు. మాలీ చూస్తే అరుస్తాడు" మెల్లిగా హెచ్చరించాడు సింహాద్రి.

ఒక్కచోట నిలవకుండా ఆ గార్డెనంతా అలా తిరుగుతూనే ఉన్నారు కార్తీక్, రేవతులు. వాళ్లిద్దరికీ బోలెడన్ని ఫొటోలు తీశాడు సింహాద్రి.

ప్రపంచంలో ఉన్న అందం, ఆనందం అంతా అక్కడే ఉన్నట్లు ఫీలయ్యారు.

"సార్.. ఈసారి బొర్రా కేవ్స్‌కి వెడదామా అక్కడంతా రంగురంగుల లైటింగ్‌తో చాలా బాగుంటుంది నైట్‌టైమ్" ఎనిమిదవుతుండగా అన్నాడు సింహాద్రి.

"ఇంకాసేపు ఉందాం సింహాద్రీ! ఇక్కడ చాలా బాగుంది" ఆ ప్రాంతం వదలలేనట్లుంది రేవతికి.

"అక్కడింకా బాగుంటుంది అక్కా. కావలిస్తే ఇక్కడికి మళ్లీ రేపు సాయంత్రం వద్దాం" డిసైడ్ చేసేశాడు సింహాద్రి ఉత్సాహంగా. వాళ్ల ఉత్సాహం, ఆనందం మైమరపు చూస్తుంటే వాడికీ చాలా ఉత్సాహంగా ఉంది.

"అబ్బా ఎంత బాగా అరేంజ్ చేశారో లైటింగ్ అదీ. ఇదివరకు అసలు ఇక్కడంతా చీకటిగా గబ్బిలాలు అవీ తిరుగుతూ పగలు రావాలంటేనే భయంగా ఉండేది" రేవతితో అన్నాడు కార్తీక్.

"నిజంగా చాలా బాగుంది కార్తీ. అసలు మన పక్కన మన ఆంధ్రాలోనే ఇంత అందమైన లొకేషన్ ఉందని కూడా చాలామందికి తెలియదు. సినిమా వాళ్ల కళ్లు ఇంకా ఇక్కడ పడలేదేమో" అంది రేవతి.

"ఎందుకులేదూ. ఇక్కడ ఈమధ్య సినిమా షూటింగ్‌లు కూడా తీస్తున్నారు. మొన్నీమధ్య అదేదో సినిమా షూటింగ్ తీశారక్కా" సినిమా టాపిక్ వాడి ఉత్సాహాన్ని మరింత పెంచింది.

"సార్! ఇక్కడ కాఫీ, టీ తోటలు కూడా ఉన్నాయి. రేపు చూద్దాం. నేనయితే వాటిని ఆంధ్రా నీలగిరీస్ అంటాను తెలుసా"

"అబ్బా నీకు నీలగిరీస్ కూడా తెలుసా" అడిగింది రేవతి.

"ప్చ్... పుస్తకాల్లోనే చదివాను. నేను పెద్దయ్యాక బాగా డబ్బు సంపాదించి మన

దేశంలో ఉన్న అన్ని అందమయిన ప్రాంతాలు చూస్తాను. అప్పటివరకూ పుస్తకాల్లో చదవడం, ఎవరైనా చెబితే వినడం అంతే" ఆ గొంతులో చూడాలనే ఆశ, చూడలేదనే నిరాశా ఒకేసారిగా పలికాయి.

"తప్పకుండా చూస్తావ్ నువ్వు. అసలు ఎవరైనా ఏదైనా మనస్ఫూర్తిగా చెయ్యాల అనుకుంటే అది చెయ్యకుండా ఉండరు తెలుసా" ఓదార్పుగా అంది రేవతి.

"అవునూ నువ్వు ఎంత వరకూ చదువుకున్నావ్" హఠాత్తుగా అడిగాడు కార్తీక్.

"ప్చ్. ఏదీ ఐదు పాస్ కాగానే మా నాయన నన్నీ పనిలో పెట్టేశాడు. నేను స్కూలుకెళ్లి చదువుకుంటే మరి సొమ్ములెలా. అందుకే.." చదువుకోలేకపోయిన బాధ ధ్వనించింది సింహాద్రి గొంతులో.



"నేను నిన్ను నాతో తీసుకెళ్లి చదివిస్తా.. వస్తావా"

"ఆ వస్తా. చక్కగా చదూకుంటా" ఉత్సాహంగా అన్న సింహాద్రి అంతలోనే డల్ అయిపోయాడు. "కానీ, కానీ... మా నాయన నన్ను పంపడు. నన్ను కనక పంపితే కుటుంబం గడవడానికి సొమ్ములేడ నుంచి వస్తాయి? " నిరాశగా అన్నాడు.

"సర్లే.. మీ నాన్నతో నే మాట్లాడి వప్పిస్తా. కానీ నువ్వు మాత్రం శ్రద్ధగా చదువుకోవాలి సరేనా"

"నేను తప్పకుండా శ్రద్ధగా చదువుకుంటా అమ్మతోడు" తెచ్చిపెట్టుకున్న స్టైల్... పెద్దరికం అంతా పోయి అచ్చమైన పల్లెపిల్లకాయ్ అయిపోయాడు సింహాద్రి.

రాత్రి బాగా పొద్దుపోయింది. చలి గజగజలాడిస్తోంది. ఇక రూంకెళ్లిపోవాలనుకుని సింహాద్రిని రేపు ఉదయమే గెస్ట్‌హౌస్ దగ్గరకు రమ్మని రూం చేరారు కార్తీక్, రేవతి.

బాగా అలసిపోయారేమో ఇద్దరూ ఫ్రెషయ్యి ఆర్డర్ చేసిన మీల్స్ కానిచ్చి వాలిపోయారు బెడ్‌మీద.

"గుడ్మాణింగ్ డియర్" కార్తీక్ మీదుగా వంగి తట్టి లేపింది రేవతి. లేత గులాబీ రంగు చీరలో నీట్‌గా డ్రస్ అయి గులాబీ బాలలా వుంది రేవతి. అలా చూస్తుండిపోయాడు కార్తీక్.

"ఏమిటలా కళ్లు తెరిచి నిద్రపోతున్నావా. ఏడు గంటలవుతోంది. త్వరగా తయారయితే ఈలోపు సింహాద్రి వచ్చేస్తాడు. అవునూ నిన్న పాపం సింహాద్రికి అలా ఆశ పెట్టారమిటి? వాడు నిజం అనుకుని ఎంత సంబరపడిపోయాడో"

"నిజం అనుకోవడం ఏమిటి, నిజంగానే వాడిని మనతో తీసుకెడదాం. వాడు ఎంత వరకూ చదువుకుంటే అంత వరకూ చదివిద్దాం" సింపుల్ అన్నట్లు మాట్లాడేడు కార్తీక్.

"నిజం" ఆశ్చర్యంగా అంది రేవతి.

"ఇదిగో నువ్వలా హావభావ విన్యాసం చేస్తే నా బుద్ధి అసలే మంచిదికాదు" బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు కార్తీక్.

"అమ్మో... నేనలా బాల్కనీలోంచి అరకు వీక్షణం గావిస్తూ ఉంటాను. తమరు త్వరగా తయారయి రండి సార్" పారిపో



యింది రేవతి. నవ్వుకుంటూ కార్తీక్ లేచి త్వరత్వరగా ఫ్రెషయి ఇద్దరూ కలసి రెస్టారెంట్ కొచ్చారు. అప్పటికే అక్కడ సింహాద్రి వెయిట్ చేస్తున్నాడు.

“గుడ్మార్ణింగ్ సార్” అంటూ.

నీట్ గా ఉతికిన బట్టల్లో చక్కగా నవ్వుతూ విష్ చేసిన సింహాద్రి ముఖంలో చాలా ఆరాధన, నమ్రత కనిపించింది కార్తీక్ కు.

‘ఓహో ఇదొకటుందికదూ. వెళ్లే లోపు వీళ్ల నాన్నని కలసి మాట్లాడి ఒప్పించాలి’ అనుకుంటూ “హాయ్ సింహాద్రి! రా టిఫిన్ చేసి వెడదాం” రెస్టారెంట్ లోకి నడిచాడు.

“వద్దు సార్. నేచేసినా. మీరు పోయి చేసి రండి” మొహమాటపడ్డాడు.

“ఇదిగో అలా కుదరదు. అంత మొహమాటం అయితే నువ్వు నాతో ఎలా వస్తావ్. నా దగ్గరెలా ఉంటావ్. రా”

ఆ మాట మంత్రంలా పనిచేసింది. “పదండి సార్” అన్నాడు సింహాద్రి.

“మళ్లీ ఎన్నింటికో భోజనం” అనుకుంటూ

ముగ్గురూ టిఫిన్ ఫుల్‌గా లాగించారు.

"అక్కా సాపురాయని చెప్పానే ముందు అక్కడకు వెడదాం. అక్కడ చాలా బాగుంటుంది" ముందుకు దారితీశాడు సింహాద్రి.

నిజంగా పచ్చని చెట్లతో నిండాపూలతో నున్నటి బండరాళ్ల మీదుగా సాగిపోతున్న వన్నెలవాగు. అడుగేస్తే జారిపోతూ మిల మిలా మెరిసిపోతూ ఆ రాళ్లమీదుగా నీళ్లు గలగలా ప్రవహిస్తుంటే చూడటానికి రెండు కళ్లు చాలవనిపించేలా వుంది.

"అక్కా... అలా కనిపిస్తుందికానీ ఇక్కడ బాగా నీళ్లున్నప్పుడు దిగడం చాలా ప్రమాదం. ఆ వేగానికి జారి కొట్టుకుపోతే శాల్తీ గల్లంతే" వింటూనే కార్తీక్ చెయ్యి గట్టిగా పట్టుకుంది రేవతి.

నీళ్లు మధ్యస్థంగా ఉండి వడి ఎక్కువ లేకపోవడంతో అలా నీళ్లలో ఆడుతూ ఎక్కువసేపే గడిపేసారక్కడ.

"సార్ మరీ ఎక్కువసేపు ఇక్కడుండిపోతే ఇంకా కాఫీ తోటలూ, టీ తోటలూ చూడాలా. మళ్లీ మూడు గంటలకల్లా భోంచేసి గెస్ట్‌హౌస్ దగ్గరకెడితే నా సామి రంగ అక్కడ ఆ కొండోళ్లు చేసే డప్పుల డాన్స్ చూసేతీరాల" ఊరించాడు సింహాద్రి.

"సరె... సరె. వెడదాం రేవతీ ఇంక చాలు. చిన్నపిల్లలా నీళ్లతో ఆ ఆటలేమిటి? " న్యూస్‌పేపర్‌తో పెద్దపెద్ద పడవలు చేసి నీళ్లలో వదులుతోంది రేవతి.

"నాకు అలాగే బాగుంటుంది" నవ్వింది రేవతి.

"మరి కాఫీ, టీ తోటలు చూడద్దా. అదేం డాన్స్.. థింసా డాన్స్ అది చూడద్దా! లే మరీ వెడదాం" కొంచెం కంగారు పెట్టాడు కార్తీక్.

"వెడదాం ఉండు కార్తీ" గారంగా అంది రేవతి.

"పోనీ ఇక్కడే ఉండిపోదామా"

"అమ్మో నా పిల్లలు" గభాలున లేచింధి నిజంగా అక్కడ ఉండాలేమో వాళ్లని వదిలేసి అన్నట్లు.

"అలారా దారికి" నవ్వేశాడు కార్తీక్.

"నిజంగానే కార్తీక్! అప్పుడే వాళ్లని చూసి కొన్ని యుగాలయినట్లు వుంది. పాపం ఆంటీ వాళ్లనీ ఏం ఏడిపిస్తున్నారో. నేనేమో ఇక్కడ హాయిగా తిరుగుతున్నాను" ఫీలయింది రేవతి.

"చెప్పులిలా వదిలేసి కాస్త ఆ రోడ్డువారగా నడుస్తావా ఓసారి" సీరియస్‌గా అన్నాడు కార్తీక్.

"వద్దు సార్! అక్కడంతా పల్లేరు కాయలున్నాయి" కంగారుగా వారించాడు సింహాద్రి.

"మరి తను హాయిగా ఉన్నానని బాధపడిపోతోందికదా! కాస్త పల్లేరు కాయలు గుచ్చుకుని బాధపడుతూ ఏడుస్తూ ఉంటే బాగుంటుందేమో అని" వివరించాడు కార్తీక్.

"కార్తీక్ నిన్నూ! నాకు పల్లేరుకాయలు గుచ్చుకోవాలనుందా నీకు" వెంట బడింది రేవతి. దొరకకుండా పరుగెట్టాడు కార్తీక్.

"అబ్బా నేనింక పరుగెట్టలేను బాబూ" ఆయాసంగా అంది రేవతి.

"హలో... నిన్నిక్కడ ఎవరూ పరుగెట్టమనలేదు మాడమ్" వెక్కిరించాడు కార్తీక్.

"సార్! మా నాన్నని ఎప్పుడు రమ్మని చెప్పను" ఏదో ఆలోచనలో ఉన్న సింహాద్రి అకస్మాత్తుగా అడిగాడు.

"రాత్రి గెస్ట్‌హౌస్‌కొచ్చి కలవమనోసారి. అన్నట్లు నీ బట్టలూ అవీ సర్దుకో. మనం రేపు మధ్యాహ్నం వెళ్లిపోవాలి" నడుస్తూ చెప్పాడు కార్తీక్.

"అలాగే సార్! అదిగో ఆ కనిపించేదే కాఫీ తోటలు? ఇంకొంచెం ముందుకెడితే టీ తోటలు. దగ్గరగా వెడితే ఇంకా చాలా బాగుంటాయి" వర్ణించాడు సింహాద్రి.

ఇక రేవతి ఆనందానికయితే అవధులు లేవు. చిన్న పిల్లలా పరుగులు, గెంతులు. ఆ తోటల్లో ఫొటోలు తీసుకుని అంతా కలి

యతిరిగి సుమారు మూడు గంటల ప్రాంతంలో గెస్ట్‌హౌస్‌కు బయలుదేరారు తప్పదన్నట్లు, అదికూడ ధింసా డాన్స్ మీద మోజుతో. లేకపోతే వాళ్లకి ఆకలి లేదు ఏం లేదు. వెడుతూనే రెస్టారెంట్‌లో భోజనాలు కానిచ్చేరు. సింహాద్రి వాళ్లతో బాటే.

వాళ్లు భోజనాల దగ్గరుండగానే డప్పుల మోత వినబడసాగింది. రంగు రంగుల పూసల దండలు, చిత్రవిచిత్రమైన వేషధారణ. మగవాళ్లు మెడలో వేలాడేసుకున్నారు డప్పులు. జానపద గేయాలు, రిథమిక్‌గా శ్రావ్యంగా వాళ్లతోబాటే చాలామంది టూరిస్టులు కూడా డాన్స్ మొదలెట్టారు. కార్తీక్, సింహాద్రి కూడా వాళ్లతో చేరిపోయారు. రేవతిని ఎంత రమ్మన్నా వెళ్లలేదు. అంత మందిలోకి వెళ్లబుద్ధి వెయ్యక, అవన్నీ ఉత్సాహంగా చూస్తూ నిలబడింది ఓ పక్కగా.

"హలో... చాలా ఆనందంగా ఉన్నట్లున్నావ్?" ఊపిరి వెచ్చగా మెడలని తాకుతూ నెమ్మదిగా వినబడింది. అదిరిపడి వెనుదిరిగి చూసింది రేవతి.

అంతే... భూతాన్ని చూసినట్లు అదిరిపడింది. "ఏమిటీ నేనెవరో మర్చిపోయావా? లేక గుర్తుపట్టి షాక్ తిన్నావా?" హస్కీగా అడిగాడు.

కంగారుగా కార్తీక్ ఉన్నవైపు చూసింది. వాళ్ళు ఈ లోకంలోలేరు. మైమరచి చిందులు వేస్తున్నారు.

"ఏమిటీ... కార్తీక్‌గాడికోసమా... పోనీ నే పిలవనా?"

"నువ్వు... నువ్వు" చెప్పలేనట్లు ఆగిపోయింది రేవతి.

"ఆ... నేను నేనే. రాజేష్‌ని. నీ మొగుడు కక్షగట్టి జైలుకు పంపిన ఆ రాజేష్‌నే. బయటకెలా వచ్చాను? లేక ఇక్కడకు ఎలా వచ్చానా అని ఆలోచిస్తున్నావా?" పగబట్టిన పాములా బుసకొడుతున్నాడు.

"రాజేష్ అలా మాట్లాడకు. కార్తీక్ నీమీద కక్షగట్టి జైలుకి పంపలేదు. నువ్వే అన్యాయంగా రమ్యని చంపేశావ్. అది రుజువయి జైలుకి వెళ్ళావ్"

"ఆ... అది రుజువవలేదు. మీ ఆయన పట్టుబట్టి రుజువు చేశాడు. నా జీవితాన్ని జైలుపాలుచేసి మీరు ఇక్కడ ఆనందంగా హనీమూన్ జంటలాగా విహరిస్తున్నారు. ఆ దేవుడు నా యందు ఉన్నాడు కనుకనే నాకీ సదవకాశం కలిగించాడు. మిమ్మల్ని శ్రమపడి వెదికే బాధ తప్పించాడు. మీకు ఈరోజే ఆఖరి రోజు. ఆనందించు, ఆనందించు" తోడేల్లా నవ్వాడు.

"ప్లీజ్... రాజేష్. జరిగినవన్నీ మరిచిపో. మనం ఇకనుంచి స్నేహితులం"

"స్నేహితులు... మీరు... నాకా" కర్కశంగా నవ్వాడు.

"ప్లీజ్ మమ్మల్నేమీ చెయ్యకు"

పాట, డప్పులమోత హోరెత్తిపోతోంది. చుట్టూ చేరినవాళ్ళు కూడా ఒళ్ళు మరిచి చిందులేస్తున్నారు.

"సరే... మిమ్మల్ని ఏమీచెయ్యను. రేపు ఉదయం నువ్వోసారి టీ తోటల దగ్గరకి రా. ఏం చెబుతావో ఎలా వస్తావో ఒంటరిగా రా. లేకపోతే నిన్నేం అనను. ఏం చెయ్యను. రేపు ఉదయం ఏడు గంటలకు రాకపోయావో ఏడూ ఐదుకల్లా కార్తీక్ గాడి పని ఫట్. అదిగో కార్తీక్ అలసిపోయి ఇటే వస్తున్నాడు. జాగ్రత్త గుర్తుంచుకో" వెడుతూ ఆగి, "హేపీ టైమ్... ఇంక రేపటి నుంచి అది ఉండదు మీకు" అంటూ చరచరా వెళ్ళిపోయాడు రాజేష్.

ప్రపంచం అంతా గిర్రున తిరుగుతున్నట్లుగా కళ్ళు బైర్లు కమ్మి పాలిపోయిన ముఖంతో అలా శిలలా నిలబడిపోయింది రేవతి.

"అమ్మ... ఈ ఎగ్జైట్‌మెంట్‌కి తల పగిలిపోయేలా వుంది కానీ... ముందు రూం కెళ్ళి బాగా రిలాక్స్ అవ్వాలి. ఎలా వుంది నా డ్యాన్స్" రేవతి ముఖంమీద చిటికేసి

అడిగాడు కార్తీక్.

ఉలుకూపలుకూ లేకుండా అలా కొయ్య బొమ్మలా నిలబడిపోయిన రేవతిని గాభ రాగా చూశాడు. "ఏమయింది. నీకు? రేవతీ..." కుదిపికుదిపి అడిగాడు.

"ఆ డాన్స్ అయిపోయిందా? కార్తీక్ నాకు తల పగిలిపోతోంది. నిలబడలేకపో తున్నా" నూతిలోంచి వచ్చినట్లుంది రేవతి మాట.

"అరె...ఏమైంది సడెన్‌గా. బహుశా ఆ సౌండ్స్‌వల్ల బాగా డిస్టర్బ్ అయ్యావేమో. పద కాసేపు పడుకుందువుగాని" రేవతి చెయ్యందుకున్నాడు కార్తీక్.

రూంకెళ్ళి బెడ్‌మీద అలానే వాలిపో యింది రేవతి.

"అరే... ఎందుకంత డల్ అయ్యావు సడన్‌గా. అయినా వద్దంటే వినకుండా చిన్నపిల్లలా గంతులేశావ్. ఇప్పుడు చూడు. పోనీ డాక్టర్‌ని పిలవమననా" ఆప్యాయంగా అడిగాడు కార్తీక్.

"వద్దు వద్దు. నేను కాసేపు పడుకుం టాను" కళ్ళు తెరవకుండానే అంది రేవతి. ఆమె మనసు రోదిస్తోంది.

'హే భగవాన్. ఏమిటీ పరీక్ష. ఇంక మా జీవితాలకు ఆనందం అనేది ఉండదా. పడే కష్టాలేవో పడ్డాం. ఇకనైనా హాయిగా ఉందా మనుకుంటే ఇప్పుడీ పీడ ఏమిటి? వాడసలే బాగా పగబట్టి ఉన్నాడు. ఒంటరిగా రమ్మ న్నాడంటే... వాడేం అడుగుతాడో ఊహించ లేనంత పసికందేంకాదు తను. అసలే మొదటినుంచీ వాడి కన్ను తనమీద ఉంది. ఇప్పుడు తను కాదంటే కార్తీక్... కార్తీక్‌ని చంపేస్తాడా? అంతవరకూ వస్తే తనే ఆ దరిద్రుడిని చంపేస్తుంది. అంతే... అలాగే చెయ్యాలి. తను భయపడకూడదు' రోది స్తూనే ఆమె మనసు ఆలోచిస్తోంది రకరకా లుగా. 'ఏ ' రాత్రికి రాత్రే ఇక్కడనుంచి పారిపోతే. తన పిచ్చికానీ వీడు శనిగ్ర హంలా వెంటాడకుండా వదిలిపెడతాడా? మంచో, చెడో ఇక్కడే వీడి సంగతి తేల్చుకో వాలి'

భారమైన మనసు నిద్రని దరిచేరనీ యడంలేదు. ఏం చెయ్యాలి, ఎలా వీడి బారినుంచి తాము తప్పించుకోవాలి?

"అరే... రేవతీ... ఇంకా నిద్రపోలా. ఏమిటీ చాలా అనీజీగా ఉన్నావ్? వంట్లో బాగోలేదా? డాక్టర్‌ని పిలవనా? " లాలనగా అడుగుతున్నాడు కార్తీక్.

"ఏం లేదు. కాస్త తలనొప్పిగా ఉంది. నా దగ్గర టాబ్లెట్ ఉందిలే. వేసుకుని పడు కుంటా. నువ్వు నిద్రపో. అన్నట్లు మనం రేపు మధ్యాహ్నం వెళ్ళిపోతాంగా. ఇంక చూడాల్సినవి ఏమేం ఉన్నాయో. ఏం ఉండ వులే. అన్నీ చూసేశాం. నువ్వు హాయిగా పదింటిదాకా పడుకో. మళ్ళీ ఇంటికెళ్ళాకా నీకు క్షణం తీరిక, విశ్రాంతి ఉండవుకదా" యథాలాపంగా అంది రేవతి బ్యాగ్ తెరిచి టాబ్లెట్ తీసి వేసుకుంటూ.

"ఓకే మేడమ్... గుడ్‌నైట్. నీకు తల నొప్పి తగ్గకపోతే మాత్రం నన్ను లేపు" పడుకుంటూ అన్నాడు కార్తీక్.

'రేవతి ఎందుకలా ఉంది. తను డాన్స్ చేస్తూ రేవతినోసారి చూశాడు. రేవతి వెన కగా నిలబడి ఎవరో మాట్లాడుతున్నారు. ఇక్కడ రేవతిని పలకరించేవాళ్ళెవరు? కోపాసింజర్స్ ఏమో అని తను అప్పుడు ఆ విషయం అంతగా పట్టించుకోలేదు. కానీ ఇప్పుడు అనిపిస్తోంది వాళ్ళెవరో తమకు తెలిసినవాళ్ళే. రేవతిని ఎవరో బెదిరిం చారు. ఎస్... బెదిరించారు. అందుకే అలా పాలిపోయిన ముఖంతో శిలలా నిలబడిపో యింది డాన్స్ దగ్గర, రేవతి పాలిపోయిన ముఖంతో నిలబడి ఉండడం కనబడింది కార్తీక్‌కు. 'అవును సమ్ థింగ్ ఈజ్ రాంగ్. ఏదో జరిగింది. ఏదో జరగబో తోంది. లేకపోతే వచ్చినప్పటినుంచి చిన్నపి ల్లలా ఆనందంతో గంతులు వేసిన రేవతి ఎందుకలా అయిపోయింది. డెఫినెట్‌గా

రేవతిని ఎవరో బెదిరించారు. అందులో సందేహం ఎంతమాత్రం లేదు. ఎవరు వాళ్ళు? తను టేకప్ చేసిన కేసుల తాలూకా ఎవరైనా... పోనీ రేవతిని అడిగితే ప్ప లాభంలేదు. చెప్పేది అయితే తనే చెప్పేది. చెప్పకుండా అలా తనలోతనే బాధ పడుతోంది అంటే సమ్ థింగ్ సీరియస్. తనను జాగ్రత్తగా అబ్జర్వ్‌చేస్తే అదే తెలుస్తుంది విషయం ఏమిటీ అనేది'.

★ ★ ★

ఆలోచనలతో ఎప్పటికో నిద్రపోయాడు రాజేష్. ఆలోచనలతో, పీడకలలతో రేవతికి కంటిమీద కునుకే లేదు. ఎవరికేమైనా, ఎవరు ఎలా ఉన్నా కాలం నిర్దాక్షిణ్యంగా తనపనితాను చేసుకుపోతూనే ఉంటుంది కదా. తెల్లవారింది. రేవతి లేచి రెడీ అయి సుమారు ఆరున్నర ప్రాంతంలో గప్‌చిప్‌గా బయట కొచ్చింది. సార్ లేస్తే తను కాస్త అలా తిరిగి వస్తానని చెప్పమంది వాచ్‌మెన్‌కి. చలికాలమేమో జనం అంతంత మాత్రంగా తిరుగుతున్నారు బయట. జాగ్రత్తగా దారి గుర్తు తెచ్చుకుంటూ రాజేష్ చెప్పినచోటుకి చేరింది. చుట్టూ చూసింది తననెవరైనా చూస్తున్నారేమో అన్నట్టుగా. గుబురుగా చెట్లుపెరిగిన చోటుకి వెళ్ళింది. అక్కడ అప్పటికే రాజేష్ నిలబడి ఉన్నాడు.

"గుడ్... వెరీగుడ్... మంచి పిల్లవి. చెప్పినచోటుకి చెప్పిన టైంకన్నా కాస్త ముందే వచ్చేశావంటే నీకు నామీద భయం, మీ ఆయనమీద ప్రేమా చాలా ఎక్కువ పాళ్ళలోనే ఉన్నాయన్నమాట.

"అబ్బ నిన్ను చూసి ఇన్నేళ్ళయినా నువ్వేం మారలేదు రేవతీ. ఇంకా అందంగా , మోహం పెంచేలా ఉన్నావు" తినేసేలా చూస్తూ అన్నాడు రాజేష్.

"తప్పు రాజేష్. అలా మాట్లాడకు. అప్పుడంటే చిన్నవాడివి తెలియనితనం. నేను నీ స్నేహితుడి భార్యని. ఇద్దరు పిల్లల తల్లిని. అలా మాట్లాడడం, అలా ఆశపడడం తప్పు. జరిగిపోయినదానిని మేం ఎప్పుడో మర్చిపోయాం. నువ్వూ మర్చిపో. ఇప్పుడిలా ప్రవర్తించినట్లు కూడా నేనెవరితోనూ అనను, ఆఖరికి కార్తీక్‌కు కూడా చెప్పను. నీ మనసు మంచిగా మార్చుకుని స్నేహితుడిలా ఉండు"

"ఉదయాన్నే నీ సూక్తిముక్తావళికోసం కాదు నిన్నిక్కడకు రమ్మన్నది. నేనేదీ మరిచిపోలేదు. మరిచిపోను. అసలు ఆ కార్తీక్ గాడిని, నిన్ను కూడా చంపెయ్యాలనే ఇక్కడకు వచ్చాను. కానీ అంతకంటే నిన్ను నాశనం చేసి మీ ఇద్దరికీ నరకం చూపిస్తే ఇటు నా కోరికా తీరుతుంది, నా పగా చల్లారుతుంది" దగ్గరగా వస్తూ అన్నాడు రాజేష్.

"ప్లీజ్ రాజేష్... నామాట విను. అది నీకు మంచిదికాదు"

"నా మంచీచెడూ నాకు తెలుసు. నువ్వు పిచ్చివేషాలు వెయ్యకు. ఇక్కడ నానుంచి నిన్ను రక్షించేవాళ్ళెవరూ లేరు. అయినా అసలు అప్పుడే ఏడేళ్ళకిందటే వాడే... ఆ కార్తీక్‌గాడే... నీ మొగుడే నిన్ను నాకప్పగించేవాడు కొంచెం ఉంటే. ఇంతలో డామిట్ శనిగాడిలా వాడి మామ వచ్చి వాడిని తీసుకుపోయాడు. అయినా ప్రేమించి వచ్చావని చూడకుండా నిన్ను మోసంచేసి చిన్నపిల్లతో సహా నడిరోడ్డుమీద వదిలేసి పోయినవాడి మీద నీకు ప్రేమ ఏమిటి చెప్పు? అదే నేనైతే ఇలా భార్యగా అలరించి సేవలు చేయను. అడ్డంగా నరికి పోగులు పెడతాను" మాటాడుతూనే దగ్గరగా రాసాగాడు.

రేవతికి అర్థం అయిపోయింది. ఈ రాక్షసుడికి ఇంక ఏం చెప్పినా లాభంలేదని, చుట్టూ చూసింది. కొంచెం దూరంగా రోడ్డు వారగా పెద్ద లోయ. పెద్ద పెద్ద చెట్లతో నెమ్మదిగా అటు జరగడం మొదలుపెట్టింది. పిచ్చిపిచ్చిగా వాగుతూ, వెకిలిగా నవ్వుతూ రేవతివైపు వస్తున్న రాజేష్ గమనించలేదు రాబోయే ప్రమాదం. తనకు

భయపడి అందకుండా ఉండడంకోసం జరుగుతోందనుకున్నాడు. ఆమె అసహాయత ఇంకా ఆనందాన్ని, వినోదాన్ని కలిగించసాగింది రాజేష్‌కు.

రోడ్డుకు రక్షగా చిన్నగా కట్టిన సిమెంట్ కట్టడంమీద నిస్పృహాయంగా భయంభయంగా కూర్చుండిపోయింది రేవతి.

ఇంకెక్కడికి పోతావ్ అన్నట్లుగా విజయగర్వంగా నవ్వుతూ ఆమె పక్కన కూర్చుని పైన చెయ్యి వేయబోయిన రాజేష్‌ను గభాలున రెండు చేతులతో బలంగా వెనక్కి నెట్టింది రేవతి. ఊహించని ఆ తోపుకి బాలెన్స్ తప్పి పెద్దగా అరుస్తూ అలాగే వెనక్కి విరుచుకుని ఆ పెద్దపెద్ద చెట్లమీదుగా లోయలోకి పడిపోయాడు రాజేష్.

గట్టిగా కళ్ళు మూసుకుని నిలువునా వణికిపోతూ కాస్తలో స్పృహ తప్పిపోయేలా ఉన్న రేవతిని రెండు చేతులతో వడిసి పట్టుకున్నాడు కార్తీక్. తనను పట్టుకున్నది ఎవరో కూడా గుర్తుపట్టలేనిదానిలా అయోమయంగా చూస్తూ స్పృహ లేకుండా కార్తీక్ చేతుల్లో వాలిపోయింది రేవతి.

ఆటో పిలిచి రేవతిని రూమ్‌కు తీసుకెడదామనుకున్న కార్తీక్‌లోని లాయర్ వద్దన్నాడు. ఆ సమయంలో అక్కడ, అలాంటి చర్య తరువాత ప్రాబ్లమ్ అవుతుందేమో అన్న తలపుతో రేవతిని అలానే వడిసి పట్టుకుని జాగ్రత్తగా ఆ ప్రాంతానికి కొంచెం దూరంగా దాదాపుగా మోసుకెళ్ళాడు. అక్కడ ఓచోట పచ్చని చెట్లమధ్య రేవతి తలను ఒడిలో ఉంచుకుని కూర్చున్నాడు ఎవరైనా చూసినా అది టూరిస్ట్ స్పాట్ కనుక ఎవరో ప్రేమికుల జంట అనుకునేలా.

జరిగిన ఘోరం కార్తీక్ మనసుని కలచివేసిన తర్వాత తననితనే సర్దుకున్నాడు. రాజేష్‌లాంటి నరరూప రాక్షసుడికి అదే తగిన శిక్ష. లేకపోతే వాడి రాక్షసత్వానికి పువ్వులాంటి రేవతి బలయ్యేది. ఏ తప్పూ చెయ్యకపోయినా, ఏ పాపం చెయ్యకపోయినా తమ జీవితాలు బలయిపోయేవి. అయినా న్యాయపరంగా చూసినా, చట్టబద్ధంగా చూసినా రేవతి చేసినదానిలో తప్పు లేదు. తనను తాను రక్షించుకునే ప్రయత్నంలో చేసిన పనిగా కోర్టు రేవతిని క్షమించి వదిలేస్తుంది. కానీ తమ జీవితాలు అల్లరిపాలయి అస్థిరమవుతాయి. కనుక తాము ఏమీ జరగనట్లుంటేనే బెటర్. ఎస్... అదే బెటర్. తమకు ఏమీ తెలియదు. రేవతి ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు. స్పృహలేకపోయినా ఆ సంఘటన తాలూకూ ప్రభావం రేవతి ముఖంలో కనబడుతోంది.

"ప్చ్... ఏ దుర్ముహూర్తంలో తన ప్రేమలో పడిందోగానీ పాపం అన్నీ కష్టాలే, అవమానాలే. నో... అలా జరగడానికి వీల్లేదు. అయినవేవో అయినా ఇకముందు తమ జీవితాల్లో సంతోషం వెల్లివిరియాలి. అంతే... తను కూడా ఈమధ్య అస్తమానం ప్రాక్టీసు, కేసులూ అంటూ బొత్తిగా ఇల్లు, ఇల్లాలూ పట్టకుండా తిరుగుతున్నాడు. ఇక నుంచీ అలా కాకూడదు. అలా ఏవేవో ఆలోచిస్తూ కూర్చున్నాడు కార్తీక్.

"దాహం... దాహం" మెల్లిగా పెదాలు కదిలాయి. అర్థం చేసుకున్న కార్తీక్ ఆమె తల ఒడిలోంచి నేలపై బెట్టి గబగబా అక్కడ మొక్కలకు వాటరింగ్ చేసే ట్యూబ్ లోని నీళ్ళు దోసిలిలో పట్టి ఆమె నోటికందించాడు. కొద్దిగా ముఖంపై చిలకరించాడు.

కాసేపటికి మెల్లిగా కళ్ళు తెరిచింది. కార్తీక్‌ను చూస్తూనే భోరుమంది.

"కార్తీక్... నేను నేను రాజేష్‌ని చంపేశాను" అంటూ.

చటుక్కున ఆమె నోరు మూసి అటూ ఇటూ చూశాడు. లక్కీగా చుట్టుపక్కల ఎవరూలేరు.

"చూడు రేవతీ...అది ఏక్సిడెంటల్. నువ్వేమీ చెయ్యలేదు. కావాలని నువ్వు ఎవ రినీ చంపలేదు. ఇక ఒక్కమాట మాట్లా డకు. ఆ విషయం తరువాత మాట్లాడదాం. ప్లీజ్ మామూలుగా ఉండడానికి ప్రయ త్నించు. ఎవరైనా నిన్నిలా చూసినా, నీ మాటలు విన్నా చాలా ప్రమాదం. అర్థమ యిందా? ప్లీజ్... జరిగింది మర్చిపో. ఎక్కువసేపు ఇక్కడుండడం మంచిదికాదు. అలానే మనం మన ఇంటికి వెళ్ళేవరకూ నువ్వు ఇప్పటివరకూ ఎలా ఉన్నావో అదే హుషారుగా, ఆనందంగా అలా ఉండడానికే ప్రయత్నించు. నేను నీ కార్తీక్‌లానే కాదు, ఓ లాయర్‌గా కూడా చెబుతున్నాను. నువ్వు ఏ తప్పూ చేయలేదు. ఏ నేరం చెయ్యలేదు. సో మరిచిపో. ఇక్కడ ఇప్పుడు జరిగినదంతా మర్చిపో. ఇక ఎక్కువసేపు ఇక్కడుండడం, అలానే దీని గురించి మాట్లాడడం మంచిదికాదు. లే... అలా సరదాగా తిరిగి వచ్చినట్లుగా నెమ్మదిగా రూంకెళదాం. మిగతా విషయాలు ఇంటికె ళ్లాక మాట్లాడుకుందాం. ఓకే... లే... లేచి నెమ్మదిగా నడుద్దాం" తను లేచి ఆమెకు చేయి అందించాడు.

ఇద్దరూ కలిసి రూంకి నడవసాగారు.

గెస్ట్ హౌస్ దగ్గరకొచ్చాకా రెస్టారెంట్‌కు దారితీశాడు కార్తీక్. ఇద్దరూ వేడివేడిగా కాఫీ తాగారు. టిఫిన్ పార్శిల్ చెప్పాడు. ఇద్దరూ రూం చేరేసరికి అక్కడ సింహాద్రి తమకో సమే ఎదురుచూస్తున్నాడు వాళ్ళ నాన్నతో సహా.

"అదేంటి సార్ పొద్దున్నే బయటకెళ్ళారు నేను రాకుండానే...మీరు నన్నొదిలేసి వెళ్ళి పోయారేమో అని కంగారుపడ్డాను" నిష్ఠూ రంగా అన్నాడు సింహాద్రి.

"నిన్ను తీసుకెళ్ళకుండా నేనెలా వెడ తాను. మీ అక్కకు ఇంకా అరకు అందాలు చూడాలనిపిస్తే అలా కాసేపు తిరిగి వచ్చాం అంతే. ఒక్క నిమిషం అంటూ రేవతిని రూంలోకి పంపి సింహాద్రివాళ్ళ నాన్నతో మాట్లాడాడు. అతి కష్టంమీద నచ్చచెబితే కొంత అయిష్టంగానే ఒప్పుకున్నాడు సింహా ద్రిని తమతో పంపడానికి.

"సింహాద్రీ! మనం రేపు వెడదాం. ఎందు కంటే మీ అక్కకి పద్మావతీ గార్డెన్స్ అవీ మళ్ళీ చూడాలని ఉందట. మళ్ళీ మళ్ళీ రాలేంగా" నవ్వాడు.

"అదే మరి... మా ఊరంటే. ఎవరికైనా సరే బెమ్మాండంగా నచ్చుతుంది. సరే మరి వెడదామా" ఉత్సాహంగా అడిగాడు సింహాద్రి.

"ఓసారి చూపించావుగా. మేం వెడ తాంలే. నువ్వూ మళ్ళీ మాతో వచ్చేస్తావుగా. ఈరోజుకి మీ ఇంట్లో వాళ్ళతో మీ స్నేహి తులతో గడుపు. రేపు ఉదయం సరిగా ఏడు గంటలకు రా. నీ బట్టలూ అవీ తెచ్చుకో. ఏం" అంటూ సింహాద్రి నాన్నకేసి తిరిగి,

"మీ వాడిని బాగానే చూసుకుంటాం. నువ్వేమీ బెంగపెట్టుకోకు. అన్నట్లు ఇదిగో ఈ రెండురోజులూ మాకు గైడ్‌గా ఉన్నం దుకు" అంటూ జేబులోంచి ఓ రెండు వంద నోట్లు తీసి ఇచ్చాడు.

సింహాద్రి వద్దని ఏదో చెప్పబోయాడు కానీ వాళ్ళ నాన్న ముఖం చేటంత చేసుకుని ఆనందంగా అందుకున్నాడు.

"దండాలయ్యా" కొడుకుతో సహా వెళ్ళిపో యాడు.

నిజానికి బయట ఎక్కడా తిరిగి ఏం చూసే ఉద్దేశ్యం, ఉత్సాహం కార్తీక్‌కు లేవు. కానీ పడిపోయిన రాజేష్ వివరాలు, అదే బతికి ఉన్నాడా, పోయాడా, పోలీసులకి తెలి సిందా లేదా వగైరా వివరాలు తెలియడం కోసమే ఆ రోజుకు ఉండదలిచాడు.

అంత ఎత్తునుంచి పడ్డాకా బతికే ఛాన్స్‌లు ఆల్‌మోస్ట్ లేనట్లే. కానీ పొరపా టున ఏ చెట్టుకొమ్మల్లోనో చిక్కుకుంటే బతి కితే బతకవచ్చు

రూంకు రాగానే బలవంతంగా రేవతితో టిఫిన్ తినిపించి, ఓ నిద్రమాత్ర మింగించాడు ఆమె అవే ఆలోచనలతో డిస్టర్బ్ కాకుండా.

తను కూడా టిఫిన్ తిని కాసేపు విశ్రాంతిగా పడుకున్నాడు. ఎక్కడ విశ్రాంతి? మనసంతా అశాంతిగా బాగా డిస్టర్బ్‌గా ఉంటే నిద్రెలా పడుతుందీ... విశ్రాంతి ఎలా లభిస్తుంది? ఆ రోజంతా అలా అన్యమనస్కంగానే గడిపాడు కార్తీక్. సాయంత్రం రెస్టారెంటులో కూర్చుంటే ఎవరో ఇద్దరు కానిస్టేబుల్స్ మాట్లాడుకోవడం విన్నాడు. అక్కడ జరిగిందాన్ని ఏక్సిడెంట్‌గా భావించారనీ, ఆ పడిపోయినతను తాగి ఉన్నాడనీ, అందుకే తూలి పొరపాటుగా లోయలోకి పడిపోయాడనీ.

"అమ్మయ్య" ఓ సమస్య తీరిపోయింది. భారంగా నిట్టూర్చాడు కార్తీక్.

మర్నాడు ఉదయమే కారులో తిరుగుప్రయాణం అయ్యారు.

రాత్రి రూంలోనే చెప్పాడు, "ఇంటికి వెళ్ళాక కూడా ఆంటీ, అంకుల్ దగ్గర ఈ ప్రస్తావన వద్దు. జరిగిన ప్రమాదం ఇక్కడే మర్చిపో" అని.

రేవతి కూడా ఆలోచించింది. తను చేసిన తప్పేమిటి?

తనను తను రక్షించుకునే ప్రయత్నం చేసింది. లేకపోతే తను అన్యాయం అయిపోయేదికదా. నిజమే... కార్తీక్ చెప్పిన మాటలు ఆమె చెవుల్లో మారుమోగాయి.

"శరీరంలో ఏదైనా ఒక భాగానికి 'క్యాన్సర్' లేదా అలాంటి మొండివ్యాధి, అంతుబట్టని వ్యాధి ప్రాప్తిస్తే అయ్యో పాపం అంటూ ఆ భాగాన్ని అలానే ఉంచేస్తామా చెప్పు రేవతీ. దానిని తొలగిస్తాం మిగతా శరీరాన్ని కాపాడడానికి. ఇదీ అలాంటిదే. రాజేష్‌లాంటివాళ్ళు ఈ సమాజానికి పట్టిన క్యాన్సర్ వ్యాధి లాంటివాళ్ళు. ఎంత నచ్చచెప్పినా, ఎంత ప్రాధేయపడినా వాళ్ళ నీచనైజం, రాక్షసప్రవృత్తి మార్చుకోరు. అలాంటప్పుడు సమాజ శ్రేయస్సుని దృష్టిలో పెట్టుకుని అలాంటివాళ్ళని ఖండించాలి, ఏరి పారేయాలి అవసరమైతే నిర్జించాలి. అది పాపంకాదు. నేరం అంతకన్నా కాదు. నువ్వు చేసిందీ అదే... లేకుంటే ఇంకా కొంతమంది రమ్యలూ, రేవతిలూ వాడి చేతిలో అన్యాయమైపోతారు. జరిగినది ఒక పీడకలలా మర్చిపో. నువ్వు చేసింది న్యాయసమ్మతమే కాదు, చట్టబద్ధం కూడా. ఎలాగంటే ఆత్మరక్షణకోసం చేసిన దాడిలో అవతలివాడు మరణించాడు. సో... నీకు శిక్ష పడదు. ముందుగా నువ్వు తప్పు చేయలేదని నీ మనస్సాక్షి గట్టిగా నమ్మాలి. అప్పుడే నువ్వు జరిగింది మర్చిపోయి మామూలుగా ఉండగలవు. ఈ విషయం ఇక్కడే సమాధికానీ. ఆంటీకీ, అంకుల్‌కు అస్సలు తెలియనీయకు"

"కానీ...కానీ అసలు రాజేష్ ఎవరో... ఇక్కడకు ఎందుకొచ్చాడో తెలిస్తే పోలీసులు ముందుగా అనుమానించేది మనల్నేకదా" అన్న తన ప్రశ్నకు "పోలీసులకు రాజేష్ ఎవరో ఎందుకొచ్చాడో తెలిసే అవకాశమే లేదు" అన్నాడు కార్తీక్ నమ్మకంగా.

"అంత గట్టిగా ఎలా చెప్పగలవు"

"ఎలాగంటే లాయర్‌గా నాకున్న అనుభవం, పరిజ్ఞానంతో. రాజేష్ నేరస్తుడు. జైలునుంచి విడుదలయో, పారిపోయో వచ్చినవాడు, మరొక నేరం చెయ్యడానికి వచ్చినవాడు. కనుక మనల్ని హతమార్చిన తరువాత తను దొరక్కూడదు కనుక అసలు పేరు, ఎడ్రస్ వాడు ఖచ్చితంగా రాయడు. సో... వాడు తీసుకున్న గోతిలో వాడే పడ్డాడు. అయినా నేను చెబుతున్నాను కదా నువ్వు పదేపదే దాని గురించి ఆలోచించకు, మాట్లాడకు"

కార్తీక్ చెప్పినదాంట్లో పాయింట్, లాజిక్ అర్థమయ్యాకా రేవతి చాలావరకు సర్దుకుంది.

కారు వెడుతూంది. అలిసిపోయిన మనసూ, శరీరం ఆ చల్లగాలికి అలా నిద్ర లోకి జారుకున్నాయి.

సుమారు సాయంత్రానికి ఇల్లు చేరారు.

కారు ఆగుతూనే పిల్లలు పరిగెట్టుకొచ్చారు "మమ్మీ... డాడీ" అంటూ. శంకరం గారూ, పార్వతమ్మా నవ్వుతూ ఎదురొచ్చారు. "ఏవర్రా ప్రయాణం బాగా జరిగిందా" అంటూ.

"ఆ... బాగా జరిగిందాంటీ" అంటూ లోపలికి వెళ్ళిపోయింది రేవతి.

"అమ్మాయి అలా ఉందేం. వంట్లో బాగా లేదా కార్తీక్" గాభరాగా అడిగింది పార్వతమ్మ.

"లేదులే పిన్నీ... చిన్నపిల్లలా పరుగు పెట్టింది ఈ రెండు రోజులూ. పైన ప్రయాణం బడలిక. కాస్త రెస్టుతీసుకుంటే సరిపోతుంది" అంటూనే... బయటే ఓ పక్కగా నిల్చుండి పోయిన సింహాద్రిని చూస్తూ "అరె... సింహాద్రీ అక్కడే ఉండి పోయావేమిటీ? లోపలికి రా" అని "బాబాయ్... ఈ అబ్బాయి సింహాద్రి... ఇక్కడే మన ఇంట్లోనే ఉండి చదువుకుంటాడు. మీకు చేతినిండా పనే. మీరు నన్ను తీర్చిదిద్దినట్లే ఇతనినీ తీర్చిదిద్దాలి. చదువు మీద ఆసక్తి ఎక్కువ. చదువుకునే అవకాశం లేదు. అందుకే తీసుకొచ్చాను"

"మంచి పని చేశావ్. నలుగురికి మన చేతనయిన సాయం చెయ్యడంలోనే మనిషి జన్మ సార్థకత" శంకరంగారు ఆనందంగా అన్నారు.

"వెళ్ళు... వెళ్ళి స్నానం అదీకానిచ్చి కాస్త రెస్టుతీసుకో, మళ్ళీ రేపంతా నీకు విశ్రాంతి ఉండదు" అన్నారు.

"రేపు ఆదివారం కోర్టుకు సెలవు, అంతా ఖాళీయే"

"కోర్టుకు సెలవే కానీ. మన ఇంట్లో సందడికి మాత్రం సెలవులేదు. నిన్న అభి ఫోను చేశాడు. మనం వాళ్లందరినీ మర్చిపోయాం అని నిందవేశాడు, మనల్ని రేపు భోజనానికి రమ్మన్నాడు. అలాగే మాలతీ, రఘూ, గోపాల్, వాళ్లావిడా అంతా కలుద్దాం వాళ్ల ఇంట్లో అన్నాడు.

నేనన్నానూ... కార్తీక్, రేవతీ ప్రయాణం అదీ చేసి బాగా అలసిపోయుంటారు అని. అయితే మన ఇంట్లోనే గెట్ టు గెదర్ ఏర్పాటు చేస్తానన్నాడు. ఏదో హోటల్‌కు ఆర్డరూ అది కూడా ఇచ్చి మొత్తానికి బాగా హడావుడి చేస్తున్నాడు. మరి ఏమిటో విశేషం" నవ్వుతూ అన్నారు.

"అవునా.. మంచిపని చేస్తున్నాడు. ఈమధ్య ఎవరి హడావుడిలో వాళ్లుండి అసలు ఒకరినొకరు కలవడమే కుదరడం లేదు. అంతా కలిస్తే చాలా సరదాగా హాయిగా ఉంటుంది" ఉత్సాహంగా అన్నాడు కార్తీక్.

"వాళ్లని కాస్త రెస్టుతీసుకోనిచ్చేదేమైనా ఉందా. లేకపోతే ఈ మూడు రోజుల కబుర్లూ గుమ్మంలో నిలబెట్టే చెప్పేస్తారా" కసురుకుంది పార్వతమ్మ.

"వెళ్ళు.. వెళ్ళి స్నానం అదీ చేసి కాస్త రెస్టీసుకో కార్తీక్" ఆప్యాయంగా అన్నారు శంకరంగారు.

మర్నాడు తెల్లవారుతూనే హడావుడి మొదలుపెట్టింది రేవతి.

"అభికి అది ఇష్టం. రఘు అన్నయకు ఇది ఇష్టం. మాలతి పాపం చిన్న పిల్లతో చెయ్యలేదు. ఆంటీ ఈ ఐటమ్ కూడా ఉంటే బాగుంటుంది కదూ" అంటూ.

"అయ్యయ్యో... అభి హోటల్‌కి ఆర్డరిచ్చాడమ్మా. మళ్ళీ అవన్నీ వేస్ట్ అయిపోతాయి, నువ్వు శ్రమపడకు" అంటూ పార్వతమ్మ, శంకరం ఎంత గోలెట్టినా.

"అంకుల్... కార్తీక్ చూడండి జస్ట్ ఒక్క గంటలో వచ్చేస్తానంటూ బయలుదేరుతున్నారు. వాళ్లంతా కాసేపటిలో మన ఇంటికి వచ్చేస్తుంటే ఇంట్లో ఉండకుండా ఏం బాగుంటుంది చెప్పండి" ఫిర్యాదు చేసింది

రేవతి.

"అదికాదు బాబాయ్. మూడు రోజులుగా ఊళ్లో లేను కదా. కొన్ని కేసులు గురించి డిస్కస్ చెయ్యాలి. రెండు గంటల్లో వచ్చేస్తా ఓసారి కుమార్ ఇంటికెళ్ళి" విషయం చెప్పాడు కార్తీక్.

"పోనీ లేమ్మా, కేస్ స్టడీ అంటున్నాడుగా. వెంటనే వచ్చేస్తాడులే. తనకి మాత్రం తెలియదూ, వెళ్లనీ"

"పొండంకుల్ మీరెప్పుడూ కార్తీక్ పక్షమే" కినుకగా అంది రేవతి.

"అమ్మయ్య" సందు దొరికింది కదాని పారిపోయాడు కార్తీక్.

సుమారు పది పదకొండు గంటలకల్లా బిలబిల్లాడుతూ మిత్రబృందం అంతా దిగిపోయింది. అక్కడున్న అందరికీ కార్తీక్ అంటే ఎడ్మిరేషన్. ఎప్పుడో అప్పుడు ఏదో తప్పు చెయ్యని వాళ్లుండరు కానీ ఆ తప్పు తెలుసుకుని బాధ్యతగా జీవితాన్ని తీర్చిదిద్దుకోవడమేగాక ఎందరికో మార్గదర్శకంగా, అండగా నిలవడం అనేది రియల్లీ గ్రేట్.

అందరికీ శంకరంగారంటే వల్లమాలిన గౌరవం. అసలు పెద్దవాళ్లంతా ఇలా సమస్యలను అర్థంచేసుకుని పరిష్కారం కోసం వెతికే వాళ్లయితే సమాజంలో ఇన్ని రకాల కష్టాలు, అర్థాంతరపు చావులూ అవీ ఉండవుకదా. అన్నట్లుగానే కార్తీక్ కూడా వెంటనే వచ్చేశాడు. అందరూ ఆనందంగా గడిపారు సాయంత్రం వరకూ.

ఆ సందడినీ... ఆనందాన్నీ కళ్లనిండా చూసుకున్నారు శంకరం, పార్వతమ్మలు. రాజేష్ కనబడిన విషయం కార్తీక్ రేవతిలకు చెప్పకూడదనీ, అన్నింటికీ ఆ దేముడే ఉన్నాడనీ, నిశ్చయించుకున్నారు వాళ్లు. కానీ శంకరంగారిని తండ్రికంటే ఎక్కువ అభిమానించి, గౌరవించే కార్తీక్ ఊర్నించి వచ్చిన రాత్రే ఆయనొక్కరికే జరిగింది చెప్పాడు. ఆ విషయం తెలిసినట్లు రేవతికి, పార్వతమ్మగారికీ చెప్పద్దని మాట తీసుకున్నాడు.

"రాజేష్ పగబట్టి ఏ అఘాయిత్యం చేస్తాడో అని మనసులోనే గుంజిల్లుతున్న శంకరంగారు భారంగా నిట్టూర్చారు. 'అంతా విధివిలాసం' అంటూ తన బిడ్డలని ఆ దేముడే రక్షించుకున్నాడు అనుకున్నారు.

ఆ సందడిని, ఆ పిల్లలందరూ ఆప్యాయంగా తమ చుట్టూ తిరగడాన్ని కళ్లారా చూసుకుంటున్న ఆ దంపతుల ఇద్దరి మనసుల్లో ఒకే భావన.

"నిజం... ఒకవేళ చరణ్, లీల దగ్గర ఉన్నా తమనింతకంటే బాగా ఆప్యాయంగా చూసుకునే వాళ్లు కారేమో. ఏనాటి బంధమో ఇది యింతలా పెనవేసి ముడిపడింది.

రేవతి అంగీకారంతో తమకింక సంతానం కలగకుండా ఆపరేషన్ చేయించుకున్నాడనీ హిమ... శ్యామ్ తన పిల్లలే అన్నాడని తెలిసిన రోజే రేవతి, కార్తీక్‌ల ఆప్యాయతకూ అభిమానానికి వాళ్లు పూర్తిగా లొంగిపోయారు. కార్తీక్, రేవతుల అన్యోన్య దాంపత్యం, చిన్నారి హిమ, శ్యామ్‌ల ఆటపాటలతో వాళ్లకు హాయిగా కాలం సాగిపోతోంది.

కార్తీక్ పేరుప్రతిష్టలు రోజురోజుకీ పెరుగుతూనే ఉన్నాయి. ఎక్కడ ప్రేమజంట కనబడినా ప్రేమగోల వినబడినా కార్తీక్ హాజర్. వాళ్లను పర్యవేక్షించి, పరిరక్షించి కానీ నిద్రపోడు. అతనికదో బలహీనత కానీ ప్రేమికులకదే శ్రీరామరక్ష అయింది.

ఆరోజు... రోజూలానే కోర్టునుంచి భోజనానికి వస్తున్న కార్తీక్‌కు రోడ్డుమీద గుంపులు గుంపులుగా జనం, ట్రాఫిక్ జామ్ అయిపోయి గోలగోలగా ఉంది.

కారు ఓ పక్కకి ఆపి, విషయం తెలుసుకోవడానికి కిందకు దిగాడు కార్తీక్.

"ఏం జరిగింది. ఏదైనా సినిమా షూటింగా" అడిగాడు ట్రాఫిక్ పోలీసుని.

"షూటింగా... నా బొందా. లయోలా కాలేజ్ స్టూడెంట్స్ సార్, ఇంటరు చదువు

తున్నారట. ప్రేమించుకున్నారట. షరా మామూలుగా ఇంట్లో తెలిసి గొడవైంది. బతికితే కలిసి బతుకుతాం. లేదా కలిసి ఛస్తాం అంటూ అదిగో ఆ ఫైవ్‌స్టార్ హోటల్ పైకి ఎక్కేసారు సార్. ఎవరైనా దగ్గరికి వస్తే దూకేస్తాం అని బెదిరింపు పైగా... రెండు గంటలయింది. ఇదే భాగోతం. వెధవ ప్రేమలూ వీళ్లూను. చచ్చేదేదో దూరంగా పోయి చావక మంచి సెంటర్లో మొదలెట్టారు రామాయణం. మధ్య మా చావుకొచ్చింది. ఈ ట్రాఫిక్ జామ్ క్లియర్ చెయ్యలేక" ఆయాసపడుతూ మొత్తం చెప్పేసి నీరసపడ్డాడా మానవుడు.

కార్తీక్ వాళ్లవాళ్ల పెద్దవాళ్లతో మాట్లాడి వాళ్లని ఒప్పించి..."మీ చదువులయి జీవితంలో సెటిలయ్యాకా తప్పకుండా మీ పెళ్లి జరిపిస్తాం దిగిరండి మహాప్రభో" అని చెప్పించాకా అప్పుడు దిగివచ్చారా ప్రేమ జంట.

సాయంత్రం నాల్గు గంటలయినా భోజనానికి రాని కార్తీక్ కోసం కోర్టుకు ఫోను చేసి, సెల్‌కు ఫోనుచేసి నానా హైరానా పడిన రేవతికి దూరంగా కనబడిన కార్తీక్ కారును చూడగానే ప్రాణం లేచివచ్చింది.

"ఏమైపోయారింతసేపు... సెల్ కూడా ఆఫ్‌చేసి ఉంది. ఎంత కంగారుపడ్డామో తెలుసా" కోపంగా అంది కారు దిగుతున్న కార్తీక్‌తో. అప్పుడు చూశాడతను రేవతే కాదు శంకరం బాబాయ్, పిన్ని అంతా బయటే ఎదురుచూస్తున్నారు తనకోసం ఆత్రంగా.

"ఏమైపోతాను. ఊరికే కంగారు. భోజనానికి వస్తుంటే దారిలో ప్రేమోపహతులు కనిపించారు. షరా మామూలే వాళ్ల వ్యవహారం చక్కదిద్ది వచ్చేసరికి యింత ఆలస్యమయింది.

"అయినా ఈ ప్రేమగోలేమిటో... హాయిగా కాలేజీకి వెళ్లి చదువుకోండిరా అని పంపిస్తే... చదువు, సంధ్యా మానేసి ప్రేమాదోమా అంటూ... అసలు... అసలు ఈ ప్రేమని చట్టబద్ధంగా బేన్ చేసెయ్యాలి" చిరాకుపడ్డాడు కార్తీక్.

గొల్లున నవ్వారు శంకరంగారు. "ఎంత అనుభవంతో చెప్పావయ్యా ఆ మాట" అంటూ.

"అయినా కార్తీక్... ప్రేమించడం, ప్రేమించబడటం తప్పుకాదు. అయితే దానికి ఓ వయసూ. పద్ధతీ లేకుండా అల్లరిచిల్లరగా తిరిగి, ప్రేమంటే సినిమా ప్రేమలే అనుకుని, చదువుసంధ్యలు నాశనం చేసుకుని ఎందుకూ కొరగాకుండా పోయి జీవితాలు పాడుచేసుకోవడం తప్పు. అది మన అవివేకం. అందులో పాపం 'ప్రేమ' తప్పేముంది చెప్పు అసలు"

"నాయనా కార్తీక్ మీ బాబయ్య అందులో పిహెచ్.డి చేశారు కానీ ఆయనతో వాదించలేం వదిలెయ్. నాల్గు అవుతూంది తిండి తిప్పలూ వద్దా ఏం? నడు వెళ్లి భోంచెయ్యి" అని కార్తీక్‌తో అంటూనే.

"ఇంతకూ మీ పిహెచ్.డి. అయిందా మహాశయా. థీసిస్ సబ్‌మిట్ చేశారా? అందులో డాక్టరేట్ వచ్చేసినట్లేనా? " గడుసుగా అడిగింది పార్వతమ్మ నవ్వుతూ.

"ఆహా... నా పిహెచ్.డి. పూర్తయింది. రేవతీ, కార్తీక్, మాలతీ, రఘూ, అభి, వాడి పెళ్లాం వీళ్లంతా నా థీసీస్‌లే. ఇంకా చిన్నారి హిమా... శ్యామ్, వీళ్ళంతా కూడా నా కాబోయే థీసీస్‌లే. ప్రేమ మహత్తరమైనదే కాదు, మహిమాన్వితమైనది కూడానూ సరిగా మలచుకుంటే. లేకపోతే మాత్రం అది మహమ్మారిలా బలిగొంటుంది సుమా. అందుకే నే అంటానూ 'ప్రేమా నీకో నమస్కారం' అని" గలగలా మనస్ఫూర్తిగా నవ్వేశారు శంకరంగారు. అంతా శ్రుతి కలిపారు.

✤

# చతుర కతలు

## తప్పు

'పోస్ట్' అన్న కేక విని లోపల్నుంచి పరుగెత్తుకొచ్చింది సత్యవతి. అప్పటికే పోస్టుమాన్ కిందపడేసిన కవరు చూసి ఆమె గుండె దడదడలాడింది. కవరుని గబుక్కున తీసి పైట కొంగుతో కప్పేసి నెమ్మదిగా లోపలికి నడిచింది సత్యవతి. కవరుని పరుపు కింద పెడుతూంటే సడన్‌గా సుబ్బారావు దృష్టిలోపడింది.

"ఏమిటోయ్ అది? ఎక్కడ్నుంచి వచ్చింది ఉత్తరం?" గబగబా దగ్గరకొస్తూ అడిగాడు. గతుక్కుమంది సత్యవతి.

"అబ్బే ఏం లేదండీ! సంతోషిమాత గురించి పదహారు ఉత్తరాలు రాస్తే మనక్కూడా శుభం కలుగుతుందిట. అంతే రాసుంది అందులో" కంగారుగా అంది ఆమె.

"ఏదీ చూపించు" అంటూనే సుబ్బారావు పరుపుకింద చేయిపెట్టి కవరుని పైకి తీశాడు. పరుగెత్తుతున్నంత వేగంగా వచ్చి అతని చేతిలోని కవరుని లాగేసుకుంది సత్యవతి.

సుబ్బారావుకి కోపం వచ్చింది.

"ఎప్పట్నుంచి ఈ ప్రేమ లేఖల వ్యవహారం? మొగుణ్ణి అన్నవాడ్ని వుండగానే ఇలా పబ్లిగ్గా మొదలెట్టేవు. ఎవడేవాడు! ఈ రోజు వంట్లో బాగులేదని సెలవు పెట్టి




ఇంట్లో వుండబట్టి తెల్సింది. చెప్పు" కోపంగా నిలదీసి అడుగుతున్న భర్తని చూసి ఏడుపు మొహం పెట్టింది.

"మీరు అనుకుంటున్నంత నీచానికి నేను దిగజారలేదండీ. ఆరు సంవత్సరాలుగా మీరు నాతో కాపురం చేస్తున్నారు. ఇప్పటికీ మీకు నా మీద నమ్మకం లేదంటే... అది నా దురదృష్టం. ఇంత దాకా వచ్చింది కాబట్టి చెప్తున్నాను. వినండి. ఇది ప్రేమ లేఖ కాదు. ఏం కాదు. నేను కొత్తగా కథలు

రాయడం మొదలెట్టేను. నేను రాసి పంపిన కథ తిరిగి వచ్చేసింది. అంతే! కథ తిరిగి వచ్చేసింది అంటే మీరు నన్ను వెక్కిరిస్తారు. వేళాకోళం చేస్తారు. మా ఆవిడ 'తిరిగి వచ్చిన కథల రచయిత్రి' అని అందరిముందు అపహాస్యం చేస్తారు. అది నా కిష్టంలేదు. అందుకే అలా చెప్పాను" వస్తున్న ఏడుపుని ఆపుకుంటూ అంది సత్యవతి.

అయిదేళ్ల చింటూ వచ్చి "అవును నాన్నా! అమ్మ ఎప్పుడూ ఏదో రాస్తూ కూర్చుంటుంది. మా మిస్ ఇచ్చిన హోమ్‌వర్క్ చేయించమంటే చేయించడంలేదు. నాకు తీరుబడి లేదు. నాన్న వచ్చేక అడిగి చెయ్యి అంది" వాడు కంప్లయింట్ ఇవ్వగానే సుబ్బారావు మరింత మండిపడ్డాడు.

"వెధవ కథలూ నువ్వూనూ. మరేం పని లేకపోతేసరి. కథలు తిరిగొచ్చేస్తుంటే ఇంకా ఎందుకు రాయడం సిగ్గులేకుండా. మొగుడ్ని, కొడుకుని, ఇంటిని పట్టించుకోకుండా ఏమిటా వెధవ వేషాలు. మళ్లీ కథలు రాయి చెప్తాను నీ పని. కాయితాలు దండగ. కవర్లు దండగ. స్టాంపులు దండగ. టైమ్ దండగ" అరవడం మొదలెట్టేడు సుబ్బారావు.

సత్యవతి నెత్తిమీద నీళ్ల కుండ భళ్లున బద్దలైంది. ఏడుపు మొదలెట్టింది. మొగుడన్న మాటలకి ఆమెకి కోపం, ఉక్రోషం వచ్చాయి. వెంటనే అనేసింది.

"అవునులెండి. ఇరుగు-పొరుగు ఇళ్లకు వెళ్లి సొల్లు కబుర్లు చెప్తూ కూర్చోకుండా నా మనసులోని అభిప్రాయాలు కాగితంమీద పెట్టడం నేను చేసిన తప్పు! మీరు మాత్రం ఏం చేస్తున్నారు? రోజూ పేకాటలో ఓడిపోయి వస్తున్నారు. ఓడి పోతున్నారని ఆడ్డం మానేస్తున్నారా? ఓడిపోతున్న కొద్దీ పట్టుదల పెరిగి ఎప్పటికైనా గెలవకపోతానా అని మరింత డబ్బు తగలేసి ఆడుతున్నారు. శ్రమ విలువ తెలియని మీరు కష్టపడ్డానికి వళ్లు వంగక ఒక్కసారిగా కోట్లు వచ్చేసి ధనవంతులైపోదామని లాటరీ టిక్కట్లు కొనేస్తున్నారు! మీ జీతం అంతా పేకాటకి, లాటరీలకీ ఖర్చవుతోందన్నది నిజం కాదా! ఒక్కనాడైనా మీరు పేకాటలో గెలవలేదు. లాటరీలో ఒక్క రూపాయైనా రాలేదు. అయినా మీరు ఆ రెండూ మానుకుంటున్నారా? లేదు. ఈ విషయంలో మిమ్మల్ని ఎప్పుడైనా పల్లెత్తు మాట అన్నానా!" కోపంలో నాలుగూ దులిపేసింది సత్యవతి.

సుబ్బారావు ముఖం మాడ్చుకున్నాడు.

**– న్యాయపతి కమలారాంజీ**

---

## 'చంప'దెబ్బ

ఆఫీసునుంచి ఇంటికి రాగానే సంతోషంతో ఎదురొచ్చింది నా శ్రీమతి చంప. పెళ్ళయిన ఇన్ని సంవత్సరాల్లోనూ ఎన్నడూ, ఇటువంటి సీన్ ఎదురవలేదు నాకు. చంప కళ్ళల్లో ఆనందరేఖలు ప్రకాశిస్తున్నాయి.

"మీకో శుభవార్త!" అంది నా చేతులు పట్టుకుని గాల్లోకి ఊపుతూ.

"శుభవార్తా? ఏమిటి? " ప్రశ్నించాను దుస్తుల్ని మార్చుకుంటూ.

"మీరామధ్య రాసిన 'దారిమారిన కథ' ఆంధ్రరత్న వారపత్రికలో అచ్చయింది" అంది. ఎంతో ఆనందం కలిగింది నాలో. కానీ మళ్ళీ అంతలోనే నా సంతోషమంతా ఆవిరైపోయింది.

"ఆ కథ ఆ పత్రికనుంచి వేసుకోలేమంటూ బోల్డన్ని సారీలు మోసుకుని తిరిగొచ్చేసింది కదా రెండు నెలలకిందట? " అన్నాను.

"అవును. తిరిగొచ్చిన ఆ కథే... ఇప్పుడు అచ్చయింది. అయితే ఏం? " ప్రశ్నించింది

చంప. ఏమిటో అంతా అయోమయంగా వుంది నాకు. పాతికేళ్ళనుంచి కథలు రాస్తున్నాను. వెయ్యి కథలు అచ్చ య్యాయి. కానీ, ఇటువంటి కన్‌ఫ్యూజన్ ఎప్పుడూ ఎదురుకాలేదు నాకు. బాగాలేదు, వేసుకోలేమంటూ పంపించేసిన ఆ కథ మళ్ళా అందులోనే అచ్చవడం ఏమిటో? నాకేం బోధపడలేదు.

చంపకేసి చూశాను. నవ్వుతూ నావంకే చూస్తోంది.

"ఎందుకలా ఏయన్నార్‌లాగా ఫోజు పెట్టి మరీ ఫీలయిపోతారు? మీ కథే... శాను. నిజమే! నా కథే దారిమారిన కథే. 'అబ్బ! కథకు ఎంత చక్కని బొమ్మ వేశారో ఆర్టిస్టు?' అనుకుంటూ కథనోసారి తేరి పార గమనించి ఉలిక్కిపడ్డాను.

"మైగాడ్, కథ అదే... పేరు దారిమారి నకథే. కానీ రచయిత పేరు నాదికాదు, మా ఆవిడది. 'చంప' అని అచ్చయింది కథ హెడ్డింగు దిగువ భాగాన.

ఇదెలా సాధ్యం? !

నవ్వింది చంప ఈసారి.

"అది మీర్రాసిన కథే. కానీ తిరిగొచ్చే సింది. దాన్ని నేను మరల అందంగా




ఇప్పుడు అచ్చయింది. పాపం! ఆ పత్రిక వాళ్ళు జాలిగుండె కలవాళ్ళులాగా కనిపిస్తు న్నారు. అందుకే ఆ కథ వేశారు" అందీ సారి చంప మళ్ళా.

ఇంకా అయోమయంగానే చూస్తున్న నా చెంపమీద చిన్న దెబ్బవేస్తూ,

"ఇదిగో కథ అచ్చయిన 'ఆంధ్రరత్న' వారపత్రిక. కథను ముప్పైమూడో పేజీలో వేశారు" అంది.

పుస్తకం అందుకున్నానామె చేతిలో నుంచి.

ముప్పై మూడోపేజీ గబగబా తిరగే రాసి, నా పేరుమీద అదే పత్రిక్కి పంపాను. అచ్చయిపోయింది. పేరు నాదే అయినా కథ మాత్రం మీదేగా సారూ!" అందీసారి.

"నీ పేరుతో అచ్చయినందుక్కాదు నా బాధ. అసలీ పత్రికలవాళ్ళు కథల్నెలా సెలక్ట్ చేస్తున్నారో? వాళ్ళ పద్ధతేంటో అర్థంకాక ఛస్తున్నాను" అన్నాను బాధగా.

పకపకా నవ్వేసింది చంప.

– యం. ఉమామహేశ్వరరావు

## జీ భాగ్యశాలీ విజేతా

పనమ్మాయి ఉన్న రెండు గిన్నెలూ కడిగి ఇల్లు తుడిచి వెళ్లిపోయింది. మల్లికార్జున స్నానంచేసి పనిపిల్ల హోటల్ నుండి తెచ్చిన టిఫిన్ తిని, కాఫీ తాగి దివాన్ కాట్ మీద బాసింపీటం వేసుకుని కూర్చుని రిమోట్ చేతిలోకి తీసుకున్నాడు. పక్కనే పోటీకి పంపే పోస్టుకార్డులున్నాయి. ఇంక జాగ్రత్తగా సీరియల్స్ అన్నీ ఫాలో అయిపోవడం మొదలుపెట్టాడు. డి.డి1, మెట్రో, డి.డి.8, ఒకటేమిటి, ప్రైవేటు ఛానెల్సు అన్నీ

చింది. చిన్నప్పటినుండి కష్టపడి పైస పైసా కూడబెట్టి బాధ్యతలు నెరవేర్చడంలోనే గడిపిన మల్లికార్జునకు తన కోసం తాను కొన్నాళ్లు జీవించాలనే గాఢమైన కోరిక ఉంది. కోడళ్లు, కొడుకులు రిటైరయిన మల్లికార్జునను తమ దగ్గరకు వచ్చేయమని గట్టిగా చెప్పారు. మల్లికార్జున నవ్వాడు.

"ఒరేయ్ అబ్బాయ్! మా నాన్న చిన్నతనంలోనే పోవడంవల్ల తల్లి, చెల్లెలు బాధ్యత, పెళ్లయి మీరు పుట్టాక మీ బాధ్యత.. జీవితమంతా బాధ్యతలతోనే గడిచిపోయిందిరా! నాకు కొన్నాళ్లు ఒక్కడినీ నాకు నచ్చినట్టు ఒంటరిగా బతకాలని వుంది"




ఓపిగ్గా చూడడం, జీభాగ్యశాలీ విజేతా కార్యక్రమానికి ఉత్తరాలు రాయడం ఇదే కార్యక్రమం.

మల్లికార్జున గవర్నమెంటు ఆఫీసులో క్లర్కుగా పనిచేసి రిటైరయిపోయేడు. ఇద్దరే మగపిల్లలు. ఇద్దరూ ఉద్యోగస్తులే. పెళ్ళిళ్లు కూడా అయిపోయేయి. మల్లికార్జున భార్య పిల్లలు డిగ్రీ చదువుతుండగానే మరణిం

"అదేమిటి నాన్నా! మీకు వేళకన్నీ అమర్చడానికి ఇద్దరు కోడళ్లు ఉన్నారు చూడడానికి మేమున్నాము. ఒంటరిగా ఉంటానంటారేమిటి?" అన్నారు నిష్ఠూరంగా.

"మీరు చూస్తారురా! చూడరని నేనెక్కడన్నాను? మీకు కొత్తగా పెళ్లిళ్లయ్యాయి. ఒంటరిగా అరమరికల్లేకుండా కొత్తజంట ఆనందంగా ఉండాలంటే ఇద్దరే ఉండాలి. ఆ ఆనందం, స్వేచ్ఛ వేరు. నేనూ పెళ్లైన కొత్తలో అలా ఫీలయినవాడినే. అదీకాక

నాకు కూడా కొంత స్వేచ్ఛ ఉండాలి. అది కూడా కొంతకాలం, ఏదో నాకు ఓపిక ఉన్నంతకాలం" గట్టిగానే చెప్పాడు.

అంతేకాక తన రిటైర్మెంట్ బెనిఫిట్స్‌లో కొంత డబ్బు తనకు ఉంచుకుని మిగతాది కొడుకులిద్దర్నీ, కోడళ్లిద్దర్నీ కూర్చోబెట్టుకుని సమంగా పంచి ఇచ్చేశాడు. కోడళ్లతో కూడా చెప్పాడు.

"అమ్మాయిలూ! మీరు నాకు కోడళ్లు కాదు కూతుళ్లే అనుకుంటున్నాను. పెళ్లి చేసుకుని కోటి కోరికలతో నా ఇంటికి అడుగుపెట్టారు. సుఖంగా ఉండండి. మనవలు పుట్టేక నేను మీ ఇళ్లకి రాక ఎక్కడికి పోతాను? " అంటూ.

తను ఉంచుకున్న డబ్బుమీద వచ్చే వడ్డీ, తన పెన్షన్‌తో సుఖంగా గడపడం ప్రారంభించేడు. టిఫిన్, కూరలు హోటలు నుంచి తెప్పించుకుంటున్నాడు. కాఫీ పెట్టుకునేవాడు. కుక్కర్ పెట్టుకునేవాడు. ఇంక టీవీయే టి.వి. దాంతో టీవీ కార్యక్రమాలకి అలవాటు పడిపోయాడు.

మొదట్లో సరదాగా చూడటం ప్రారంభమయిన ఈ అలవాటు జో భాగ్యవాలీవిజేతా! అంటూ కార్యక్రమాలలో విజేతలయిన వాళ్లకి సింగపూర్‌కి ఎయిర్ టిక్కెట్లు, గోల్డ్‌కాయిన్స్ అంటూ ప్రకటించే బహుమతులకి మనసు పీకి పిల్లలకి బహుమతులివ్వాలనిపించి జవాబులు రాయడం ప్రారంభించాడు. అంతేకాక తాను రాసిన ఆన్సర్లన్నీ రికార్డెడ్‌గా ఉంచడం చేసేవాడు, ఎంతైనా రిటైర్డు క్లర్కు కదా!

పాపం ఎంత డబ్బు ఖర్చుచేసి జవాబులు రాసినా ఆన్సర్లెన్ని రైటయినా ఒక్క లాటరీ తగలలేదు.

రోజూలాగే టి.వి. కార్యక్రమాలకి సెటిలైపోయాడు. 'మన' టి.వి. ఛానెల్ ఒక ప్రత్యేకప్రోగ్రాం ఏర్పాటు చేసింది.

జో భాగ్యశాలి విజేత కార్యక్రమాలలో ఎక్కువసార్లు పాల్గొని ఏవిధమైన బహుమతి పొందని వారికి ఒక పోటీ పెట్టి ప్రత్యేక భాగ్యశాలీ విజేత పోటీ నిర్వహించదలిచాము. ఎంత ఎక్కువ ఎంట్రీలు పంపగలిగితే అంత మంచిది. ఆ ఎంట్రీలు ఎక్కువున్న వారిలో భాగ్యశాలిని విజేతగా ప్రకటిస్తాం అంటూ పూర్తి చేయవలసిన ప్రొఫార్మా కూడా టి.వి. స్క్రీన్‌పై ప్రకటించారు.

ఇది చూసిన తరువాత మల్లికార్జునకు ఇదే పనయిపోయింది. డబ్బులికి లోటు లేకపోవడం వలన యధేచ్ఛగా కొరియర్‌లో జవాబులు పంపి రిసీట్లన్నీ డ్యూడేట్‌కి రిజిష్టర్ పోస్టు విత్ ఎక్నాలెడ్జ్‌మెంటు పంపాడు. ఇంక అప్పట్నుంచి ఎదురుచూపే ఎదురుచూపు.

ఎదురుచూసిన రోజు రానే వచ్చింది. మహోత్సాహంగా టి.వి. ముందు సెటిలైపోయాడు.

"జో భాగ్యశాలీ విజేతా ఎమ్.మల్లికార్జున, గవర్నర్‌పేట, విజయవాడ. తన ఎడ్రస్ టి.వి. స్క్రీన్‌మీద కనిపిస్తుంటే తన వయసు మర్చిపోయి గంతులేసాడు. వారం రోజులు గడిచిన దగ్గర్నుంచి పోస్టుమాన్ కోసం తారట్లాడడం ప్రారంభించాడు. తనకెక్కువ ఉత్తరాలు రావు. కొడుకులు ఫోన్లు చేస్తారు. పోస్టుమాన్ ఎడ్రస్ సరిగా గుర్తించగలడో లేడోనని కాలుగాలిన పిల్లిలా తిరగడం ప్రారంభించాడు. సింగపూర్‌కి టికెట్టు పంపిస్తే తాను వెళ్లాలా? కొడుకులెవర్నయినా పంపాలా? లేకపోతే ఫ్రీలో ఒకళ్లు, డబ్బులు పెట్టుకు మిగిలిన వాళ్లూ వెళ్లాలా? ఎన్నెన్నో ఊహలు, ఆలోచనలు.

ఆ శుభ ఘడియ రానే వచ్చింది.

పోస్టుమేన్ పిలుపు వీణానాదంలా వినిపించింది.

పరిగెట్టినట్టే వచ్చాడు బయటికి.

"బేరింగ్ పాకెట్టు సార్! బహుమతి ఖచ్చితంగా అందడానికి ఇలా చేస్తారు. మీరు పది రూపాయిలిచ్చి తీసుకోండి"

మారు మాట్లాడకుండా పది రూపాయలి చ్చేశాడు.

ఇష్టదైవానికి దండం పెట్టుకుని పాకెట్టు ఓపెన్ చేశాడు. నీట్‌గా రెండు పేపర్లు వేసి పాక్ చేశారు. ఒక గ్రీటింగ్ కార్డు... శుభాభినందనలతో, మీరిలాగే ఎన్నో కార్యక్రమాలలో పాల్గొనాలని ఆశిస్తూ- 'మన' టి.వి.

దాంట్లో ఒక ఫోల్డింగ్ హేండ్‌స్టిక్, భగవద్గీత ఉన్నాయి. సడన్‌గా తను ప్రొఫార్మాలో రిటైర్డు క్లర్క్ అని రాసింది గుర్తుకొచ్చింది. రిటైరయిన వాళ్లకు చేతికర్ర, భగవద్గీత తప్ప వేరే జీవితం ఏంలేదా? కంపల్సరీ వేదాంతమా? మల్లికార్జునకి కళ్లు తిరిగాయి. ఇంత ఖర్చూ ఇంతోపికా పెట్టుబడిగా పెడితే వచ్చే బహుమతి ఇదేనా? మల్లికార్జున 'అభాగ్యశాలీ విజేతా' బన్‌గయా!

– మహీధర

---

# డిక్లరేషన్

సాయంకాలం అయిదుగంటలు కావడంతో ఎండ తీవ్రత తగ్గి చల్లటి గాలి వీస్తోంది. మెట్లపక్కగా వున్న మల్లెతీగకి పూసిన పూలు కోస్తూ పక్కింటి పంకజాక్షితో మాట్లాడుతోంది అనంతం. కాలేజికి వెళ్ళిన కొడుకు రఘురాం ఇంకా ఇంటికి రాలేదు. ప్రొఫెసర్ పరశురాం సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆయన ఎప్పుడొస్తారో ఆయనకు తప్ప మరెవరికీ తెలీదు సరికదా ఊహించను కూడా కష్టమే. వంటకి కావలసిన కూరగాయలు తేవడానికి మార్కెట్‌కు వెళ్లాడు బ్రహ్మానందం.

ఏదో కాలక్షేపంకోసం మొదలైన కబుర్లు ఎక్కడెక్కడికో వెళ్ళిపోయాయి. పూలు కోస్తున్నానన్న సంగతి కూడా విస్మరించి చేతిలో పూలపళ్ళెం పట్టుకొని అనంతం ఇటుపక్క, అవతలివైపు కుళాయి దగ్గర నీళ్ళు పడుతున్న సంగతి మరిచిపోయి బిందె నిండి, పొంగి పొర్లి ప్రవహిస్తున్నా పట్టించుకోకుండా ప్రహరిగోడకు అటుపక్క పంకజాక్షి కబుర్ల ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నారు.

పెద్ద శబ్దంతో వీధి గేటు తెరుచుకోవడంతో ఉలికిపాటుగా ఇహలోకంలోకి వచ్చి ఆ వంక చూసింది అనంతం. కొడుకు రఘురాం విసురుగా లోపలికి వచ్చాడు. రేంజర్ని స్టాండు కూడా వెయ్యకుండా గిరాటుపెట్టినట్లు ఓ పక్కగా పడేశాడు. కేరేజీకున్న పుస్తకాలు కూడా తీసుకోకుండా విసవిసా నడుచుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు. కొడుక్కి ఏమైందో ఎందుకలా ఉన్నాడో తెలియని అనంతం ఆందోళనగా అతని వెనకాలే లోపలికి వెళ్ళింది. హాల్లో సోఫాలో కూర్చుని కాలుకున్న షూస్ లేసు కూడా విప్పకుండా కాళ్ళనుంచి లాగి చెరో పక్కా గిరాటు వేశాడు. రెండుచేతుల్తోనూ ముఖం రుద్దుకుంటూ సోఫాలో వెనక్కివాలి పైన తిరుగుతున్న ఫేన్ వంక చూస్తూ కూర్చున్నాడు.

"ఏమైంది కన్నా. అలా వున్నావు" అంటూ లోపలికి వచ్చిన అనంతం చేతిలో వున్న పువ్వుల పళ్ళాన్ని టీపాయ్ మీద పెట్టి కొడుకు పక్కనే సోఫాలో కూర్చుంది. ఓసారి తల్లివంక సీరియస్‌గా చూసి 'హూ...' అని శబ్దంచేసి మళ్ళీ సీలింగ్ వంక చూడడంలో నిమగ్నమైపోయాడు రఘురాం.

"ఏంటమ్మా ఏం జరిగింది? నాతో చెప్పు నాన్నా" అనునయంగా తలపై నిమురుతూ ప్రేమగా అడిగింది కొడుకుని అనంతం.

"ఏం జరగడమేమిటమ్మా... ఛ...ఛ... ఎంత అవమానం. అసలు మామూలుగానే నీ మొగుడివల్ల కాలేజీలో తలెత్తుకోలేక ఛస్తున్నాను. ఈరోజు ఎంతమాటన్నాడో తెలుసా క్లాసులో నలుగురిముందూ..."

చిరాకుపడుతూ అన్నాడు రఘురాం. కోపంతో ముక్కుపుటాలు అదురుతున్నాయి. అసలే తెల్లటి తెలుపేమో ఎర్రగా కందిపోయింది ముఖం.

"అసలేం జరిగిందిరా... నాన్నగారేమన్నారు. నాతో చెప్పచ్చుకదరా. నేనడుగుతాను కదా ఆయన్ని" బుజ్జగింపుగా అడిగింది.

"ఏంటమ్మా నువ్వడిగేది ఆయన్ని. అసలు నేను కాలేజీకి వెళ్ళాలా వద్దా. ఇలా నలుగురిలోనూ అవమానాల పాలుచేస్తుంటే మహానుభావుణ్ణే అడుగు" వ్యంగ్యంగా అన్నాడు రఘురాం.

"ఏంటండీ? ఏమన్నారు బాబుని. ఎందుకంతగా బాధపడుతున్నాడు? " అంటూ కస్సుమని లేచింది మొగుడిమీదకి అనంతం.

"అమ్మా... అమ్మా... మీరంత ఆవేశపడకండమ్మా. అసలే బీ.పీ... కూడా ఉందన్నారు ఈమధ్య" అన్నాడు బ్రహ్మానందం.

"అది కాదే... ప్రాక్టికల్స్ క్లాసులో రికార్డు సబ్ మిట్ చెయ్యలేదు. కారణమడిగా.




ఎలా వెళ్ళగలను. ఎలా చదవగలను" కోపం తగ్గకపోగా మరింత పెరుగుతోంది. అనంతం బతిమాలుతోంది. విషయం చెప్పకుండా ఏమేమో అంటున్నాడు రఘురాం. తల్లీకొడుకులలా వాగ్వివాదాలు చేసుకుంటూ ఉండగానే లోపలికి వచ్చాడు ప్రొఫెసర్ పరశురాం.

ఆయన వెనకనే కూరల బుట్టతో వచ్చాడు వంటవాడు బ్రహ్మానందం. ఏదో వేడివేడి సన్నివేశం ఎదురు కాబోతోంది కాబోలు అనుకున్నాడు మనసులో.

"అదిగో... వచ్చాడుగా నీ పతిదేవుడు. ఆ వారంరోజులుగా ఫీవరన్నాడు"

"అది నిజమేగదండీ" మధ్యలో అంది అనంతం.

"అందుకేకదటోయ్ డిక్లరేషన్ ఇవ్వడానికి మీ ఫాదర్ని తీసుకురా అన్నాను. తప్పా? " సీరియస్‌గా అన్నాడు ప్రొఫెసర్.

అవాక్కయ్యారు ఆ మాటలకి అనంతం, బ్రహ్మానందమూనా!

– సూరిపండు

*

# ఏరినముత్యాలు

❖ మనిషి ఎత్తైన శిఖరాన్ని అధిరోహించగలడు. కానీ అక్కడ అతడు చాలాసేపు ఉండలేడు.

– జార్జ్‌బెర్నార్డ్‌షా

❖ నిజమైన ఆనందానికి అంతరాత్మ పునాది.

– సెనెకా

❖ మీ సమ్మతి లేనిదే మిమ్మల్ని ఎవరూ లోకువ చేయలేరు.

– ఎలినార్ రూజ్వెల్ట్

❖ కోరికలు ఎంత పెరుగుతాయో ఆనందము అంత తరుగుతుంది. కోరికలు ఎంత తగ్గుతాయో ఆనందము అంత పెరుగుతుంది.

– షిర్డీసాయిబాబా

❖ బలప్రయోగం ద్వారా బలవంతంగా మనం శాంతిని స్థాపించలేము. అర్థం చేసుకోవడం ద్వారానే అది సంభవం.

– ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

❖ ఆనందంతో తొణికిసలాడే వ్యక్తి ఉపదేశం చేయకుండానే ఉపదేశిస్తాడు.

– మదర్‌థెరిసా

❖ హోదా హక్కులను లేదా అధికారాన్ని ఇవ్వదు. అది బాధ్యతలను మనపై ఉంచుతుంది.

– పీటర్ డ్రక్కర్

❖ కొంతమంది ఆలోచించడానికి చదువుతారు. వీరు చాలా అరుదైనవారు. కొంతమంది రాయడానికి చదువుతారు. వీరు సర్వసామాన్యులు. కొంతమంది ఉపన్యసించడానికి చదువుతారు. వీరు అధిక సంఖ్యాకులు

– సి.సి.కోల్టన్

❖ తన సంతోషాన్ని కప్పిపుచ్చుకునే వ్యక్తి తన దుఃఖాలను కప్పిపుచ్చుకునే వ్యక్తికంటే కూడా గొప్పవాడు.

– స్వామివివేకానంద

❖ సంతృప్తి సహజ సంపద, ఆడంబరత కృత్రిమ పేదరికం.

– సోక్రటీస్

❖ విరగడం కంటే వంగడం మెరుగైనది.

– స్కాటిష్ సామెత

❖ గొప్ప దృఢ నమ్మకాలు గొప్ప పనులకు తల్లులు.

– స్వామి వివేకానంద

❖ బడికిపోయినంత మాత్రాన మనిషి పండితుడు ఎలా కాలేడో అదే విధంగా గుడికిపోవడంవల్ల మనిషి సాధువు కాలేడు.

– సంస్కృత సూక్తి

సేకరణ: **టి.మహీ**

# చతుర ప్రపంచం

## అత్యంత ఖరీదయిన కాఫీ

లేస్తూనే మనిషి ఆహారం కాఫీ సేవనంతో ప్రారంభమవుతుంది. కొంతమంది బెడ్ కాఫీనే సేవించి బెడ్‌మీంచి దిగితే, మరికొంతమంది బ్రష్ చేసుకోగానే గొంతులో పోసుకుంటారు. ఆ చుక్క పడితేగానీ దైనందిన కార్యక్రమాలు ప్రారంభం కావు. ప్రపంచంలోని అతిఖరీదైన కాఫీని ఇండోనేషియా తయారుచేస్తోంది. పౌను కాఫీ ఖరీదు (సుమారు అరకిలో) 300 డాలర్లు. అంటే 15000 రూపాయలు.

ఇది ఇంట్లో వుండటం అమెరికాలో స్టేటస్ సింబల్. ఈ కాఫీ పేరు కొపి లువాక్. అయితే ఇది తయారయ్యే పద్ధతి తెలిస్తే మాత్రం వెగటనిపిస్తుంది. కాఫీ గింజలను తొక్కుతీయకుండా సివెట్ అనే జాతి పిల్లులచేత తినిపిస్తారు. గింజలు దానికడుపులో వుండగా కేవలం పైతొక్కు మాత్రం జీర్ణం అయి లోపలి భాగం బయటకొచ్చేస్తుంది. అలా బయటకు వచ్చిన గింజలన్నిటినీ సేకరించి కాఫీపొడిని తయారుచేస్తారు. కాఫీ రుచి కొద్దిగా మట్టి వాసన వేస్తుంది.

ఈ పిల్లులు కేవలం ఇండోనేషియాలో మాత్రమే వుంటాయి. అవి కూడా ఎక్కువగా వుండవు. దాంతో ఏడాదిలో తయారయ్యే కొపి లువాక్ కాఫీపొడి తక్కువగా వుంటుంది. అయితే దాని ఉత్పత్తికన్నా గిరాకీ ఎన్నో వేలరెట్లు అధికం కావడంచేత అది అంత ధర పలుకుతోంది.

దాన్ని తయారుచేసేవారికి లభించేది పౌనుకి వంద డాలర్లేకానీ ఇండోనేషియా, అమెరికాలోని మధ్యవర్తుల లాభాలు రెండు వందల డాలర్లు. ఎంతోకాలంగా ఈ కాఫీ విషయం గోప్యంగా వుండటంతో ఇది ఇండోనేషియా వాసులకే పరిమితం అయి వుండేది. కానీ పాశ్చాత్యులకి దీనిమీద మోజు పెరగగానే అది ఇండోనేషియా వాసులకి అందుబాటులో లేకుండా పోయింది. దాన్ని తయారుచేసేవాళ్లలో కొందరు లాభాల మీద మోహంతో ఓ కప్పు కూడా రుచి చూడకుండా అమ్మేస్తున్నారు.



## మన లగ్జరీ రైళ్లు

ఇండియాలో నడిచే ఓ మూడు రైలు సర్వీసులు కేవలం ధనికులకే పరిమితమనిపిస్తాయి. గమ్యాన్ని చేర్చే ఉద్దేశ్యంతోకాక, బయలుదేరిన చోటుకే తిరిగితెచ్చే ఈ మూడు రైళ్లూ టూరిజాన్ని దృష్టిలో వుంచుకుని రూపొందించారు

మొదటిది 'ప్యాలెస్ ఆఫ్ వీల్స్' పేరుగల ట్రెయిన్. ఇందులో ఒక్కో రైలుపెట్టెలో నాలుగు కూపేలుంటాయి. ప్రతి కూపేలో వాల్ టు వాల్ కార్పెటింగ్, బార్ వుండే కాక్‌టెయిల్ ప్లేస్, రాజస్థానీ-ఇండియన్ కాంటినెంటల్ భోజనాలని సర్వ్‌చేసే రెండు రెస్టారెంట్స్‌గల ఈ రైలు... ప్రతి బుధవారం ఢిల్లీనుంచి బయలుదేరుతుంది. జయపూర్, ఉదయ్‌పూర్, సవాయ్ మదోపూర్, థార్ఎడారి, జోధ్‌పూర్, భరత్‌పూర్, ఆగ్రాలకి ఓ ఎనిమిది రోజులపాటు చుట్టి... తిరిగి ఢిల్లీ చేరుకుంటుంది. రైల్లో ఎక్కే ప్రయాణికులకి రంగురంగుల దుస్తులు ధరించిన యువతీయువకులు రైల్లోకి ఆహ్వానిస్తారు.

రెండోరైలు సర్వీసు రాయల్ ఓరియంట్. ఇది కూడా ప్రతిబుధవారం ఢిల్లీ రైల్వేస్టేషన్‌నుంచి బయలుదేరుతుంది. ఇండియన్ రైల్వేస్, గుజరాత్ టూరిజం కార్పోరేషన్ భాగస్వాములై నిర్వహించే ఈ రైలు సర్వీస్ ఉదయపూర్, చిత్తోడ్‌గఢ్, మాహేసానా, అహమ్మదాబాద్, ససాన్‌గిర్, పాలితాన, జయ్‌పూర్‌ల మధ్య తిరిగి ఢిల్లీ చేరుకుంటుంది.

మూడో సర్వీస్ ఫెయిర్‌క్వీన్. దీని ఇంజన్ ప్రపంచం మొత్తంమీద పురాతనమైన ఇంజను. 1855లో ఈస్ట్ ఇండియా రైల్వేస్ కోసం దీన్ని బ్రిటన్‌కు చెందిన కిన్‌స్టన్, థామ్సన్ అండ్ హెవిట్‌సన్ అనే సంస్థ నిర్మించింది. యాభైసీట్లుగల ఫస్ట్‌క్లాస్ బోగీ, రెస్టారెంట్‌ల ఈ రైలుకి నేషనల్ టూరిజం అవార్డ్ లభించడమేగాక, గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్‌లోకి అతి ప్రాచీనమైన రైలుగా ఎక్కింది. నూట నలభైరెండేళ్ల విరామం తర్వాత 1997 నుంచి ఇది తిరిగి ఆరంభమయింది.

ఢిల్లీనుంచి ఇది ఆల్వాల్ (రాజస్థాన్) సరిస్కా టైగర్‌రిజర్వ్‌కి వెళ్లి తిరిగి ఢిల్లీ చేరుతుంది. ఈ మూడు రైళ్లూ ఉత్తర భారత దేశంలోని ప్రధాన యాత్రాస్థలాన్ని దర్శించడానికి నడుపుతున్నారు.

టూరిజం కోసం కాక ప్రజల అవసరాల కోసం ఏర్పాటుచేసిన రాజధాని, శతాబ్ది రైళ్లు కూడా లగ్జరీ రైళ్లే.



# టైప్‌రైటర్

ఇది కంప్యూటర్ యుగం అన్న విషయం పసివాళ్లనుంచి శతాధిక వృద్ధులదాకా తెలిసిన విషయమే. మనిషి దైనందిన జీవితంలో ఎన్నో విషయాల్లో కంప్యూటర్ ప్రాముఖ్యతను సంతరించుకుంది. ఈ టైప్ రైటర్‌ని అమెరికాకు చెందిన క్రిస్టోఫర్ షోల్స్ అనే పెద్దమనిషి కనిపెట్టాడు.

ఇతను మిల్ ఓక్ అనే ఊళ్లో ఓ దినపత్రికకి సంపాదకుడుగా పనిచేసేవాడు. అయితే కీబోర్డ్‌లోని అక్షరాలన్నింటినీ అతను ఆల్ఫాబెటికల్‌గా అంటే ఎ,బి,సి ఆర్డర్‌లో ఏర్పాటుచేశాడు. వాటిని చూసి టైప్ చెయ్యాలి. ఏ అక్షరం ఒత్తినా దాని తాలూకు మెటల్ లివర్ వెళ్లి కాగితంమీద ఓ ప్రత్యేక స్థానంలో కొట్టుకుంటుంది. దీనికున్న రిబ్బన్‌వల్ల ఆ లివర్ చివర వున్న లోహపు అచ్చు అక్షరం ద్వారా అది కాగితం మీద మరో అక్షరానికి స్థానమిస్తూ పక్కకి కదులుతుంది.

అయితే ఈ మెటల్ లివర్స్ ఒకదానికొకటి అతుక్కుని విడివడేవికావు. దాంతో షోల్స్ అనేక దినపత్రికలని పరిశీలించి, ఆంగ్లభాషలో ఏ అక్షరాలను అధికంగా వాడతారనేది లెక్కవేసి చూశాడు. అలా అధికంగా వాడే అక్షరాల లివర్‌ల మధ్యదూరాన్ని పెంచడానికిగాను ఆ అక్షరాలను దూరంగా జరుపుతూ మరో టైప్ రైటర్‌ని నిర్మించాడు. దాన్ని WERTY కీబోర్డ్ అంటారు. కీబోర్డ్‌లోని పై లైన్‌లోని ఆరు అక్షరాలు ఇవి కాబట్టి ఈ కీబోర్డ్‌కాపేరు వచ్చింది.

ఆ కీబోర్డ్ నేటికీ ఎలాంటి మార్పు చెందకుండా వుండటానికి కారణం అది ఇచ్చే సౌకర్యం.

షోల్స్ చేతిరాత బావుండేదికాదు. అది ఓ పట్టాన ఎవరికీ అర్థమయేదికాదు. దాంతో అతని ఉద్యోగానికే ముప్పువాటిల్లింది. ఇది అధిగమించడానికి షోల్స్ టైప్ రైటర్‌ని కనిపెట్టాడని ఓ కథనం.




తన యంత్రాన్ని షోల్స్ 'మాన్‌కైండ్' (Mankind)కి అంకితం చేసినా దాన్ని ఎక్కువగా వాడేది వుమెన్‌కైండ్ (wom-énkind)అవడం విచిత్రం.

కేవలం ఎడమచేతి వేళ్లని మాత్రమే ఉపయోగించి టైప్ చెయ్యగలిగే అతిపెద్ద ఆంగ్ల పదం ఏమిటో తెలుసా? STWARDESS.

# జంతు ప్రపంచం

అనేక సంవత్సరాలు అడవుల్లో జంతువుల సమీపంలో నివశించి పాశ్చాత్యవేత్తలు జంతు, పక్షిగణాల గురించి తెలుసుకున్న కొన్ని ఆసక్తికరమైన వివరాలివి.

రెండో ఏడు వచ్చేదాకా సింహాలు గర్జించలేవు.

హమ్మింగ్ బర్డ్ అనే పక్షి గుండె నిమిషానికి 615 సార్లు కొట్టుకుంటుంది. అంతేకాక ఇది గాల్లో ఎగరకుండా ఒకేచోట రెక్కలు కొట్టుకుంటూ నిలబడగలదు.

ఊసరవెల్లి నాలుక పొడవు పది అంగుళాలు. అంతదూరంలో వున్న పురుగుని ఇది నాలుక చాపి అందుకోగలదు.

ఆఫ్రికన్ గద్ద ఆహారంకోసం 250 చదరపు మైళ్ల ఏరియాను సర్వేచేస్తూ ఎగురుతుంది.

తిమింగలం హృదయం నిమిషానికి కేవలం తొమ్మిదిసార్లు మాత్రమే కొట్టుకుంటుంది.

స్వోర్డ్‌ఫిష్ అనే జాతి చేప నీళ్లలో గంటకి అరవై ఎనిమిది మైళ్ల వేగంతో ఈదగలదు. ఇది చిరుతపులి నేలపై పరుగెత్తే వేగంతో సమానం. కింగ్‌కోబ్రా విషం ఎంత ప్రమాదకరమైనదంటే ఒక్క గ్రాముతో 150 మంది చనిపోతారు.

హిపోపోటమస్ చర్మపు మందం ఎలాంటిదంటే కొన్ని తుపాకుల బుల్లెట్లు దాన్ని ఛేదించలేవు.

ప్రపంచంలోని అతిపెద్ద జీవి అయిన బ్లూవేల్ రోజుకి 15 లక్షల కేలరీల శక్తిగల ఆహారాన్ని లాగిస్తుంది. (మనిషికి కావలసింది కేవలం 1600 నుంచి 2400 వరకూ మాత్రమే మరి)

గ్రే వేల్ కూన రోజుకి 2000 లీటర్ల పాలు తల్లినుంచి తాగుతుంది.

నీలం రంగులో వుండే ఆడ పీత రోజుకి 10 లక్షల గుడ్లను పెడుతుంది.

గుర్రం పిల్ల పుట్టిన 60 రోజులకి రెట్టింపు బరువవుతుంది.

ఓ జంతువునిచూసి అది ఒంటె, చిరుతపులులకు పుట్టిందనుకుని యూరోపియన్స్ దానికి కేమ్‌లియోపార్డ్ అనే పేరు పెట్టారు. అదే జిరాఫీ.

*



# 'పగటిపూట చంద్రుడు' పై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన అక్కినపల్లి సుబ్బారావు నవల
'పగటిపూట చంద్రుడు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఏటిలోని కెరటాలు

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*




స్వచ్ఛమైన స్నేహానికి మచ్చుతునక 'పగటిపూట చంద్రుడు' నవల. వరల్డ్ ట్రేడ్ సెంటర్ మీద జరిగిన దాడి తరువాత అమెరికా సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని, ఇద్దరు వ్యక్తులమధ్య ఉన్న మంచి స్నేహాన్ని, ఆత్మీయతని కలిపి ముడిపెట్టి రచయిత అందించిన నవల అద్భుతంగా వుంది. విశ్లేషణ ఇంకా బాగుంది. ఎంత దూరంలో వున్నా మానస, రాఘవల స్నేహం, వారిద్దరి మధ్య ఆత్మీయత పరిచయం మొదటి నుంచి చివరి వరకు మనసుకి హత్తుకునేట్లుగా వుంది. ఇద్దరి జీవన పరిస్థితులు వేరువేరైనా ఒకరంటే ఒకరికి ఎంతో అభిమానం, గౌరవం. కానీ అది వ్యక్తపరిచే సమయమే రాలేదు చివరి వరకు. మనకోసం మన ఆలోచనలు, సమస్యలు పంచుకునే మనిషి వుంటే ఎంతో బరువు తగ్గినట్లుగా అనిపిస్తుంది. అది ఎంతో అదృష్టం కూడా. మనిషి గుండె గుప్పెడైనా దాని ఊహ ఉప్పెనంత. మానస, రాఘవల మధ్య వున్న స్నేహం, ఒకరంటే ఒకరికి వున్న ఆరాధన, ఒకరి గురించి ఇంకొకరు పడే వేదన తెలిసిన సంధ్య ప్రవర్తన చాలా హుందాగా వుంది.

అగ్రరాజ్యమన్న అహంకారంతో దురాక్రమణకి దిగిన అమెరికా పతనం అలాంటి దురాశవున్న దేశాలకి ఒక గుణపాఠం. క్రూరమృగాల మధ్య పోరాటంలో నలిగిపోయేది లేడి కూనలే అన్నట్లు రెండు దేశాల మధ్య పోరాటం మనిషి మనుగడకే ముప్పు తెచ్చింది. అమెరికా ఆర్థిక, సామాజిక పరిస్థితి ఎంతగా దెబ్బతిన్నదంటే అక్కడ పని చేసే ప్రతి ప్రవాసిని అనుమానించే స్థితి

వచ్చింది. ఇది ఎందరి భవిష్యత్తునో దెబ్బ తీసింది. ఒకప్పుడు తక్కువ జీతాలకి అందరినీ ఆహ్వానించిన అమెరికా ఇపుడు అక్కడ వున్నవారికి నిలువ నీడలేకుండా చేస్తోంది. ఏది ఏమైనా పరిగెత్తి పాలు తాగేకంటే నిలబడి నీళ్లు తాగటం మేలు అన్నట్లు మన దేశానికి మనం అందించే సహకారం మనం దరి మనుగడకు సాధికారం.

ఏటిలోని కెరటాలు ఏరు విడిచిపోవు, ఎదలోపలి మమకారం ఎక్కడికీ పోదు, మానస అంతరంగంలో రాఘవ ఎప్పటికీ జీవించే వుంటాడు. ఒక మంచి నవల అందించిన రచయిత అక్కినపల్లి సుబ్బారావుగారికి ధన్యవాదాలు.

– యన్. ఇందిర
సికింద్రాబాద్

## మనస్తత్వశాస్త్ర మథనం

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

సెప్టెంబరు 11, 2001న అమెరికాలో సంభవించిన దుర్ఘటన తరువాత, ఆ దేశ స్థితిగతులలో వచ్చిన పెనుమార్పులను చక్కటి విశ్లేషణతో కూడిన కథనంతో నడిపిన రచయిత నేర్పు ప్రశంసనీయం. ఈ నేపథ్యానికి రచయిత ఎన్నుకొన్న కథ నూతనమైనది.

ఈ నవలకి పెట్టిన పేరు 'పగటిపూట చంద్రుడు'. ఎవరికి? మానసకి అని మనము భావించాలని ఆ వివరణ పాఠకుల చిత్తానికే వదిలేశారు. మానస, రాఘవ ఇద్దరూ ఉన్నతమైన వ్యక్తిత్వం కలవాళ్లే. ఒకరు ఏ విషయాన్నైనా ముక్కుకు సూటిగా చెప్పగల ధీశాలి. వేరొకరు దేనికీ చలించని గంభీరమనస్కులు. ఈ ఇద్దరి మధ్య ప్రత్యేకత నింపుకొన్న పాత్ర సంధ్య. మానస తన మనసులోని వేదనను తన మనో బాంధవుడయిన రాఘవకి చెప్పి ఊరట చెందుతుంది. కాని అప్పటినుండే రాఘవ మనశ్శాంతిని కోల్పోతాడు. నవల చివర సంధ్య మానసతో అన్న మాటలు ఎవరి గుండెనైనా కదిలించక మానవు. ఆ మాటలే సంధ్య పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని, రాఘవని, మానసని ఎంతగా అర్థం చేసుకొన్నదో మనకు అవగతమౌతుంది.

రాఘవ, మానస ఇద్దరూ ఏనాడూ హద్దులు దాటలేదు. మనసు ఎందుకు అదుపు తప్పుతుందో, ఏ అనూహ్య హస్తం ఈ మానసిక క్రీడను చూసి ఆనందిస్తుందో? ఇవి జవాబు చెప్పలేని ప్రశ్నలని రచయిత చక్కగా మనస్తత్వశాస్త్రాన్ని మదించి రాశారేమో అని అనిపిస్తుంది. అమెరికాలో చోటుచేసుకొన్న మార్పులను, ప్రజలలో వచ్చిన మార్పులను అన్నీ మన కళ్ళకు కట్టినట్లుగా చిత్రించడంలో రచయిత చూపిన ప్రతిభ అభినందనీయం. అమెరికా పట్ల వ్యామోహం ఉన్న నేటి యువతరానికి చక్కటి అవగాహన కల్గించేటట్లుగా చేసిన రచయిత దృక్పథం నిజంగా అభిలషణీయం, హర్షదాయకం.

– ఎన్. విజయలక్ష్మి
ఒంగోలు.

## విరుద్ధ మనస్తత్వాలు

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**2001**, సెప్టెంబరు 11 నాడు అమెరికాలో వరల్డ్ ట్రేడ్ సెంటరుమీద జరిగిన దాడిని ఆలంబనగా చేసుకొని అల్లిన కమనీయ కావ్యం 'పగటిపూట చంద్రుడు'. సైకో అనాలిసిస్‌కి అర్థమైన నవలగా చెప్పొచ్చు. రచయిత అక్కినపల్లి సుబ్బారావు చాలా శ్రద్ధగా సినిమా స్క్రీన్‌ప్లేలాగా కథారచన కొనసాగించడం హర్షదాయకం. విజయనగరంలో ఒక ఫాస్ట్‌ఫుడ్ కాకాహోటల్‌లో అణాకి చిన్న పూరీలు, బేడకి పెద్దపూరీలు ఇచ్చే పద్ధతి,

ఆంధ్రరాష్ట్రంలో ప్రయాణంలో మానసకి ఎదురయిన సంఘటనలు పాఠకుడిని ఆహ్లాదపరుస్తాయి. అలానే అమెరికాలో సెప్టెంబరు 11వ తేదీన వైట్‌హౌస్‌మీద దాడి విఫలమైన తర్వాత గెడ్డం ఉన్నవాళ్లని అనుమానంగా చూడడం, దాంతో ఇండియన్స్ గెడ్డాలు తీసేయడం కాస్త జిజ్ఞాస కలిగిస్తుంది చదువరులకు. ఇండియన్ రెస్టారెంట్స్ బిజినెస్ మందగించడం, బ్రెయిన్ డ్రెయిన్, హెచ్ వీసా, టెక్నికల్ వర్కర్స్ తక్కువ జీతాలతో పనిచేస్తే, లోకల్ అమెరికన్స్ ఇండియన్స్ మీద ఏహ్యాభావం ఏర్పరచుకోవడం, వీసా కాలం ముగిసిన తర్వాత అనుమతి లేకుండా చట్టవిరుద్ధంగా అమెరికాలో ఉంటున్న ప్రజలుగా గుర్తించి వాళ్లకోసం ప్రభుత్వం గాలింపు చర్యలు వంటి నిజాలు ఒంటిని జలదరింపు చేస్తుంది. టెర్రరిస్టు చర్య తర్వాత అమెరికా తీసుకొన్న జాగ్రత్తలు మతోన్మాదులు చేసిన ఆ ఘాతుకంవలన ప్రపంచం అంతా ఇబ్బంది పడడం కళ్లకు కట్టినట్లు చూపారు. అక్కడ రోడ్డుమీద నివసించేవారు బాత్రూం వాడుకోడానికి ఇంకేమీ ఆస్కారం లేక లైబ్రరీ తెరిచే సమయానికి వచ్చి బాత్రూం వాడుకోవడం, లైబ్రరీ ప్రభుత్వం నడుపుతుంది కాబట్టి వాళ్లని లోపలికి రాకుండా ఎవ్వరూ ఆపరని రచయిత రాస్తే ఈ విషయంలో ఇండియాకు ఎంత మాత్రం తక్కువకానని అమెరికా అంటోంది. మానస నిక్కచ్చిగా, నిజాయితిగా, ధైర్యంతో మాట్లాడితే, రాఘవ గోడమీద పిల్లివాటంలా మాట్లాడె రెండు విరుద్ధ స్వభావాల చిత్రీకరణ అందరికీ నచ్చుతుంది. మానస దుఃఖానికి కారణం ఏమిటేమిటి అన్న సస్పెన్స్ సినిమాటిక్‌గా చెప్పడంతో కాస్త ఊరట చెందుతారు పాఠక మహాశయులు. చివరిగా రచయిత జీవితంలో ప్రేమింపబడకపోవడం విచారకరమే కాని ప్రేమించలేకపోవడం చాలా విషాదం అన్న ముగింపుకి హేట్సాఫ్.

**– ఆనందరావ్ పట్నాయక్**

రాయగఢ్

# అస్తమించని చంద్రుడు

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

సెప్టెంబరు పదకొండున వరల్డ్ ట్రేడ్ సెంటర్‌మీద బాంబింగ్ జరిగిన తర్వాత అమెరికాలో నివసించే ప్రజల కడగండ్లు కళ్లకు కట్టినట్లు చూపారు రచయిత. టెర్రరిస్టుల వికృత చర్యకి ప్రపంచమంతా విభ్రాంతితో భయభ్రాంతమయింది. తనకు తిరుగులేదు అనుకున్న అమెరికాకి చెంప పెట్టవడంతో నిప్పు తొక్కిన కోతిలా యుద్ధాలు చేసింది. ప్రతి ఒక్కరినీ అనుమానించింది. భయంతో, అశాంతితో ఊడిన ఉద్యోగాల వల్ల తల్లకిందులైన ఆర్థిక ఇబ్బందులతో ఆ దేశప్రజలందరూ అల్లాడిపోయారు. రాఘవతోపాటుగా మనల్నీ అమెరికా తిప్పారు రచయిత. వర్ణనలు అద్భుతంగా, మనోహరంగా వున్నాయి.

ఈ రోజుల్లో ఆధునికమైన, అభ్యుదయమైన భావాలతోపాటుగా స్వతంత్రేచ్ఛ గల స్త్రీలే ఎక్కువ. మానసలా, సంధ్యలా చదువుతో సంబంధం లేదు. కష్టపడి తమని తాము పోషించుకునే ప్రతి ఒక్కరూ తమదైన వ్యక్తిత్వంతో ప్రకాశిస్తున్నారు. వీళ్ళంతా సరసరా సాగిపోయే భాను రేఖల్లాంటివారు. అన్నీ వున్నా నిండుకుండలా తొణకక చల్లగా సాగిపోతూ వెన్నెల పంచే రాఘవలాంటివారు కొందరుంటారు. విమర్శలు చేయగల విజ్ఞానం వున్నా ఎదుటివారిని నొప్పించలేక, రెచ్చగొట్టకుండా మౌనం వహించడం ఉత్తమమని రాఘవ పాత్ర చెప్తుంది. మానస భర్త సంతోష్‌లాంటివారు, రాహువులాటివారు. మానస సంతోషాన్నీ, ఇరవైయేళ్ళ కష్టార్జితాన్ని మింగినవాడు. అయినా మానస విడాకులు తీసుకోదు. దుఃఖంలో కూరుకుపోతూ రాజీ

పడుతుంది. ఆమె చీకటి జీవితానికి ఊరట కలిగించే చంద్రుడు రాఘవ. రాఘవ వివాహితుడు. మనసు చుట్టూ నీతినియమాలనే కంచె కట్టుకున్నాడు. అయినా మానస నవ్వుల పువ్వులు, హాస్యఝురులు కంచె దాటి మనసుమీద పడుతుంటాయి. ఎప్పటికో చివరిదశలో గుర్తిస్తాడు. తన హృదయ పాత్రనిండా మానసపై ప్రేమ నిండివుందని. రాత్రిని పాలకడలిగా మార్చగలిగేది చంద్రుడే అయినా పగటిపూట చంద్రుడు వెలాతెలా బోతుంటాడు. కానీ రాఘవ అలా కాదు. ఇద్దరు స్త్రీల హృదయాకాశంలో ఎన్నటికీ అస్తమించని చంద్రుడు.

– లతా ప్రసాద్

సిరిపూర్ కాగజ్‌నగర్-504 296

## జాడలేని జాబిలి

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

నవంబర్ చతుర నవల 'పగటిపూట చంద్రుడ్ని' ఎవరూ చూడలేరనిపించింది. కారణం "పగలే వెన్నెలా- జగమంతా ఊయలే" అయితే కోర్కెల గుర్రాలకి మరి కళ్లాలుండవు కదా!

బహుశా రచయిత 'ప్రేమికులు'కి, 'స్నేహితులు'కీ మధ్య ఉన్న అనుబంధాన్ని పైకి తీయడానికి ప్రయత్నించినట్లుంది. ఆ ప్రయత్నంలో మానసా, రాఘవులను అటు 'ప్రేమికు'లుగా గాని, ఇటు 'స్నేహితులుగా' గాని ప్రతిష్టించలేకపోయారు.

గాజులు గలగల మనిపించి, మాటలు భళభళమనిపించి, కళ్లతో అన్నీ చెప్పినా ఏదీ గ్రహించుకోలేని జటుడు రాఘవుడు. తన చదువు, పరిశోధన కావాల్సినప్పుడు మానసకి సహాయం చేయటం ఇత్యాదివి తప్ప ఇంకో కోణంనుంచి చూడలేకపోయాడీ అభినవ ప్రవరుడు. అలాగని మానస 'మోడర్న్' వరూధినీ కాలేకపోయింది. పర్యవసానం ఇద్దరి మనసుల్లో అంతర మథనం. ఆడది చిటికన వేలందిస్తే మండవరకూ మింగగల ఈకాలం పురుషపుంగవులకీ రాఘవ్‌కీ ఎంత వ్యత్యాసమో. అలాగని "నిన్ను ప్రేమిస్తున్నాను" అని తెగేసి చెప్పగల ధైర్యం మానసకి లేదు.

ఫలితం స్వయం ప్రకాశంలేని చంద్రుడులాంటి రాఘవుడికి మానస ప్రసరించిన సూర్యకిరణాలు పనిచేయక పగటిపూట కనపడని చంద్రుడులాగ ఉండిపోయి చివరకు పెర్మనెంటుగా అమావాస్యచంద్రుడైనాడు.

ఈ ఇతివృత్తంని నూరు పేజీలు లాగడానికా అన్నట్లు అమెరికా వాతావరణం వాడబడింది తప్ప చాలామట్టుకు అప్రస్తుతమనుకోవాలి.

పగటిపూట కూడా చంద్రుడెంత మెరుస్తాడో అనుకుని చదివినవారికీ నవల చాలా నిరుత్సాహపరుస్తుందనడం అతిశయోక్తి కాదనుకుంటాను.

– వి. లలితాంబ,

పర్లాకిమిడి

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78






# రుచి పచి లేని రోజులకిక గుడ్ బై...

అసలైన సాంబారు రుచి, రసంలోని ఘుమఘుమలు మర్చిపోలేని గరంమసాలా ఘాటు. ఇప్పుడు మీ అభిమాన 'ప్రియ' అందిస్తోంది ఇవన్నీ. మెరుగైన నాణ్యత, మర్చిపోలేని రుచులతో వస్తున్నాయి 'ప్రియ' వారి సాంబారు, రసం, గరంమసాలా పొడులు. ఒక్కసారి వండిచూడండి.

మీ 'ప్రియ' రుచుల్ని ఆస్వాదించండి.






priya™

*Masala Powders*

• సాంబారు పొడి • రసం పొడి • గరంమసాలా పొడి